




**మీరు మృదువుగా వేపొరబ్ రాస్తె అది వెంటనే వెచ్చదనాన్నిచ్చి హాయిని గొలుపుతుంది....మీపిల్లవాడు సులభంగా శ్వాసను పీల్చుకొని రాత్రంతా హాయిగా నిద్రపోతాడు.**

బాధ నివారణకు మీ పిల్లవాడు మీ మీద ఆధారపడతాడు.
అతడు రొంపతో బాధపడుతున్నప్పుడు విక్స్ వేపొరబ్ రాయండి.
ఛాతి గొంతుక, వీపు మరియు ముక్కుచుట్టుప్రక్కల మీ ప్రేమపూర్వక చేతులతో విక్స్ వేపొరబ్ మర్ధన చేస్తే, మీ కళ్ల ముందే ముక్కు దిబ్బడ పోవడం ప్రారంభమవుతుంది. అతడు తిరిగి సులభంగా శ్వాసను పీలుస్తాడు. ఎందుకంటే ఔషధ ఆవిరులు ఏడు సెకండ్లలోనే జలుబు భారమున్న చోట్లకి చేరతాయి. అప్పుడు పిల్లవానిని చక్కగా పరుపు మీద పడుకోబెట్టండి. అతడు దాగా నిద్రపోతూంటే వేపొరబ్ రాత్రంతా పని చేస్తూంటుంది, తెల్లవారే టప్పటికి జలుబు భారమంతా పోతుంది. అతడు లేచేటప్పటికి హాయిగా, ఆరోగ్యంగా వుంటాడు... ఆటలతో మురిపించే మీ ముద్దు బిడ్డ.




# విక్స్ వేపొరబ్ జలుబులకు ఈ రాత్రేరాయండి

NAS b233c






ముఖచిత్రం: నెలగంట పెట్టారు!

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

---


యువ సాలు చందా — 12-00

దీపావళి ప్రత్యేక సంచికతో — 17-00

యువ, పోస్ట్ బాక్స్ 216, హైదరాబాద్-1




డిశంబరు నెల యువ సర్వాంగసుందరంగా ఉంది. 'కమలిన కమలం', 'శిరీష పుష్పం' కథలు చాలా బాగున్నాయి. వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలు యువకు అత్యంతాకర్షణ అని చెప్పక తప్పదు.

సయ్యద్ హుస్సేన్
దేవరకొండ

డిశంబరు యువలో ప్రచురించిన రమేశచంద్ర దత్తుగారి "మహారాష్ట్ర జీవన ప్రభాతం" కథ చాలా బాగుంది కొడవటిగంటి కుటుంబరావుగారి "గూఢచారి-గుండెకాయ" కథ చాలా బాగుంది. సీరియల్ "చక్రవాకం" అత్యంత ఆకర్షణీయంగా సాగుతున్నది. రచయిత్రికి నా అభివందనలు.

నాశం బాలరాజేశ్వరి
బరంపురం

డిశంబర్ బుచ్చిబాబు అజ్ఞానం జ్ఞానాన్నె యిచ్చింది. అమోఘం,

ఎన్నార్
రాజమండ్రి

డిశంబరు సంచికలో ప్రచురించిన 'శిరీష పుష్పం' కథ చాలా బాగుంది. వారణాసి శీతామాణిక్యాంబగారికి, ఇంత మంచి కథను ప్రచురించిన మీకు హృదయపూర్వకాభినందనలు. ముప్పాళ రంగనాయకమ్మగారి సీరియల్ నవల 'ఇదే నా న్యాయం' చాలా బాగుంది. కథ నంతా ఒక్కసారిగా ప్రచురి స్తే చదవా లని ఆతృతగా ఉంది.

వెంపటి వెంకటేశ్వర్రావు
పూనా

డిశంబరు 'యువ' చదివాను. అన్ని కథలు అద్భుతంగా నున్నవి. శ్రీమతి కౌశల్యాదేవిగారి 'చక్రవాకం' సీరియల్ నవల నన్ను ఎంతగానో ఆకర్షిస్తున్నది. ఆ రచయిత్రికి నా నూతన సంవత్సర శుభాశీస్సులు 'యువ' పత్రిక ద్వారా అందజేస్తున్నాను. అందజేసే 'యువకు' కూడా నా శుభాశీస్సులు.

వై. కె. మూర్తి
విజయవాడ-2

డిశంబరు నెల సంచికలో ప్రచురించిన 'శిరీష పుష్పము', 'కమలిన కమలం' కథలు చాలా బాగున్నవి. 'చక్రవాకం' 'ఇదే నా న్యాయం' సీరియల్స్ చాలా ఆసక్తి జనకముగా సాగుతున్నాయి. బుచ్చిబాబుగారి 'అజ్ఞానము' సంచికకు ప్రత్యేకము.

కుమారి వసుంధరదేవి, కె.
పెనుకొండ

# జయశ్రీ

## సంక్రాంతి ప్రత్యేక సంచిక

**1/4 డెమ్మీ సైజు : : వెల: రు. 1-50**

గోరాశాస్త్రి

రాచకొండ విశ్వనాధశాస్త్రి

కొడవటిగంటి కుటుంబరావు

బుచ్చిబాబు

అవసరాల రామకృష్ణారావు

గొల్లపూడి మారుతీరావు

ముప్పాళ రంగనాయకమ్మ

పవని నిర్మలప్రభావతి

వి. ఎస్. రమాదేవి

ఆచంట శారదాదేవి

యద్దనపూడి సులోచనారాణి

డా॥ సి. నారాయణరెడ్డి

దాశరధి

బోయి భీమన్న

దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్ల రచనలు

సినిమా వ్యాసాలు :

గుమ్మడి, పద్మిని.

---

సాహిత్య వ్యాసాలు, మన రాజకీయాలు, ఇంకా మరెన్నో

యితర వ్యాసాలు, జోకులు, కార్టూన్లూ

---

— మేనేజరు

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 15 జనవరి, 1967 సంచిక 1


**1967** వచ్చింది; 1966 వెళ్ళిపోయింది. కొత్త సంవత్సరం ఎలా వుంటుందో తెలియదుగాని, గడచిపోయిన సంవత్సరం మాత్రం మనలను ఎన్నోవిదాల బాధపెట్టి వెళ్ళింది. గడచిన రోజులను తలచుకుంటే, గత సంఘటనలను సమీక్ష చేసుకుంటే, మన పొరపాట్లను దిద్దుకోవటానికీ, నివారణీయములైన ఇబ్బందులనుంచి తప్పించుకోవడానికీ, గతంకంటె భవిష్యత్తులో అభ్యుదయాన్ని సాధించడానికి కృషి చెయ్యడానికీ మార్గాలను అన్వేషించడానికి వీలుకలుగుతుంది.

గతించిన సంవత్సరాన్ని పూర్తిగా సమీక్ష చేస్తే, మనం అభ్యుదయ మార్గంలో ఒక అడుగుకూడా ముందుకు వెయ్యకపోగా, ఎన్నో అడుగులు వెనక్కు వెళ్ళామన్నమాట స్పష్టమవుతున్నది.

1966 సంవత్సరం ఆరంభమవడంతోనే దేశానికి తీరని నష్టం కలిగింది. పాకిస్తాన్‌తో స్నేహసంబంధాలను పెంపొందించుకోవడానికి ప్రాతిపదికగా ఒడంబడికపై సంతకం పెట్టిన రాత్రే. టాష్కెంట్‌లో హఠాత్తుగా ప్రధానమంత్రి లాల్‌బహదూర్ మరణించడం జరిగింది. దృఢ సంకల్పంతో, మొక్కవోని నిజాయితీతనంతో పరిపాలన సాగిస్తూ,

అచిరకాలంలోనే స్వదేశీయుల మన్ననలనూ, విదేశీయుల అభిమానాన్నీ పొందగలిగిన సమర్థుడు, లాల్ బహదూర్. ఆయన మరణంతో, కేంద్ర ప్రభుత్వంలో ఐకమత్యత పోయింది. పరిపాలనలో పటిష్ఠత తగ్గింది. ప్రభుత్వవర్గాలలో ముఠాలు ఏర్పడడం, పరిపాలన నిష్పక్షపాతంగా జరగడానికి తగిన వాతావరణం లేకపోవడం జరిగింది. 1967 లో ఎన్నికలు జరిగి, పార్టీ బలమూ, వ్యక్తిగత స్తోమతా గల ప్రధాన మంత్రీ, ఇతర మంత్రులూ గల మంత్రిమండలి ఏర్పడితేగాని, దేశం ఎదుర్కొంటున్న సమస్యలను సరిగా పరిష్కరించడం సాధ్యంకాదు.

సంవత్సరారంభంలో పరిపాలనా దక్షుడైన ప్రధాన మంత్రిని పోగొట్టున్న భారతదేశం, సంవత్సరం మధ్యలో తన రూపాయి విలువను పోగొట్టుకున్నది. 1966 జూన్ నెలలో భారత ప్రభుత్వం రూపాయి మారకపు విలువను తగ్గించింది. దానితో, మన ఆర్థిక వ్యవస్థ చాలా దెబ్బతిన్నది. ఆహార ధాన్యాలనుకూడా విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్న మనం, మన దిగుమతు లన్నిటికీ నూటికి దాదాపు అరవై వంతులు ఎక్కువగా మనం డబ్బు చెల్లించవలసి వస్తున్నది. ఎగుమతుల వల్ల ఎక్కువ విదేశీ ద్రవ్యాన్ని సంపాదించినట్లయితే, మనం చెల్లించే డబ్బును సరిపెట్టుకోవచ్చును; కాని, అలాంటి పరిస్థితులు మనకు సమకూడలేదు. మన ఎగుమతుల విలువ తగ్గిపోగా, దిగుమతుల విలువ హెచ్చిపోయింది. విదేశాలకు మనం ఇవ్వవలసిన అప్పు విపరీతంగా పెరిగిపోయింది. అప్పుకోసమూ, ఆహార ధాన్యాలకోసమూ అమెరికామీద ఆధారపడడమూ, ప్రస్తుతపు కాటక పరిస్థితులనుంచి బయటపడడానికి జోలె పట్టుకుని నిలబడ్డా, తగిన సహాయాన్ని యివ్వడానికి అమెరికా సుముఖత చూపకపోవడమే కాక, ఇదివరకు చేస్తానన్న సహాయం చెయ్యడంలోకూడా బెట్టుసరి చూపడం జరుగుతోంది.

స్వాతంత్ర్యం వచ్చి ఇరవై సంవత్సరాలు కావస్తున్నది. మనకు కావలసిన ఆహారధాన్యాలను కూడా పండించుకోలేని దౌర్భాగ్యస్థితిలో

మనం వున్నాము. మన దేశంలో వ్యవసాయ యోగ్యమైన భూమిలో సక్రమంగా వ్యవసాయం చేస్తే, మనకు కావలసిన ఆహార ధాన్యాలనే కాక ఎగుమతి చెయ్యడానికికూడా మనం పండించగలము. కాని, అలా జరగకపోవడానికి కారణం ఏమిటి? మొదటినుంచీ, విదేశాల సహాయం మీద ఆధారపడడం అలవాటుచేసుకొని, స్వయంపోషకముగా మన దేశాన్ని అభివృద్ధిమార్గంలో నడపదగిన శక్తి నాయకులకు లేకపోవడమా? అప్పుచెయ్యడం, బిచ్చమెత్తడం ఈ రెంటికీ అలవాటుపడి, రేపటి మాట మరచిపోయి, నేడు ఎలాగో ఒకలాగున గడిస్తే చాలుననే ఉదాసీనతతో, సార్థకమైన కృషి చెయ్యడానికి భారతీయ ప్రజలు విముఖులు కావడమా? ఏమైనా, మనం చాలా దౌర్భాగ్యస్థితిలో వున్నాము. అనేక విధాలుగా కృషిచేసి అభివృద్ధికి వస్తున్న అనేక దేశాలు మనల్ని చాలా హీనదృష్టితో చూస్తున్నాయి. లేకపోతే మన రూపాయి విలువను తగ్గించుకోవలసిన అవసరం మనకు లేదు. ఒకప్పుడు మన రూపాయికి విదేశాలలో రెట్టింపు విలువ వుండేది. ఈనాడు పదోవంతు విలువకూడా లేదు.

రెండవ ప్రపంచ యుద్ధంలో అన్నివిధాలా దెబ్బతిని, అధోగతిని అందుకున్న జర్మనీ, యుద్ధానంతరం పదేళ్ళలో చాలా గొప్ప స్థితికి వచ్చింది. భ్రష్టమైపోయిందనుకున్న జపాను, నేడు అమెరికాకన్న ఎక్కువగా అర్థికస్తోమతను సంపాదించుకున్నది.

రెండవ ప్రపంచ యుద్ధంలో మనదేశం ఏమీ నష్టపడకపోగా, దాదాపు వెయ్యికోట్ల రూపాయల విదేశీ ద్రవ్యాన్ని ఆర్జించుకున్నది. ఈ డబ్బుతో, పెద్ద పెద్ద పరిశ్రమలకు కావలసిన యంత్రాలను దిగుమతి చేసుకొని భారతదేశంలో ఎన్నో పరిశ్రమలను పెంపొందించుకోవడానికి బదులు, విలాస వస్తువులను దిగుమతి చేసుకొని ఎన్నోకోట్ల రూపాయలను వృథాగా వ్యయం చేసుకోవడం జరిగింది. చిట్టచివరకు గంజిమెతు

కులకు కూడా విదేశాలలో జోలె పట్టుకొని తిరుగవలసిన పరిస్థితిని తెచ్చిపెట్టుకున్నాము. ఇంతకన్న అవమానకరమైన స్థితి ఏముంది?

ప్రతివ్యక్తీ, ప్రతిగ్రామమూ, బాగా ఆలోచించుకొని, వ్యక్తి పౌరుషాన్నీ, దేశ గౌరవాన్నీ నిలబెట్టుకోవడానికి దీక్ష పూని కృషిచేసినట్లయితే, 1967 పూర్తిఅయి 1968 వచ్చేటప్పటికి ఆహార ధాన్యాల కొరకు విదేశాలలో ముష్టిఎత్తే పరిస్థితినుంచి మనం విముక్తి పొందగలము. ఆనాడు మన దేశానికీ, మన డబ్బుకీ, మనదేశంలోని ప్రతి పౌరుడికీ విదేశాలలో గౌరవం లభిస్తుంది. ఆహారధాన్యాల ఉత్పత్తి విషయంలో ఇప్పటికైనా మనం శ్రద్ధ వహించకపోతే, మనం ఎంత అధోగతికి పోతామో ఊహించడానికి వీలులేదు.

1966 సంఘటనలను సమీక్షచేసి 1967లో మన కర్తవ్యాన్ని నిరూపించుకోవడంలో మన ఆహారోత్పత్తికి ప్రధానస్థానం ఇవ్వాలి.

మరొక ముఖ్య విషయం: 1966లో ఉక్కు-ఫాక్టరీకొరకు ఆంధ్ర దేశంలో జరిగిన ఆందోళన. న్యాయమైన కోరికను స్పష్టపరచడానికి శాంతియుతంగా ఆరంభమైన ఆందోళన, చిట్టచివరకు దౌర్జన్య, విధ్వంసన కాండగా పరిణమించడం శోచనీయం విధ్వంసన చర్యలకు ఏ ప్రభుత్వమూ లొంగకూడదు; ఆర్థిక, పారిశ్రామిక సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వదృష్టిని సక్రమమార్గాలలో మళ్ళించడం ప్రజల కర్తవ్యమే. కాని, ప్రజలు విధ్వంసనచర్యలకు పాల్పడకూడదు. రెండూ నిజమే. కాని, ప్రజల కోరికలను, అందులోనూ న్యాయమైనవాటిని పరిస్థితులు విషమించకుండానే నెరవేర్చడం ప్రభుత్వ ధర్మం. నేటి ప్రభుత్వమే, ఆంధ్రుల కోర్కెలను మన్నించి ఉక్కు-ఫాక్టరీని విశాఖపట్టణంలో స్థాపించడానికి నిర్ణయిస్తే, ప్రభుత్వంపట్ల ఆంధ్రులకు గౌరవం కలుగుతుంది. ప్రభుత్వంపట్ల ప్రజలకు భయంకన్న గౌరవం వుండడం దేశానికి మంచిది.

1966లో ఢిల్లీలో జరిగిన అల్లరులు చాలా అసహ్యామైనవీ, అవమాన కరమైనవీ కూడా. గోవధను నిషేధించమని కోరడానికి ఢిల్లీలో జరిగిన ప్రదర్శన, దౌర్జన్య భూయిష్టం కావడం, ఆ ఉద్యమానికిగాని, ఆ ఉద్యమ నిర్వాహకులకుగాని ఏమీ గౌరవప్రదమైనది కాదు. గోవధ నివారణకు ప్రజలలో ప్రచారంచేసి, గోవులపట్ల దాక్షిణ్యం చూపవలసిందని బోధ చెయ్యడానికి మారుగా, గోవధను నిషేధించమని ప్రభుత్వాన్ని బలవంత పెట్టడం, దయార్ద్రహృదయులు చెయ్యవలసిన పనికాదు. శాసనరీత్యా ఇలాటి సంస్కరణలను అమలుజరుపడం సాధ్యమేనా? మద్యపాన నిషేధము ఎంతవరకు ఫలించింది? గోవును తల్లిగా పూజించడానికి అలవాటు పడిన దేశం మనది. నిజమే, కాని గోసంరక్షణ కార్యకలాపాలు నిర్ణీత పద్ధతిలో ఎక్కడైనా సాగుతున్నవా? గోసంరక్షణ, గోపోషణ కార్యక్రమాలను శాంతియుతంగా జరపడానికి ఏ శాసనమూ అడ్డులేదే! అలాటి కార్యక్రమాలను ప్రారంభించి, క్రమేణా ప్రజల భావాలలో మార్పును తీసుకొనిరావడానికి కృషిచేసినట్లయితే, గోహత్యానిరోధం చక్కగా జరుగుతుంది. ఈ కార్యక్రమాలు బాగా సాగుతున్నప్పుడు, ప్రభుత్వ సహాయాన్నికూడా కోరవచ్చును. అంతేగాని, దౌర్జన్యచర్యల వల్లనూ, విధ్వంసన కార్యక్రమాలవల్లనూ గోహత్యను నిరోధించాలని ప్రయత్నించడం ఎంతమాత్రం ఫలించదు. ఇలాటి విధ్వంసన చర్యలు ఢిల్లీలో జరగడం, మనం సిగ్గుపడవలసిన విషయం.

మొత్తంమీద 1966 సంవత్సరం మనకు మంచిసంవత్సరం కాదు. కాని అది వెళ్ళిపోయింది. 1967 సంవత్సరం మనకు మంచి సంవత్సరం అవాలి. అది అలా అయేటట్టు చేసుకోవడం మనచేతిలోనే వుంది. మన కర్తవ్యాన్ని గుర్తించి, కృషిచేస్తే మనం యీ సంవత్సరంలో చాలా బాగుపడగలం.

---

# చిత్రవార్తలు

ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయాధిపతి శ్రీ పి. జగన్ మోహన్ రెడ్డి ది 10-12-66 న హైదరాబాదు ట్రాఫిక్ సేఫ్టీకోర్ కు ప్రారంభోత్సవం జరిపారు. శ్రీ వి. బి. రాజు అధ్యక్షత వహించారు.





ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, కొత్తగూడెం థర్మల్ స్టేషనుకు ప్రారంభోత్సవం జరిపారు. ఎలక్ట్రిసిటీబోర్డు ఛైర్మన్ శ్రీ జె. వి. నరసింగరావు, ఇతర ఉద్యోగులుకూడా వున్నారు.





కుటుంబనియంత్రణ ప్రచారకులు లేడీడాక్టరువద్ద శిక్షణ పొందుతున్నారు.



భారత విశ్వవిద్యాలయాల సమిష్టి జట్టుకూ వెస్టిండీస్ బృందంవారికీ డిశంబర్
మొదటివారంలో జరిగిన క్రికెట్ మాచ్.




అమితరాయ్ బారిస్టరు. అమితుడితండ్రి ఉద్దండుడైన బారిస్టరుగా ఉండి, మూడు తరాలవాళ్ళు పాడుకొదగినంత డబ్బు మిగిల్చిపోయాడు. అమితుడు కలకత్తా

విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడు కాకుండానే ఆక్స్ఫర్డ్ వెళ్ళి, ఏడేళ్ళపాటు పరీక్షల పైన దండయాత్రలు చేశాడు. అతను మరీ తెలివిగలవాడు కావడంచేత అధ్యయనాశక్తి లేకపోయింది. అతని జ్ఞానంలో ఉండిన లోపాలు బుద్ధిసూక్ష్మంతో కప్పిపెట్టేవాడు.

సాహిత్యం గురించీ, కవిత్వం గురించీ అమితుడికి గాఢమైన అభిప్రాయాలుండేవి. ప్రతిభావంతుడికి మాత్రమే నిజమైన శైలి ఉంటుంది. రచయితలో భాషను చాలా హేయమైనది. మనదేశంలో భాషనుకే చలామణీ జాస్తి. స్వయం ప్రతిభను ఎవరూ ఆదరించరు. అందుకే దక్షయజ్ఞానికి భాషనులో ఉండే ఇంద్ర చంద్ర వరుణాదులు ఆహూతులయారు. అనన్యప్రతిభ గల శివుడు ఆహ్వానించబడలేదు.

పాశ్చాత్య రచయితలలోకూడా విఖ్యాతులంటే అమితుడికి మంట. వాళ్ళను చదవకుండానే మెచ్చుకుని ఎవడైనా విమర్శకుడనిపించుకోవచ్చు. కనుక, అమితుడు వాళ్ళ రచనలు చదవకుండానే తిట్టేవాడు.

అమితుడికి ఇద్దరు చెల్లెళ్ళున్నారు. వారి ముద్దుపేర్లు సిసీ, లిసీ. వాళ్ళు ఎప్పుడూ ఎత్తుమడమల పాదరక్షలు ధరించి అతి ఆధునికమైన దుస్తులు వేసుకుంటారు. అమితుడు ఆడపిల్లలందరితోనూ చాలా చనువుగా ఉంటాడు. వాళ్ళు అతన్ని బాగా ఆకర్షిస్తారుగాని, అతనిమనసు ఏ ఒకతెపైనా గాఢంగా లగ్నంకాదు: అతను అందరాడపిల్లలతోనూ ఛలోక్తు లాడతాడు.

"అమితా, ను వెందుకు పెళ్ళాడవు?" అని సిసీ, లిసీ అతన్ని అడుగుతారు.

"పెళ్ళాడటానికి పిల్లలంటూ ఉండటం ప్రధానం కద," అంటాడు అమితుడు.

"ఇంకా నయం! పిల్లలే కరువయారా?"

"వెనకటి రోజుల్లో పిల్లజాతకం చూసి చేసుకునేవారు. నాకు జాతకాలతో పనిలేదు. నేను పెళ్ళాడేది సాటిలేనిదిగా ఉండాలి. అలాంటిది ప్రపంచంలో మరొకతె ఉండరాదు."

అమితుడు పెళ్ళాడడని అతని బంధువులూ, మిత్రులూ రూఢి చేసుకున్నారు. అతనికి సంసారభారం వహించే దక్షతలేక కలలుగనడంలోనూ, ఘోరమైన అభిప్రాయాలు ప్రకటించి జనాన్ని షాక్ చెయ్యడంలోనూ కాలయాపన చేస్తున్నాడు.

అతని చెల్లెళ్ళకు మరీ బాధకలిగించినవి అత ననేమాటలు. ఎలాటి మర్యాదగల సమావేశంలోనైనా అతను నోరు తెరిచి ఏం మాట్లాడతాడో, అందరికీ ఎంత జుగుప్స కలిగిస్తాడో చెప్పడానకిలేదు. ఒకసారి ఒక రాజకీయ తత్వవేత్త ప్రజా

తంత్రాన్ని పొగడుతూంటే అమితుడు అడ్డొచ్చి, "సతీదేవి కళేబరాన్ని విష్ణువు నూరుఖండాలు చేసి విరజిమ్మితే ఒక్కొక్క ఖండం పడిన స్థలమల్లా ఒక పవిత్ర క్షేత్ర మయిందట. ప్రభుతంత్ర కళేబరం తాలూకు ఖండాలు చెదురుమదురుగా పడితే, వాటిని ఈనాటి మన ప్రజాతంత్రం ఆరాధిస్తోంది. ఎక్కడబడితే అక్కడ బుల్లి బుల్లి ప్రభువులు — రాజకీయ ప్రభువులు, సారస్వత ప్రభువులు, సామాజిక ప్రభువులు — పుట్టుకొస్తున్నారు. అందరూ హీనులే. ఒక్కడికీ ఆత్మవిశ్వాసం లేదు," అన్నాడు.

మరొకసారి స్త్రీ జనోద్ధరణకు కంకణం కట్టుకున్న సంఘసంస్కర్త ఒకాయన స్త్రీలపట్ల పురుషు లవలంబించే దౌర్జన్యాన్ని ఖండిస్తూఉంటే అమితుడు, "మగవాడి దౌర్జన్యం అంతమైననాడు ఆడదాని దౌర్జన్యం ఆరంభ మవుతుంది. దుర్బలుల దౌర్జన్యమంత భయంకరమైనది లేదు," అన్నాడు.

స్త్రీలూ, స్త్రీ పక్షపాతులూ ఏకకంఠంతో, "అంటే ?" అన్నారు.

"బలంగలవాడు బలప్రయోగంతో బలహీనుణ్ణి బంధిస్తాడు. బలహీనుడు బలవంతుణ్ణి బంధించటానికి ముందు మచ్చుమందు ప్రయోగించి, మతి పోగొట్టి మరీ బంధిస్తాడు. స్త్రీలవద్ద చాలా మచ్చుమందులున్నాయి. ప్రకృతి వాటిని వాళ్ళకు అనంతంగా అందిస్తుంది," అన్నాడు అమితుడు.

ఒకరోజు బాలీగంజి సాహిత్యసభలో రవీంద్రనాధ టాగూరు కవిత్వచర్చ జరిగింది. అమితుడు, ఎన్నడూలేనిది, ఆనాటిసభకు అధ్యక్షత వహించడానికి ఒప్పుకున్నాడు. ఒక పాతకాలపు వక్త రవీంద్రుడి కవిత్వం కవిత్వమేనని నిరూపించడానికి ప్రయత్నించాడు. ఒకరిద్దరు ప్రొఫెసర్లు మినహాగా అందరూ ఆయన వాదనను ఆమోదించారు.

అప్పుడు అధ్యక్షుడు మాట్లాడడానికి లేచాడు.

"కవి అయినవాడు తన ఇరవయ్యయిదోఏడు లగాయతు ముప్పయ్యోఏడుదాకా, అయిదేళ్ళపాటు, కవిత్వం రాయాలి. ఆతరవాత వచ్చేవాడు అంతకన్న మంచి కవిత్వం రాయాలని కోరం. తద్భిన్నంగా రాస్తేచాలు. మామిడిపండ్ల తరుణం అయిపోయాక మామిడిపళ్ళు అడగం. మాంచి సీతాఫలాలు అడుగుతాం. నీళ్ళ కొబ్బరికాయలు క్షణికమైనవి. ఎండుకొబ్బరి ఎల్లకాలమూ నిలవుంటుంది. కవులు క్షణికులు, తాత్వికులు శాశ్వతులు. ఈ రవీంద్రనాధటాగూరు గురించి నా ఆక్షేప ణేమిటంటే, ఆయన ఎంతకీ వదలడు. ఆయన మనని వదలనప్పుడు మనమైనా ఆయనను వదలాలి. ఒకే కవిని పట్టుకుని ఆరాధిస్తూపోవడం మహాపాతకం. టాగోరుభక్తులు

మహాద్రోహం చేస్తున్నారు. వాళ్ళకుట్రను నేను బయటపెడతాను," అన్నా డతను.

అత నింకా రవీంద్రుడి కవిత్వాన్ని ఆక్షేపిస్తూ, "ఆయన కవిత్వం ఆయన దస్తూరి లాగే గుండ్రంగా, సొంపుగా, ఉయ్యాల ఊపుగా ఉండి, గులాబీలనూ, స్త్రీల ముఖాలనూ, చంద్రబింబాన్నీ స్ఫురింపజేస్తుందనీ, అలా ప్రకృతిని అనుకరించడం అనాగరికమనీ, కవిత్వమంటే మెరుపులా, నరాల సలుపులా, ముళ్ళుకుల్లా, కత్తి నరుకుల్లా ఉండాలనీ అన్నాడు. తాజ్ మహలులాటి కట్టడాలు బుల్లి బుల్లి వి కొల్లలుగా వచ్చిఉంటే దాని విశిష్టత ఏముండేది? తాజ్ మహలు సౌందర్యాన్ని ఆనందించా లంటే దాని ఆకర్షణకు ఆనకట్ట వేసెయ్యాలి. అందులో పడి కొట్టుకుపోరాదు... యాభై, అరవై ఏళ్ళపాటు కవిత్వం రాసేవాళ్ళు తమను తామే న్యూనపరచు కుంటారు. వారిచుట్టూ వారిని అనుకరించేవారు కమ్మేస్తారు. వాళ్ళ నిరంకుశత్వం సాగనివ్వరాదు. కొత్త నిరంకుశుణ్ణి రానివ్వాలి."

"మీ కొత్త నిరంకుశుడి పేరేమిటో తెలుసుకోవచ్చా?" అని ఎవరో ప్రశ్నించారు.

"నివారణచక్రవర్తి." అన్నాడు అమితుడు.

"ఎవ రా నివారణచక్రవర్తి?" అని అనేకమంది అడిగారు.

"చిన్నవిత్తులాటి ఈ ప్రశ్ననుంచి సమాధానం రేపు మహావృక్షంలాగా పుట్టుకు రాగలదు."

సభికుల కోరికపై అమితుడు నివారణచక్రవర్తి పద్యాలు కొన్ని చదివాడు:

నే నపరిచితుడను
మడిగట్టుకున్న మూకలపై
విధి వికటాట్టహాసంలా విరుచుకుపడతాను
నన్ను శృంఖలాల బంధిస్తారా?
నియమములతో ప్రతిఘటిస్తారా?
వాటిని పటాపంచలు చేస్తాను
స్వతంత్రుడనై మీకు స్వేచ్ఛ చేకూర్చుతాను.

ఇలా అమితుడు చాలా పద్యాలు చదువుకుంటూ పోయాడు. టాగూరు అభిమానుల నోళ్ళు కట్టుబడ్డాయి. కాని వాళ్లు కలాలు పట్టి దీని అంతు తేల్చడానికే నిశ్చయించారు. అమితుడి చెల్లెళ్ళుమాత్రం తమ అన్నను చూసి గర్వపడ్డారు.

## 2

అమితుడు షిల్లాంగ్ వెళ్ళ నిశ్చయించాడు. కారణం, అది ఫాషను అనుసరించే వాళ్ళు వెళ్ళేస్థలం కాదు. మరో కారణం, పెళ్ళికొడుకులవేట అక్కడ ఏమంత

ఉండదు. అతని చెల్లెళ్లు మాత్రం తల అడ్డంగా తిప్పి, "వెళ్ళవలిసొస్తే నువు వెళ్లు; మేము రాము," అనేశారు. వాళ్ళు టెన్నిస్ రాకెట్లు చేతబట్టి డార్జీలింగు వెళ్ళారు.

అమితుడు ఏకాంతంకోసం షిల్లాంగు పోతున్నానని అందరితోనూ అన్నాడు. కాని జనసమ్మర్దం లేకపోతే అతనికి ఏకాంతం అంతగా రుచించలేదు. నైసర్గిక సుందరదృశ్యాలు చూసి ఆనందించటం అతని పద్ధతి కాదు. సుందరదృశ్యాలు చూసినా వాటివల్ల కలిగే ఆనందం అతనిమనస్సును నింపలేదు. కొండచరియల మీద దేవదారు వృక్షాలకింద పుస్తకాలు (నవలలు కావు) చదువుతూ కొద్దిరోజు లెలాగో వెళ్ళబుచ్చాడు. అతని మానసిక అపరిపూర్ణతే అతని చంచలత్వానికి కారణం. నగరంలో దాన్ని తోసుకు తిరిగాడు, కాని ఇక్కడ అది సాధ్యంకాలేదు.

చిరపుంజి మేఘావృతమై ఉన్నట్టు తెలిసింది. అక్కడికి వెళ్ళి డాక్‌బంగళాలో తిష్టవేస్తే, ఏ మేఘదూతగాని విద్యుల్లతాకారంలో తనకు ప్రేయసిని ప్రత్యక్షం చెయ్యలేకపోతాడా అని అతను అక్కడికి ప్రయాణం కట్టాడు. అతను, అవ నీంద్రనాథటాగూరు చిత్రించిన కాళిదాసు యక్షుడులాగా ఏ మాత్రమూ లేక, రోడ్డు మరమ్మతు తణిఖీ చేయబోయే జిల్లా ఇంజనీరులాగా తయారై కారులో బయలు దేరాడు. అతని ఇంటినుంచి వచ్చేదారి విశాలమైనది కాదు, వంకరటింకర దారి కూడానూ. ఆ దారిన రాకపోక లుండవుగనక అమితుడు అలక్ష్యంగా నడుపుకుంటూ పోతున్నాడు. అతను ఒకమలుపు తిరిగేసరికల్లా దారివెంట పైకెక్కివస్తూ మరొక కారు ఎదురయింది. అమితుడు బ్రేకు లాగాడుగాని, బ్రేకు పడేలోగా రెండుకార్లూ గుద్దు కున్నాయి. పెద్ద ప్రమాదం కాదు; రెండోకారు కొంచెం వెనక్కు నడిచి ఆగిపోయింది.

అందులోనుంచి ఒకమ్మాయి దిగి నిలిచింది. ఆ ప్రమాదకర పరిస్థితులలో ఆమె అమితుడి కళ్ళకు విద్యుల్లతలాగే కనబడింది. ఈమెనే అతను నగరంలోని ఏ డ్రాయింగురూములోనో పదిమంది స్త్రీలమధ్య చూసిఉంటే ఆమెను గమనించేవా డేమో గాని, ఇలా తన్మయత్వం చెందిఉండేవాడు కాదు. ప్రపంచంలో దర్శనీయు లైన స్త్రీ లెందరైనా ఉండవచ్చు. కాని వారు చూడదగిన వాతావరణంలో కనిపిం చడం అరుదు.

ఆమె గోరంచుగల పలచని, తెల్లని ఉన్నిచీరా, దానికి తగిన రవికా, తెల్లని చెప్పులూ ధరించి ఉన్నది. సన్నని, నాజూకైన శరీరం, తీర్చిదిద్దినట్టున్న కళ్లు, మెరిసే గోధుమరంగు శరీరఛాయ, పండును పోలిన ముఖం. అమితుడు తన కారు నుంచి దిగివచ్చి, ఆమె కెదురుగా, తప్పుచేసినవాడిలాగా నిలబడ్డాడు. ఆమె అతని వాలకం చూసి జాలిపడినట్టూ, నవ్వు వచ్చినట్టూ కనబడింది.

"క్షమించాలి. పొరపాటయింది," అన్నా డతను చివరకు.

"పొరపాటేమీకాదు – ప్రమాదం, నేనే కారకురాలిని," అన్న దామె.

ఆమె కారుకు మరమ్మతు అవసరమనీ, అంతదాకా అది నడవదనీ డ్రైవరు చెప్పాడు.

"అభ్యంతరం లేకపోతే నేను నాకారులో దిగబెడతాను," అన్నాడు అమితుడు.

"థాంక్స్, అవసరంలేదు. ఈ కొండదార్లంట నడవడం నా కలవాటే."

"అవసరం నాది. నన్ను క్షమించినట్టు గుర్తుగా —"



ఆమె అతనికారులో ఎక్కి కూర్చుని అతనికి దారి చెప్పింది. కారు తన గమ్యస్థానాన్ని చేరాక ఆమె దిగి, "తీరకవుంటే రేపు ఒకసారి రండి. మా యజమానురాలికి పరిచయం చేస్తాను," అన్నది.



అతను అప్పుడే రావటానికికూడా సిద్ధంగానే ఉన్నాడు. కాని ఆమాట పైకి అనడానికి బిడియపడ్డాడు. అత నింటికి వెళ్ళిపోయాడు.

# 3

బెంగాలులో ఇంగ్లీషు చదువులు ప్రవేశించినప్పుడు చెలరేగిన తుఫానులో కొందరు తమ సజాతీయులను విడిచిపెట్టి, ముందుకు కొట్టుకుపోయారు. అలా కొట్టుకుపోయినవారిలో ఒకడు జ్ఞానదశంకరుడు. కాని ఆయన మనమడు వరద శంకరుడు తన తాతకు విరుద్ధంగా నడిచి, ప్రాచీనయుగంలోకి వెళ్ళిపోయి, తాతకు ముత్తాత ననిపించుకున్నాడు. ఈ వరదశంకరుడు నాగదేవతోపాసకుడు, మహామ్మారిని తన తల్లిలాగా ఆరాధించేవాడు. దుర్గా సహస్రనామాలు ప్రతి ఉదయమూ రాసేవాడు. బ్రాహ్మణేతరులు చదువుకోరాదనీ, శాస్త్రజ్ఞానంతో హిందూ మతం కలుషితమైపోతుందనీ కరపత్రాలు వేసి, ప్రాచీనఋషుల జ్ఞానాన్ని పంచి పెట్టాడు. బ్రాహ్మణులకు సువర్ణదానాలూ, గోదానాలూ, భూదానాలూ చేసి సంపా దించుకున్న పుణ్యం మోసుకుని ఆయన తన ఇరవైఏడోఏట పరమపదించాడు.

ఆయనభార్య యోగమయ చాలా తెలివితేటలు గలది. సంస్కారంగల కుటుం బంలో పెరిగినది. చాందసపుభర్త మరణించాక తన సంస్కారానికి అనుగుణంగా బతుకుతూ, తన కొడుకు యతిశంకరుడితోనూ, కుమార్తె సురమతోనూ చలికాలం కలకత్తాలో గడిపి, వేసవికాలం కొండప్రదేశాలలో ఉంటూ వస్తున్నది. యతి శంకరుడు కాలేజీచదువు చదువుతున్నాడు. సురమకే తగిన ఆడిపిల్లలబడి కుదరలేదు. యోగమాయ ఎంతో కష్టపడి సురమకు లావణ్యలత అనే ప్రయివేటు పంతు లమ్మను కుదిర్చింది.

ఆ పంతులమ్మనే అమితుడు ఈ ఉదయం తలవనితలంపుగా కలుసుకోవటం జరిగింది.

లావణ్య తండ్రి అవినాశదత్తు ఒక కాలేజీ ప్రిన్సిపాలుగా పనిచేసేవాడు. తల్లి లేని తన కుమార్తెను ఆయన సమర్థతతో పెంచి, చాలా తెలివిగలదాన్ని చేశాడు. ఆయనకుగల అధ్యయనాసక్తి కూతురికికూడా సంక్రమించింది. అందుచేతనే ఆమె చదువు ముగించికూడా అధ్యయనం మానలేదు. విద్య తనకుమార్తెలోని దౌర్బల్యా లన్నిటినీ నిర్మూలించగలదనీ, ఆమెకు వివాహంతో నిమిత్తం ఉండదనీకూడా ఆయన భావించాడు.

శోభనలాలనే ఒక బీద విద్యార్థిపైకూడా అవినాశదత్తుకు చాలా మమకారం ఉండేది. ఎందుచేతనంటే ఆ కుర్రవాడికికూడా చదువంటే ప్రాణం. అతను స్కాలర్

షిష్యుల సహాయంతో పెద్దచదువు అందుకున్నాడు. తనవిద్యార్థి ఎప్పటికైనా గొప్ప వాడై, గురువైన తనకు ఖ్యాతి తెస్తాడని ఆశ అవినాశుడికి ఉండేది. శోభనలాలు యథేచ్ఛగా ఆయన ఇంటికి వచ్చి ఆయన లైబ్రరీపుస్తకా లుపయోగించుకునేవాడు.

ఆ కుర్రాడికి లావణ్యను చూస్తే చచ్చేసిగ్గు! ఆమె కంటపడితేచాలు అతను మతిపోయి, బెదురుగొడ్డులా అయేవాడు. ఇది చూసి లావణ్య అతన్ని ఏవగించుకోడం జరిగింది. ఈ స్థితిలో ఒకనాడు శోభనలాలుతండ్రి అవినాశుడి ఇంటికి వచ్చిపడి, ఆ మానవుణ్ణి నానామాటలూ అన్నాడు— చదువు మిషమీద అవినాశుడు తనకొడుకును, బోలెడంత కట్నంవిలువ గలవాణ్ణి, ఎరవేసి పట్టుకున్నాడని ఆరోపించాడు. అందుకు నిదర్శనంగా శోభనలాలు ట్రంకుపెట్టెలో లావణ్య స్కెచ్ దొరికిందట.

తనను ఎవరోఒకరు రహస్యంగా ఆరాధిస్తున్న సంగతి అప్పుడు లావణ్యకు తెలియవచ్చింది. కాని శోభనలాలు ధైర్యం వహించక, తప్పు చేసి దొరికినవాడిలాగా అవినాశుడి ఇంటికి స్వస్తిచెప్పేశాడు.

బియ్యే పరీక్షలలో శోభనలాలు మొదటివాడుగా ఉత్తీర్ణుడైతే లావణ్యకు మూడోస్థానం వచ్చింది. తనతండ్రి శోభనలాలు తెలివితేటలను ప్రశంసించేసరికి లావణ్యకు మండిపోయింది. అతనికన్న హెచ్చుమార్కులు తెచ్చుకోవాలని వల్లమాలిన కృషిచేసికూడా విఫలురాలై, అతన్ని క్షమించలేకపోయింది. తన తండ్రి శోభనలాలుకు ప్రత్యేకశ్రద్ధ చూపడంచేతనే ఇలా జరిగిందనికూడా ఆమె అనుమానించింది. ఇది జరిగాక చాలారోజులపాటు లావణ్య, శోభనలాలు కనిపిస్తే ముఖం తిప్పేసుకోవడమూ, అతను వస్తుంటే తాను వెళ్ళిపోవడమూ చేసింది. ఎమ్మే పరీక్షలోకూడా శోభనలాలామెను మించిఉండును — కాని అతను కావాలని పరీక్ష పాడుచేసుకుని, ఆమెకు హెచ్చుమార్కులు రానిచ్చాడు.

లావణ్య చదువు పూర్తిఅయిన కొద్దిరోజులకే అవినాశుడు, తన నలభైఏడో ఏట, తలవని తలంపుగా, ఒక వితంతువు కారణంగా, ప్రేమజ్వాలలమధ్య నిలవడం జరిగింది. ఆయన అనుకున్నట్టు పుస్తకజ్ఞానం మన్మథుడినుంచి అయనను కాపాడలేకపోయింది. అది గ్రహించినమీదట అయన కొక సందేహం కలిగింది; తనకుమార్తె శోభనలాలును ఒకవేళ ప్రేమించదేమో! శోభనలాలువంటివాణ్ణి లావణ్య ప్రేమించకపోతే అది అసహజమే. ఈ ఆలోచనతోబాటు పశ్చాత్తాపం కలగగా, అవినాశుడు శోభనలాలును తమ ఇంటికి వచ్చి, తన లైబ్రరీని వినియోగించుకుంటూ ఉండమని ఆహ్వానిస్తూ ఆప్యాయంగా ఉత్తరం రాశాడు.

పాపం, శోభనలాలు, ఆ ఉత్తరం లావణ్య ప్రేరేపణతో రాసినదై ఉంటుం దను

కుని తరచు అవినాశుడి ఇంటికి వచ్చిపోసాగాడు. అతను గుప్తవంశపు రాజులకు సంబంధించిన పరిశోధనలు చేస్తున్నాడు. లావణ్య తనను పలకరిస్తుందనీ, తన పరిశోధనల విషయం ప్రసంగిస్తుందనీ అతను ఆశించాడు. కాని అలాటి దేమీ జరగలేదు.

ఒక ఆదివారం మధ్యాన్నం అతను గదిలో పుస్తకం ముందుంచుకుని, నోట్సు తీసుకోవడం ప్రారంభించబోతూండగా, లావణ్య దఢాలున తలుపు తెరుచుకుని లోపలికి వచ్చి, తీవ్రంగా, "ఈ ఇంటి కెందుకు వస్తున్నావు? మీనాన్న ఏమన్నాడో నీకు తెలీదా ? న న్నిలా అవమానంపాలు చెయ్యడానికి నీకు సిగ్గులేదా ?" అన్నది.

శోభనలాలు తలవంచుకుని, "క్షమించు. ఇప్పుడే వెళ్ళిపోతాను," అని గొణిగి, అవినాశుడి ఆహ్వానంపైనే తాను వస్తున్న సంగతి కూడా చెప్పకుండా, వణికే చేతులతో తన కాగితాలు పోగుచేసుకుని, హతాశుడై వెళ్ళిపోయాడు.

ఇది జరిగినాక లావణ్య పట్టుబట్టి తన తండ్రికి పెళ్ళి జరిపించింది. అవినాశుడు తన ఆర్జనలో సగం లావణ్యకు కేటాయించాడు. కాని అందులో ఒక చిల్లిగవ్వ కూడా తనకు అవసరం లేదన్న దామె. ఆయన బాధపడి, "నేనీ పెళ్ళి కావా లన లేదు. నువే చేశావు. అలాటప్పుడు న న్నెందుకిలా వెలివేస్తున్నావు?'' అన్నాడు.

మన బాంధవ్యం పాడుకాకుండా ఉండగలందులకే ఇలా చేస్తున్నాను. నాకు నీ ఆశీర్వాదం చాలు," అన్నది లావణ్య.

తరవాత ఆమె సురమకు అధ్యాపకురాలుగా కుదిరింది. యతికి కూడా ఆమె చదువు చెప్పగలిగిఉండును. కాని ఆ మగధీరుడికి ఆడదానిచేత చదువు చెప్పించుకోవడాని కిష్టపడలేదు.

దినచర్యలో ఆమె జీవితం ఒడుదుడుకులు లేకుండా సాగిపోతున్నది. ఇంతలో ఈ కారుప్రమాదం జరిగింది. ఆమెలో నిద్రావస్థలో ఉన్న స్త్రీత్వం అకస్మాత్తుగా మేలుకున్నది.

# 4

అమితుణ్ణి చదువుకునే గదిలో ఉండమని లావణ్య యోగమాయకు చెప్పటానికి వెళ్ళింది. జీవితమంతా ఏదో చిత్రమైన పరివర్తన చెంది, దుమ్ము దులిపేసుకున్నట్టుగా ఉన్నది అమితుడికి. అందుచేత యోగమాయ అతనున్నచోటికి రావడం కూడా అతని కొక అపూర్వ సన్నివేశంగా తోచింది.

యోగమాయ నలభై ఏళ్ళ వయసుగలది. ఆమెది కాయపారు శరీరంగా కనబ

డింది. పరిచయాలు పూర్తి అయాక ఆమె, "మీ పెత్తండ్రి అమరేశుడు మా జిల్లా కంతకూ గొప్ప లాయరు. ఒక దిక్కుమాలిన వ్యాజ్యంతో మేము దివాలా తీయనున్న పరిస్థితిలో ఆయన మమ్మల్ని కాపాడాడు. ఆయన నన్ను బౌదీదీ (వదినె) అని పిలిచేవాడు," అన్నది.

"మా పెత్తండ్రి మీకు లాభం చేశాడు, నేను నష్టం చేశాను. నేను మిమ్మల్ని మాషిమా (పిన్ని) అని పిలుస్తాను."

"నీకు అమ్మ ఉన్నదా, నాయనా ?"

"ఒకప్పు డుండేది. కాని పిన్నికూడా ఉంటే బాగుండేది."

"పిన్నిమీద పట్టించావేం ?"

"నే నివాళ చెడగొట్టినది మా అమ్మ కారైతే, ఎల్లకాలమూ తిట్లు తింటూనే ఉండేవాణ్ణి. అదే పిన్ని కారయితే, 'పిచ్చివెధవ' అని నవ్వి ఊరుకునేది."

యోగమాయ నవ్వి, "అయితే అది పిన్నికారే అనుకో," అన్నది.

అమితుణ్ణిగురించి పూర్తిగా తెలుసుకోకుండానే యోగమాయ, అతనికీ లావణ్యకూ పెళ్ళయితే బాగుంటుందని నిశ్చయించుకుని, "మీ రిద్దరూ మాట్లాడుతూ ఉండండి. నేను భోజనం సంగతి చూస్తాను," అని లోపలికి వెళ్ళింది.

అమితుడు తన సహజవాచాలత్వంతో, "మనని పరిచయం చేసుకోమని పిః చెప్పింది. పరిచయానికి ముందు పేర్లు నిర్ణయం కావాలిగద. నా పేరు నీకు తెలుసుననుకుంటాను." అన్నాడు.

"నాకు తెలిసిందల్లా మీ పేరు అమితబాబు అని," అన్నది లావణ్య.

"నీ నోట అమితబాబు అనే పేరు బాగాలేదు."

"పోనీ, మిస్టర్ రాయ్ అంటే ?"

"అది దిగుమతి సరుకు. పేరు తేలికగా ఉండాలి. అమితబాబులోనుంచి బాబు కొట్టెయ్యి."

"అది తేలిక కాదు. చాలాకాలం పట్టుతుంది."

"అందరికీ పట్టదు. గడియారాలు జేబుజేబుకూ మారతాయి. దాన్నే ఐన్‌స్టయిన్ సిద్ధాంత మంటారు."

"స్నానానికి తోడిన నీరు చల్లారిపోతున్నది," అంటూ లావణ్య లేచివెళ్ళింది.

అమితుడు చాలామంది అందగత్తెలను చూశాడు. ఆ అందం వెన్నెలలాంటిది; కాంతివంతంగా ఉన్నా అస్పష్టంగా ఉంటుంది. లావణ్య అందం ఉషఃకాంతి లాంటిది. ఆమెలో స్త్రీ సహజమైన ఉద్విగ్నతతోబాటు పురుషులకుండే మేధాశక్తి



కూడా ఉన్నది. అదే అమితుణ్ణి బలంగా ఆకర్షించింది. అంతేగాక ఆమెలో అమితుడు తనలోలేని నిర్వికారాన్నికూడా గమనించాడు...

అమితుడు సంఘజీవి. అతనికి వాగడం ఇష్టం. చెట్లతోనూ, కొండలతోనూ ఎలా వాగడం? అవి నియమాలను పాటించి బతుకుతాయి. అంతే వాటిలో హాస్యగుణం లేదు. ఎన్నడూ లేనిది అత నివాళ సూర్యుడికన్న ముందే లేచి, ఒకకప్పు టీ గొంతులో పోసుకుని, ఇంటినుంచి బయలుదేరాడు. రోడ్డు నిర్జనంగా




ఉంది. అతనొక పురాతన దేవదారు వృక్షంకింద కాళ్లు చాచుకుని కూర్చుని, సిగిరెట్టు వెలిగించాడు. యోగమాయ ఇంటికి వెళ్ళడానికింకా వేళకాలేదు.

ఆరంభంలో అతను సాయంకాలంవేళల్లోనే వారి ఇంటికి వెళుతూవచ్చాడు. రెండురోజులపాటు యోగమాయ కూడా కూర్చుని కబుర్లు చెప్పింది, కాని తరవాత ఏదో సాకు చెప్పి, ఆమె లావణ్యా అమితుల సంభాషణ యధేచ్ఛగా సాగే అవకాశము కలిగించింది. రానురాను అమితుడి సంభాషణాసక్తి పెరగసాగింది. అతను యోగమాయ ఇంట చాలా సేపు గడపగలందులకు, యతిశంకరుడికి ఆంగ్లసాహిత్యం గురించి చెప్పడానికి పూనుకున్నాడు. ఈ చదువు ఉదయం రెండుగంటలూ, సాయంకాలం రెండుగంటలూ ఉండేది. కాని రానురాను ఉదయంచదువు మధ్యాహ్న భోజనం దాకా పెరిగి, అమితుడు యోగమాయ ఆతిధ్యం స్వీకరించవలసివచ్చింది.

ఉదయపు పాఠం ఎనిమిదింటికి ఆరంభ మవుతుంది. కాని ఇవాళ ఇంకా ఏడు కూడా కాలేదు. గడియారం ఆగిందేమోనని చెవిదగ్గర పెట్టుకుంటే ఆడుతూనే ఉన్నది. ఇంతలో లావణ్య, కుడిచేతిలో గొడుగు ఊపుకుంటూ దారివెంట రావడం అతని కంటపడింది. ఆమె అతనిని చూడనిదానిలాగా అతనున్న చోటును దాటి, రోడ్డు మలుపుదాకా వెళ్ళాక, అతను లేచి పరిగెత్తి, ఆమెను కలుసుకుని, "నన్ను తప్పించుకో లేవని తెలిసికూడా, ఎందుకు నాచేత పరిగెత్తించావు. దూరంతో చెడ్డ చిక్కుగద!" అన్నాడు.

"ఏం?" అన్నది లావణ్య.

"గొంతెత్తి కేకపెట్టాలిగద. దేవతలతో ఈ చిక్కులేదు; గొంతు చించుకుని, 'దుర్గా, దుర్గా,' అని పిలిస్తే దేవి ఆగ్రహించదు. నీవంటివాళ్ళతో అలా కుదరదే!"

"అయితే పిలవడం మానెయ్యొచ్చునే.''

"నువు దగ్గరలో ఉంటే అలానే మానెయ్యొచ్చు. అందుచేత వెళ్ళిపోకు. నిన్ను పిలవాలని తహతహలాడుతూ పిలవలేకపోవడం ఎంత దారుణం!''

''ఇంగ్లీషు పద్ధతిలో పిలవచ్చుగా?"

''మిస్ దత్ అనా? అది టీ తాగేచోట. నేను హృదయస్ఫూర్తిగా మిస్ దత్ అని నిన్ను కేకపెట్టి ఉన్నట్టయితే ఆ కేకను ప్రతిధ్వనించే ఈ అరణ్యమూ, ఆకాశాన మేఘాలూ, ఆ దూరంగా మబ్బులు కప్పిఉన్న కొండా ఏమనుకునేవి?"

"నామకరణం ఇంతత్వరలో అయేది కాదు. నేను నడక పూర్తిచేస్తాను."

''నడక నేరవటానికూడా చాలాకాలం పడుతుంది. నా విషయంలోనే అది అస్తవ్యస్త మయింది. నే నిక్కడికి వచ్చినాకనే కూర్చోవడం నేర్చాను.''

''ఆ ఆకుపచ్చని ఈకలపక్షిపేరు తెలుసా?'' అన్నది లావణ్య, విషయం మార్చుదామని.

"ప్రపంచంలో పక్షు లుంటాయని నా కదివరకు తెలుసుగాని, ఇక్కడికి వచ్చాకనే వాటి ప్రత్యేకత నాకు బోధపడింది.''

''ఎంత అద్భుతం!'' అని లావణ్య నవ్వింది.

"నీకు నవ్వుగా ఉంది. నేను మనస్ఫూర్తిగా మాట్లాడుతున్నా నా మాటలలో బరువు కనిపించదు.''

''క్షమించాలి. మీ మాటలు వింటే ఆ పక్షికూడా నవ్విఉండును.''

ఇద్దరూ చాలా సేపు మాట్లాడుకున్నారు. అతను తనప్రేమను రకరకాల వ్యక్తం చేశాడు. తన వికట సంభాషణలతో ఆమెను నవ్వించాడు. ఇద్దరూ ఒక కాలిబాట వెంబడి, అడవిమధ్య ఉన్న ఒక తెరిపిలోకి వెళ్ళి అక్కడ కూర్చున్నారు. అక్కడ ఆత నామెకు తెలియని పద్యాలు చదివి వినిపించాడు. ఆమెకు రవీంద్రుడి కవిత్వమంటే ఇష్టం. అతను తాను చదివేపద్యాలు రవీంద్రుడివి కానందుకు క్షమాపణ చెప్పుకుని ఒక్కొక్క పద్యమే చదువుతూ దానిపైన వ్యాఖ్యానించాడు. అలా పద్యాలు చదువుతూనే అతను లావణ్యచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఆమె అభ్యంతరం చెప్పక, అతని ముఖంలోకి చూస్తూ అలాగే ఉండిపోయింది ...

అమితుడు యోగమాయవద్దకు వెళ్ళి, "పిన్నీ, పెళ్ళి బేరానికి వచ్చాను," అన్నాడు.

"పేరూ, అందచందాలూ, వివరాలూ చెప్పు; వింటేగాని ఏదీ చెప్పలేను," అన్నది యోగమాయ.

"పేరులో ఏముందిలే దాన్నిబట్టి వరుడి అర్హత తెలుస్తుందా ?"

"పోనీ అందచందాలు ?"

"న న్నడిగితే కొంచెం అతిశయోక్తు లాడుతానేమో !"

"పెళ్ళిళ్ళ పేరయ్యలకున్న జబ్బేగా ? పోనీ మిగతా వివరాలు ?"

"మిగతా వివరాలను గురించి చెప్పటాని కేమీలేదు."

"అంటే ఘనమైన సంబంధంగా కనబడదే ?"

"అదేంమాట ? అన్నపూర్ణ దాతృత్వం లోకానికి చాటడానికి శివుడు బిచ్చగాడయాడు. అందుకు సిగ్గుపడ్డాడా ?"

"పోనీ వంశంగురించి అయినా చెప్పు."

"తెలిసిన కుటుంబమే. వరుడిపేరు అమితరాయ్... నవ్వుతావేం పిన్నీ ! వేళాకోళ మనుకుంటున్నావా ?"

"చిట్టచివరకు వేళాకోళంగా పరిణమిస్తుందేమో ననే నా భయం."

"వరుణ్ణి చిన్నచూపు చూస్తున్నావా ?"

"ప్రపంచాన్ని హాస్యంలో ఓలలాడించడం తక్కువవిద్య కాదే !"

"ఆవిద్య దేవతలకు తెలుసు. అందుకే వాళ్ళు వరుళ్ళుగా పనికిరారు. ఆమాట దమయంతి ఎరుగును."

"నీకు మా లావణ్య అంటే నిజంగా ఇష్టమా ?"

"ఏంపరీక్ష పెడతావు ?"

"అది నిజంగా నీది కావడం ఒకటేపరీక్ష. రత్నం ఊరికే దొరికినా దాని పూర్తి విలువ గుర్తించగలవాడే రత్ననిపుణుడు. భయంలేదు. లావణ్య నీ దవుతుంది; నీ దయినాకకూడా అది నీకు ఇప్పుడంతగానూ వాంఛనీయురాలైన పక్షంలో నువు లావణ్యకు అర్హుడివే."

అమితుడు యోగమాయను వదిలి, లావణ్యను వెతుక్కుంటూ ఇంటిబయట కొంచెం దూరంగా, యూకలిప్టస్ చెట్టుకిందికి వెళ్ళాడు. అక్కడ ఆమె పరధ్యానంగా కూర్చునిఉంది. తనచెంత నిలబడిన అమితుడికేసి తలఎత్తి చూసి, ఏమీ అనక, అస్పష్టంగా చిరునవ్వు నవ్వింది. అతనామెకెదురుగా కూర్చుని, "మంచివార్త, పిన్ని సరే నన్నది," అన్నాడు.

లావణ్య ఏమీ అనలేదు.

"నీ పేరు కొంచెం పొట్టిది చేశాం," అన్నా డతను.

"చెయ్యి."

"నిన్ను వన్యా అని పిలుస్తాను."

"సరే. కాని, మీ పిన్నిఎదటమాత్రం వద్దు."

"లేదు, లేదు. అది మంత్రంలాటిది. అందరిఎదటా ఉచ్చరించరాదు."

"అలాగే కానీ."

"నాక్కూడా ఒక అవ్యవహారనామం ఉండాలి. బ్రహ్మపుత్ర అంటే ఎలా ఉంది. ఉన్నట్టుండి వరదవచ్చి పొంగేస్తుంది."

"నిత్యవాడకానికి భారంగా ఉంటుంది."

"నిజం. దాన్ని మొయ్యడానికి కూలీని ఏర్పాటు చెయ్యాలి. పోనీ నాకు నువు పేరు పెట్టు."

"నీపేరుకూడా పొట్టి చేస్తాం. మితా అని పిలుస్తాను."

"అద్భుతం. నేను నీమీద పద్యం రాయాలంటే వన్యా అనేమాటకు అనన్యా అన్న మాట ప్రాస-కుదురుతుంది. ఇలా రాస్తాను —

వన్యా, నీ సౌందర్య మనన్యము —"

"కొంపతీసి కవిత్వం రాసేస్తావా ?"

"ఆహా! న న్నెవ్వ రాపలే రీవేళ."

"అంత తెగబడ్డావేం ?"

"చెబుతాను. నిన్నరాత్రి రెండున్నరదాకా పద్యాలపుస్తకాలు తెగ తిరగేశాను– ఎక్కడన్నా ఒక్క ప్రేమగీతం కనిపిస్తుందేమోనని. ఒక్కటీలేదు. అదివరకు ఎక్కడచూసినా అవే అడ్డుతగిలేవి. ఇప్పుడు స్పష్టమయింది — ప్రపంచమంతా నేను రాయబోయే ప్రణయగీతాలకోసం ఎదురు చూస్తోంది." అంటూ అమితుడు ఆమె చెయ్యి తనచేతిలోకి తీసుకుని, "నీ వేళ్ళు నావేళ్ళతో ఎలా రహస్యాలాడుతున్నాయో చూడు. ఏ కవీ అంత సరళంగానూ, సహజంగానూ రాయలేడు," అన్నాడు.

"నీ కేదీ ఒకంతట నచ్చదు, మితా! నిన్ను చూస్తే భయంగా ఉంది," అన్న దామె.

"నా పరిస్థితి చూడు. రాముడు సీతకు అగ్నిపరీక్షపెట్టి ఆమెను పోగొట్టుకున్నాడు. ఇవాళ నా మనసు ప్రజ్వలిస్తున్నది. ఆ ప్రజ్వలనంలో పరీక్షించి చూస్తే ఎవరి కవిత్వమూ నిలవకుండా ఉంది."

అత నామెచేతిని తన ముఖానికేసి నిమురుకుంటూ, "కొంచెం ఆలోచించు, వన్యా! ఈ ఉదయం, ఈ క్షణం, ఎంతమంది ఎలాటి కోరికలతో సతమత మవు



తున్నారో, వారిలో ఎంతమంది కోరికలు సిద్ధించిఉంటాయి? అలా సిద్ధించనివాడు ఒక్కడే ఈ చెట్టుకింద, నీఎదట ఉన్నాడు," అన్నాడు.

"నీ మాటలు వింటుంటే నా కేదో భయంగాఉంది. నానుంచి నువాశించే దేమిటో, అది నేనివ్వగలనో లేనో అర్థంకాకుండా ఉంది. నీ అభిరుచులూ, తెలివీ నాకు అతీతమైనవి. నీతో కలిసి నడవడం మొదలెడితే నేను కొంతదూరం పోయాక వెనకబడిపోతాను. అప్పుడు నువు ఆగి నన్ను పిలవవు. అది నీ తప్పనలేను. నిన్ను వేడుకుంటున్నాను. నన్ను పెళ్ళాడే ఆలోచన చెయ్యకు. ఆ తరవాత వివాహబంధాన్ని సడలించడంచేత మరింత రొచ్చవుతుంది. ఇప్పటివరకూ నీనుంచి పొందినది నాకు జీవితాంతందాకా చాలుతుంది. దయచేసి ఆత్మవంచన చేసికోకు."

"రేపటి భూతాలను ఈ పర్వసమయంలో ఎందుకు ఆవాహన చేస్తున్నావు!"

"నిజం చెప్పటానికి తగినబలం నువే నా కిచ్చావు. నామాట నిజమని నీకూ తెలుసు. ఇప్పుడున్న నీ ఆనందాన్ని పాడుచేసుకోవలిసివస్తుందని కళ్ళు గట్టిగా మూసుకున్నావు. నీకు సంసారజీవితం కుదరదు. నీతృష్ణ నిన్ను ఒక సాహిత్యం నుంచి మరొక సాహిత్యానికి పరిగెత్తిస్తున్నది. ఆ ప్రయాణంలో నేను తగిలాను. నీకసలు వివాహమంటేనే రోత. అది సాదామనుషులు కోరేది."

"వన్యా! ఎంత ఘోరమైనమాటలు ఎంత మృదువుగా అనగలవు."

"నా ప్రేమ ఎంత కఠినమైనదైనా నా కభ్యంతరంలేదు. నేను నిన్ను వంచించలేను.

నీ అభిరుచికి అనుకూలించినంతమట్టుకు నన్ను ప్రేమించు. కాని లేనిపోని బాధ్యతలు మీద వేసుకోకు. అందువల్ల నాకు బాధ కలుగుతుంది."

"వన్యా, నన్నుగురించి నువు చెప్పినది నిజమే, కాని ప్రవృత్తులు మారుతాయి. నేను మారాను. నువు నా జీవితాన్ని మార్చావు. మనిద్దరిజీవనగీతాలూ మేళవించాయి."

లావణ్యకళ్లు చెమ్మగిల్లాయి. కొంచంసేపు మౌనంగా ఉండి ఆమె అకస్మాత్తుగా, "మిత్రా, తాజ్‌మహల్ నిర్మాణం పూర్తిఅయాక షాజహాం తనభార్య ముంతాజ్ చని పోయినందుకు హర్షించిఉండడూ? ఆమె ప్రేమకు ఉత్కృష్టఫలం ఆమె మరణమే. తాజ్‌మహల్‌లో సమాధి అయినది షాజహాం దుఃఖంకాదు, ఆనందం!"

అమితుడు నిర్ఘాంతపోయి, "నువు కవివి!" అన్నాడు. అతను నివారణ చటర్జీవి మరికొన్నిపద్యాలు చదివాడు.

లావణ్య నవ్వి, "నీ వాక్కు నివారణచక్రవర్తి గీతాలలో ఉన్నది. నీ నీడ మటుకు నీడగానే ఉన్నది. అది నాకు చిక్కటంలేదు," అన్నది.

ఇంతలో నౌకరు వచ్చి ఇద్దరినీ భోజనానికి పిలిచాడు.

# 5

"అమ్మా, లావణ్యా! నువు పొరపడలేదుగద!" అన్నది యోగమాయ.

"లేదమ్మా." అన్నది లావణ్య.

"అమితుడు కాస్త చపలచిత్తుడన్నమాట నిజమే. కాని, చూడు, పాపం, ఎలా దిగాలుపడిపోయాడో — సమస్తమూ పోగొట్టుకున్నవాడల్లే."

"అన్నీ దక్కించుకుంటే అతనివంటివాడికి సుఖం వుండదు."

"నువ్వేమైనా చెప్పు, అతను నిన్ను ప్రేమిస్తున్నమాట నిజం."

"అది నిజమే."

"ఇంకెందుకు విచారం?"

"అతని ప్రవృత్తిని అదుపులో ఉంచటం నా కిష్టంలేదు."

"భార్యాభర్తలయాక ఒకరి నొకరు నిగ్రహించకుండా జరుగుతుందా? ప్రేమ లేనిచోట నిగ్రహం దారుణంగా ఉంటుందిగాని, ప్రేమ నిగ్రహాన్ని సంతోషంగా ఆమోదిస్తుంది."

"అతను సంసారజీవితానికి అనువైనవాడైతే ఆమాట నిజమే. సంసారానికి తగినవాడు బంకమట్టిలాగా ఉండి, ఎలా మలిస్తే అలా మలుగుతాడు. కాని ఇలాటివాడి స్వభావంలో బంకమట్టి ఏ కోశానా ఉండదు. అటువంటివాణ్ణి ఆడది దక్కించు కోవడానికి ఎంతగా ప్రయత్నిస్తే అంతగా పోగొట్టుకుంటుంది. నేనతన్ని పెళ్ళాడి,

బాధపెట్టలేను. అల్పసంతోషులు కానివాళ్ళు అవతలమనిషిని పాక్షికంగా స్వీకరిస్తారు – తమకు నచ్చిన అంశాలు స్వీకరించి, అవసరంలేనివి విసర్జిస్తారు. పెళ్ళయాక అలా పాక్షికవిసర్జన కుదరదు. మనిషిని సంపూర్ణంగా స్వీకరించాలి."

"నీలో విసర్జించదగినది కొంత ఉందని ఎందుకనుకోవాలి?" అని యోగమాయ అడిగింది.

"నేను మనిషిగా ఏమిటో అతనికి మొదలు తెలుసునా? అతను నన్నసలు గమనించాడా? అతను నాచుట్టూ మాట ల్లి, ఆమాటలతో నాకు రూపకల్పన చేసేస్తున్నాడు. అతని కామాటలతో విసుగెత్తాక నేను మట్టిబొమ్మలాగా మిగిలిపోతాను. ఉన్నపాళంగా మనిషిని స్వీకరించగలిగితేనే పెళ్ళాడాలి. పెళ్ళంటే కుండలను పోతపొయ్యడంకాదు," అన్నది లావణ్య.

"అయితే ఏం చేస్తా నంటావు?"

"సాగినంతకాలం అతని మాటలలో ఇమిడి, అతని స్వప్నప్రేయసిగా ఉంటాను. అతనికి కలే అని ఎందుకనాలి? అది నాకుకూడా ఒక దివ్యమైన పునర్జన్మే. అది తాత్కాలికమే – అయితేనేంగాక, ఉన్నంతకాలమూ వాస్తవమే. ఉదయం పుట్టి సాయంకాలం చచ్చే సీతాకోకచిలుకా, దాని సౌందర్యమూ వాస్తవం కావా?"

"నువు అమితుడికి కలే అనుకుందాం. నీమాటేమిటి? నీకుకూడా అతను కలేనా?"

లావణ్య బదులు చెప్పలేదు.

"మీరంతా చదువుకుని, ఆలోచనలు అల్లనేర్చి, వాస్తవ ప్రపంచానికి దూరమయారు. మాకాలంవాళ్ళం ఇదంతా లేకుండానే కష్టసుఖాలు పొందగలిగాం. అప్పటికీ మా కెన్నో సమస్యలు! మీ తరంవాళ్ళు ఏ ఒక సమస్యా అర్థంకానంత క్లిష్టంగా తయారుచేశారు," అన్నది యోగమాయ.

"కాలప్రక్రియను ఎంతబాగా అర్థం చేసుకుంటే అంతబాగా దాని దెబ్బలకు తట్టుకోగలం. అంధకారం కలిగించేబాధ దుర్భరమైనది," అన్నది లావణ్య.

"మీ రిద్దరూ కలుసుకోకపోతే బాగుండేదేమో ననిపిస్తున్నది," అన్నది యోగమాయ.

"అలా ఎన్నటికీ అనవద్దు. కలలోకూడా ఇలా జరిగిఉండరా దనుకోలేను. ఒకప్పుడు నేను పూర్తిగా మోడుబారిపోయా ననుకున్నాను. ఛాయామాత్రంగా మిగిలిన నాకు మళ్ళీ ఆకారం వచ్చింది. ఇంకేం కావాలి? కాని నన్ను పెళ్ళాడమని మాత్రం అనవద్దు," అంటూ లావణ్య యోగమాయ ఒడిలో తల పెట్టి ఏడవసాగింది.

# 6

రెండు వారాలు తిరిగేలోపల అమితుడు షిల్లాంగునుంచి కలకత్తాకు తిరిగి వస్తాడని కలకత్తాలో అతని మిత్రులు అంచనా వేశారు. అమితుడు షిల్లాంగులో గట్టిగా వారంరోజు ఉండలేడని నరేన్‌మిత్ర పందెం కాశాడుకూడా. ఒక నెల గడిచింది, రెండు గడిచాయి. అమితుడు షిల్లాంగునుంచి తిరిగివచ్చే జాడ లేదు.

అమితుడు షిల్లాంగులో తీసుకున్న ఇంటికి అద్దె గడువయిపోయింది. రంగ పూరు జమీందారు వచ్చి అందులో ప్రవేశించాడు. చాలా శ్రమపడిన మీదట అమితుడికి, యోగమాయ ఇంటి పరిసరాంలో ఒక కుటీరం దొరికింది. దానికి తగినన్ని వాకిళ్ళూ, కిటికీలూ కూడా లేవు. కప్పు కురుస్తుంది.

యోగమాయ ఒకనా డతనిగదికి వచ్చి చూసి, "ఇంత కష్టం తెచ్చిపెట్టుకున్నా వేమిటి, నాయనా?" అని అడిగింది.

"ఉమాదేవి ఆకులూ, అలములూకూడా తినకుండా తపస్సు చెయ్యలేదా? ఆమె భర్తకోసం తపస్సు చేస్తే, నేను భార్యకోసం తపస్సు చేస్తున్నాను. ఆమెకు నార దుడు సంధాన కర్త అయాడు. నాకు మాషిమా ఉన్నది," అన్నాడు అమితుడు. అతను వేళాకోళంగానే మాట్లాడినా, యోగమాయ చాలా నొచ్చుకున్నది. ఆమె తన ఇంటికి తిరిగివచ్చి, అతనికి ఉపయోగించే వస్తువులు కొన్ని పంపి, లావణ్యతో, "నీ గుండె పాషాణం చేసుకోకు," అని మళ్ళీ మళ్ళీ అన్నది.

మరొకనాడు పెద్ద వాన కురిసి వెలిశాక యోగమాయ, అమితు డెలా ఉన్నాడో చూడాలని వెళ్ళేసరికి, అతను బల్లకింద చేరి ఏదో పుస్తకం చదువుకొంటున్నాడు. ఆ రోజు యోగమాయకు లావణ్యమీద చాలా కోపం వచ్చింది. లావణ్య ఎందుకు అర్థంలేకుండా అతన్ని పెళ్ళాడనంటుంది? అత నెంత తెలివిగలవాడు, ఎంత నిరాడంబరుడు! అందం మాటకొస్తే లావణ్యకన్న అతనే బాగుంటాడు! అటు వంటివాణ్ణి ఎలా చిత్రహింస పెడుతున్నది! ఈ దౌర్భాగ్యురాలి గీత బాగు న్నట్టు లేదు. అమితుణ్ణి తన కారులో ఎక్కించుకుపోదామన్న ఆలోచన మానేసి, "ఇప్పుడే వస్తానుండు, బాబూ!" అంటూ ఆమె ఇంటికి వెళ్ళింది.

లావణ్య సోఫామీద పడుకుని, గోర్కీ రాసిన 'అమ్మ' చదువుతున్నది.

"అలా వెళ్ళొద్దాం పద," అన్నది యోగమాయ.

"ఇప్పు డెక్కడికీ వెళ్ళాలని లేదు," అన్నది లావణ్య.

ఆమె అమితుడికోసమే ఎదురు చూస్తున్నదని యోగమాయకు తెలీదు. ఆమె అమితుడి రెండుచేతులూ పట్టుకుని తనను పెళ్ళాడమని వేడుకోవడానికి కూడా ఈ

నాడు సిద్ధంగా ఉన్నది. కాని అతను రాలేదు. ఆమె తన మనోవేదనను మరవ డానికి పుస్తకం తీసుకున్నది. కథలో క్రమంగా నిమగ్నురాలై తనను తాను మరుస్తూండగా యోగమాయ వచ్చి బయటికిపోదాం రమ్మన్నది.

"నీకు జాలిలేదు. అతన్ని ప్రేమించకపోతే ఆ మాట అలనితో స్పష్టంగా అనెయ్యగూడదూ? ఇంతకుముందే అతన్ని చూశాను. గుండె తరుక్కుపోయింది. అతను బిచ్చగాడల్లే ఎవరికోసం ఇక్కడ నానాగడ్డీ తింటున్నట్లు? నువ్వెలా చూడకుండాఉన్నావు? అలాటివాడు పెళ్ళాడతాననడం ఆడపిల్ల చేసుకున్న అదృష్టం కాదా?" అన్నది యోగమాయ.

లావణ్య ఆర్చుకుపోతున్న కంఠంతో, "నాకన్న హెచ్చుగా ఎవరూ ప్రేమించలేరు. ప్రేమకోసం ప్రాణా లివ్వడానికి సిద్ధంగా ఉన్నాను. నా గతమంతా తుడిచిపెట్టుకుపోయింది. నా జీవితం మళ్ళీ ఆరంభమయింది," అన్నది.

యోగమాయ ఈ మాటలకు ఆశ్చర్యపోయి, మృదువుగా, "అమ్మా, లావణ్యా! నీ మనసును అణచిపెట్టుకోకు. పాపం, అమితుడు నీకోసం అంధకారంలో దేవులాడుతున్నాడు. నువు సాక్షాత్కరించడంకన్న అతనికి కావలసినది లేదు," అన్నది.

ఇద్దరూ కలిసి అమితుడి కుటీరానికి బయలుదేరారు.

వాళ్ళు వచ్చేసరికి అమితుడు తడిసిన కుర్చీమీద వార్తాపత్రిక కాగితాలు పరిచి కూర్చుని, తెల్లకాగితాలు ముందు వేసుకుని తన ఆత్మకథ రాయడంలో నిమగ్నుడై ఉన్నాడు. అతను వాళ్ళను చూస్తూనే దిగ్గున లేచి, "అన్యాయం, మాషిమా! నాకు ముందు తెలియజెయ్యలేదు. శ్రీమతి లావణ్య ఏమనుకుంటుంది?" అన్నాడు.

"తెలుసుకోవలసిన దేదో శ్రీమతికి తెలియడం మంచిదేనే. శ్రీయుతుడికి గాభరా దేనికీ?" అన్నది యోగమాయ.

"శ్రీమతి శ్రీయుతుడి వైభవమే చూడాలి. అతని దౌర్భాగ్యం మాషిమా మాత్రమే చూడవచ్చు." అన్నాడు అమితుడు.

"ఆ తేడా దేనికో?"

"నిధి కోరేవాడు నిధి కలవాడై ఉండాలి. దౌర్భాగ్యానికి సానుభూతికోరే అర్హత మాత్రమే ఉన్నది. నాగరికతయొక్క వైభవం లావణ్యాదేవులది, మానవత మాషిమాలది. ఇందుకు నిదర్శనంగా కవి ఏమన్నాడంటే—

'నిండుహృదయంతో నెమకేదానిని
శూన్యహస్తాలతో వెదకకు,
అశ్రుపూరిత నేత్రాలతో వాకిట నిలవకు

అతనిని మరికొంతసేపు ఇదేధోరణిలో మాట్లాడనిచ్చి యోగమాయ, "నీ తపస్సంతా అదివరకే సిద్ధించింది. ఆది నీకూ తెలుసు,'' అంటూ లావణ్యను అతని పక్కన నిలబెట్టి, ఆమెచెయ్యి అతని చేతిలో పెట్టి, ఇద్దరినీ ఆశీర్వదించింది.

ఇద్దరూ వంగి ఆమెపాదాలకు నమస్కరించారు. ఆమె పూలు తెస్తా నని చెప్పి, కారులో ఎక్కి వెళ్ళిపోయింది.

ఇద్దరూ మంచంమీద పక్కపక్కనే, చాలాసేపు మౌనంగా కూర్చున్నమీదట, "ఇవాళ ను వెందుకు రాలేదు?" అని లావణ్య అడిగింది.

"నాకోసం చూశావా, వన్యా?''

''అవును, చూశాను. నీ పదధ్వనికోసం ఆలకించాను. ఇంతకాలానికి నా జీవితములోకి అడుగుపెట్టావు."

అతను మళ్ళీ కవిత్వం చదువుతూ, వ్యాఖ్యానించసాగాడు. అంతలోనే యోగమాయ తట్టలో పూలు తెచ్చి, "లావణ్యా! అతని పాదాలమీద ఈపూలు ఉంచు,'' అన్నది.

"కలకత్తానుంచి నీకొక ఉంగరం తెప్పించాలి. నీకిష్టమైన రాయి ఏది?" అన్నాడు.

"రాయి వద్దు. ముత్యం చాలు.''

''భేష్. నాకూ ముత్యాలే ఇష్టం.''

పెళ్ళి మార్గశిరమాసంలో జరిగేటట్టు ఏర్పాటయింది. యోగమాయ కలకత్తా వెళ్ళి పెళ్ళి ఏర్పాట్లు చేస్తుంది.

''నువు కలకత్తాకు ఎప్పుడో తిరిగివెళ్ళవలసింది. నీ సందేహా లన్నీ తీరిపోయాయి గనక ఇక నువు వెళ్లు. మళ్ళీ మనం తిరిగి పెళ్ళిలోనే కలుసుకోవడం," అన్నది లావణ్య.

''ఎందు కీ కఠోరదీక్ష?" అని అమితు డడిగాడు.

"మన సుఖాన్ని సరళంగా ఉంచడానికి."

"చాలా బుద్ధిగలమాట. నువు కవివే అనుకున్నాను, తత్వవేత్తలాగాకూడా కనిపిస్తున్నావు."

యోగమాయ వచ్చి భోజనానికి లెమ్మన్నదాకా అమితుడు లావణ్యకు వెర్రిమొర్రి కబుర్లు చెప్పాడు; భవిష్యత్తులో తమ జీవితం ఎలా ఉండబోయేదీ వివరించాడు.

భోజనా లయాక అమితుడు యోగమాయతో, "మాషిమా, నేను రేపు కలకత్తా పోతున్నాను. ఈపూట లావణ్యను అలా షికారుకు తీసుకుపోనీ,'' అన్నాడు.

యోగమాయ అనుమతించింది. ఇద్దరూ చేయీ చేయీ కలిపి, ఒకరి నొకరు ఒరుసుకు నడుస్తూ, దారిచివర ఉన్న అడవిలోకి వెళ్ళారు. ఆ అరణ్యంమధ్య ఒక ఖాళీప్రదేశం ఉన్నది చీకటిపడినదాకా అక్కడ ఉండి, వాళ్లు ఇంటికి బయల్దేరారు.

వాళ్ళు ఇంటిని సమీపించేటప్పుడు అమితుడు, "వన్యా! మన జీవితంలో తొలిసర్గ ఇక ముగుస్తున్నది. నీ ఆఖరుమాటలు ఒక పద్యంలో చెప్పు," అన్నాడు.

లావణ్య క్షణం ఆలోచించి ఒక బెంగాలీగీతం చదివింది. అందులోని భావం ఇది :

"నేను నీకు సుఖం చేకూర్చలేదు. ప్రకాశమానమైన ఈ నిశాంతాన నీకు స్వేచ్ఛను కానుకగా వదులుతున్నాను. ఒక వేడుకోలు, ఒక నిర్వేదం, అహంభావం, దీనాలాపం, విజయహర్షం, వెనుకచూపు — ఏమీలేవు. ఈనాడు నా ఆత్మబలితో స్వేచ్ఛను నివేదన చేశాను."

"చాలా అన్యాయం, వన్యా, ఇవాళ నువు చదవదగిన పద్యం ఇది కానేకాదు. ఎందుకు చదివావు? తక్షణం దాన్ని ఉపసంహరించుకో. ఇది నీ కెక్కడ దొరికింది?"

"రవీంద్రనాథటాగూరుది."

"ఆయన పుస్తకాలలో ఎక్కడా చూడలేదే."

"అముద్రితం."

"మరి నీ కెలా దొరికింది ?"

"మా నాన్నంటే చాలా అభిమానంగల కుర్రవాడొకతను ఉండేవాడు అతనిలో కవితాతృష్ణ ఉండేది. వీలు దొరికనప్పుడల్లా వెళ్ళి రవీంద్రుడి అముద్రితరచనలను తెచ్చుకునేవాడు."

"అతను దీన్ని తెచ్చి నీపాదాలవద్ద ఉంచాడా ?"

"అతనికంత ధైర్యంలేదు. నాకళ్ళ బడడానికి వీలుగా ఎక్కడో ఒకచోట ఉంచేవాడు —"

"ఈపద్యం అతని హృదయగళంనుంచి వచ్చినట్టేఉన్నది."

"అవును."

"అది నీ కివాళ ఎందుకు జ్ఞాపకంవచ్చింది ?"

"ఎలా తెలుస్తుందీ ? ఇంకొకటికూడా జ్ఞాపకం వస్తున్నది," అంటూ లావణ్య మరొకపద్యం చదివింది.

"వన్యా! మనిద్దరిమధ్యా ఇవాళ ఈ కుర్రా డెందుకు అడ్డొచ్చాడు ? నా కసూయ లేదు — అసూయంటే నాకు రోత. కాని నా కేవో భయంగాఉంది ఈ కుర్రాడిచ్చిన పద్యాలే నీ కివాళ ఎందుకు జ్ఞాపకం రావాలి ?"

"అతను శాశ్వతంగా వెళ్ళిపోయాక ఒకనాడు నాకతని బల్లసొరుగులో పద్యాలు దొరికాయి. దాదాపు ఒక పుస్తకానికి సరిపోయేటన్ని పద్యా లున్నాయి. అన్నీ రవీంద్రుడివే. నేను నీకు వీడ్కోలు చెబుతున్నాను గనక ఈ వీడ్కోలుపద్యాలు స్మరణకు వచ్చిఉండవచ్చు.''

"ఇది అలాటి వీడ్కోలా ?''

"నా కేంతెలుసు? ఈవాదన దేనికి? నా కా పద్యా లిష్టం. అందుకని చదివాను."

"జనం రవీంద్రుడి గీతాలు పూర్తిగా మరిచిపోయినదాకా ఆయన నిజమైన విలవ బయటికిరాదు "...

మర్నాటి ఉదయం లావణ్య ఏపనీ చేయలేకపోయింది. ఇవాళ ఆమె యోగ మాయకన్నకూడా ముందే లేచి, రెండు పుస్తకాలు తీసుకుని, చదివేదానిలాగా యూకలిప్టస్ చెట్టుకింద కూర్చున్నది. ఇవాళ అమితుడు ఆమెను చూడనన్నాడు అందుకని ఆమె షికారుకూడా వెళ్ళలేదు — అతన్ని చూడాలని ఉండికూడా.

సుమారు తొమ్మిదిగంటలప్పుడు అమితుడు, "మాషిమా, మాషిమా !" అని కేకలుపెడుతూ ఇంట్లో జొరబడ్డాడు.

"ఏమిటి? అమితా! భూకంపమా ?" అంటూ యోగమాయ సామాన్లకొట్టులో నుంచి ఇవతలికి వచ్చింది.

"భూకంపమే. సామానంతా ముందు వెళ్ళిపోయింది. కారు సిద్ధంగా ఉంది. ఉత్తరాలకోసం పోస్టాఫీసుకు పోదునుగదా — టెలిగ్రాం !"

"అంతా బాగున్నారా ?''

లావణ్య లోపలికి వచ్చింది.

"మా చెల్లెలు సిసీ, ఆమె స్నేహితురాలు కేటీమిత్రా, ఆమె అన్న నరేన్ ఈ సాయంకాలం దిగుతున్నారు," అన్నాడు అమితుడు.

"అంతేకద ? రేస్‌కోర్సు దగ్గిర ఖాళీ ఇల్లున్నట్టు తెలిసింది. లేకపోతే వాళ్ళను ఎలాగో ఈ ఇంటనే సర్దేదాం," అన్నది యోగమాయ.

''నా దిగు లదికాదు, మాషిమా! వాళ్ళు టెలిగ్రామిచ్చి హోటల్లో గదులు కుదుర్చు కున్నారు. కాని నా స్వర్గం కాస్తా కూలిపోయింది. నేనుకూడా వెళ్ళి ఆ హోటల్లో ఉండాలి,'' అన్నాడు అమితుడు.

అమితుడి సమాజానికీ తనకూ మధ్య ఉండే అంతరం మొట్టమొదటిసారిగా స్ఫురించి, లావణ్య పాలిపోయింది. అతను కలకత్తా వెళుతున్నందుకుకూడా కల గని బాధ, హోటలుకు మారవలసివచ్చిం దన్నప్పు డామెకు కలిగింది.

అమితుడు లావణ్యకేసి ఒక్క క్షణం చూసి, ''నేను హోటలును పోయినా ఏట్లోకి పోయినా, నా అసలి ల్లిదే!'' అన్నాడు.

నిజం తెలుసుకునే ఉద్దేశంతో సిసీ ప్రభృతులు వస్తున్నారని అతనికి తెలుసు. వాళ్ళు ఇక్కడికి రాకుండా చెయ్యడానికతను ఎన్నోప్లాను లాలోచించాడు. కాని ఇటీవల అతని ఉత్తరాలు యోగమాయ చిరునామాకే వస్తున్నాయి. అందువల్ల చిక్కువచ్చిపడుతుందని అతను కలలోకూడా అనుకోలేదు.

తన చెల్లెలు వస్తుంటే అమితుడంత కంగారుపడడం దేనికో యోగమాయ అర్థం చేసుకోలేకపోయింది. తనను అతనిచెల్లెలికి పరిచయం చెయ్యడానికి సిగ్గుపడుతున్నాడనుకున్నది లావణ్య.

''నీ కేంపని లేకపోతే, కాస్సేపు అలా పోయివద్దామా?'' అన్నా డతను లావణ్యతో.

"క్షమించాలి. నాకు తీరికలేదు.''

కాస్త వెళ్ళిరారాదా?" అన్నది యోగామాయ.

''సురమ చదువు చాలా దెబ్బతిన్నది. తప్పంతా నాదే. ఇంక జాప్యం జరగరాదని నిన్నరాత్రి అనుకున్నాను."

"నేనుకూడా వెళ్ళి నా విధి నిర్వర్తించాలి. వాళ్ళకంతా సిద్ధం చెయ్యాలి,'' అన్నాడు అమితుడు. అతడు వరండాలో ఆగి, ''చూడు లావణ్యా! కుటీరం కప్పు ఆ చెట్ల సందుగా కనిపిస్తున్నది. దాన్ని కొనేశాను. నా కేదో లప్ప దొరికిందనుకొని ఇల్లుగలావిడ ధర పెంచేసింది. నాకు లప్ప దొరికినమాట నిజమే గాని, అది నాకు తప్ప మ రెవరికీ తెలీదు. అది రహస్యం," అన్నాడు.

లావణ్య నొచ్చుకున్నదానిలాగా, "ఇతరులను గురించి అంత దుగ్ధ దేనికీ? అందరికీ తెలియనీ. నిజం అందరికీ తెలిసినప్పుడే అందరూ మర్యాదగా ప్రవర్తిస్తారు," అన్నది.

అతను ఆమెను మళ్ళీ కవిత్వంలోకి ఈడ్చి, రవీంద్రుడి కవిత్వాన్ని విమర్శిస్తూ, ఆకుకు అందకుండా, పోకకు పొందకుండా మాట్లాడసాగాడు. లోపలి ఆవేదనను అణచిఉంచడానికే ఆత నలా మాట్లాడుతున్నాడని లావణ్య గ్రహించింది. ఆ సంగతి ఆమె గ్రహించిందని తెలుసుకుని, "సరే, వన్యా, నేను పోతాను," అన్నాడు విరసంగా.

లావణ్య అతని చెయ్యి పట్టుకుని, "మితా, నన్ను వీడిపోవలసివస్తే కోపంతో

మాత్రం వెళ్ళవద్దు; నిన్ను వేడుకుంటాను," అన్నది. ఆమె గుడ్ల నీళ్ళు కుక్కుకుంటూ చప్పున లోపలికి వెళ్ళిపోయింది.

అమితుడు కాస్సేపు అలాగే నిలబడి, తరవాత మెల్లిగా నడుచుకుంటూ యూకలిప్టస్ చెట్టుకిందికి వెళ్ళాడు.

లావణ్య గృహకృత్యాలలో మునిగితేలా లనుకున్నది. కాని దూరంనుంచి చెట్టుకింద ఉన్న అమితుణ్ణి చూడగానే ఆమెకు మనసు ఆగలేదు; అతని దగ్గిరికి వెళ్ళి, "మితా, ఏమి టాలోచిస్తున్నావు ?" అని అడిగింది.

"ఇదివరకు ఆలోచించినదానికి విరుద్ధంగా ఆలోచిస్తున్నాను," అన్నా డతను.

"ఆ ఆలోచన ఎలా ఉంటుం దేమిటి ?"

"ఇదివరకు గంగాతీరానా, కొండలమీదా నీ కోసం ఇల్లుకట్టే ఆలోచన చేశాను. ఇప్పు డదంతా మానేసి, మూట భుజాన వేసుకుని నీ వెంట మహాప్రస్థానం బయలుదేరే ఆలోచన చేస్తున్నాను. బాటవెంట మనిద్దరమే."

"ఎందుకీ ఆకస్మికమైన మార్పు ?"

"శోభనలాల్ తలవనితలంపుగా రాశాడు. నువ్వతని పేరు వినే వుంటావు. ప్రేమచంద్‌రాయ్‌చంద్ స్కాలర్. అతను భారతచరిత్రకు సంబంధించిన ప్రాచీన రహదార్లను గురించి పరిశోధన చేస్తున్నట్టు, నేను భవిష్యత్తుకు మార్గాలు సృష్టిస్తాను.''

లావణ్య దెబ్బతిన్నదానిలాగా అయింది. ''శోభనలాలూ, నేనూ ఒకేసారి ఎమ్మేపరీక్ష ఇచ్చాం. అతన్నిగురించి పూర్తిగా వినాలని ఉన్నది," అన్నది.

"హ్యూన్‌త్సాంగ్ ఆఫ్ఘనిస్తానంలోని కపిశనుంచి ఇండియాకు యాత్ర చేసిన మార్గాన్ని అన్వేషించాలని అతనికి ఒకప్పుడు తీవ్రమైన కోరిక ఉండేది. అలెగ్జాండరుకూడా ఆ దారినే వచ్చాడు. అందుకని శోభనలాలు పుష్తుభాషనూ, పఠానుల ఆచారవ్యవహారాలనూ శ్రద్ధగా అధ్యయనంచేశాడు. మనిషి చాలా అందంగా ఉంటాడు. అతను ఫ్రాన్సు వెళ్ళి ఇలాటి పరిశోధనలు చేసేవారిని కలుసుకుందా మనుకున్నాడు. కొందరికి నేను ఉత్తరాలుకూడా రాసిఇచ్చాను. కాని ప్రభుత్వం అతనికి పాస్‌పోర్టిచ్చిందికాదు. అటుతరువాత అతను కాశ్మీరులో కొంతకాలమూ, కుమావోం కొండల్లో కొంతకాలమూ ఉండి హిమాలయాల మధ్యగా మార్గా లున్నాయా అని వెతుకుతున్నాడు. అతని ఆరాటం చూస్తే నా కేమనిపిస్తుందో తెలుసా ?"

"ఏమనిపిస్తుంది ?"

"ఏ వనంలో ఏ గాజులచెయ్యో చెంప వాయగొట్టింది. అందుకే ఇల్లు వదిలి రోడ్డు

పుచ్చుకున్నాడు. ఎక్కడో మంచి ధోఖా తిని, ఆ బాధ మరవడానికి చెడతిరుగుతున్నాడు. నీకు తెలుసా, వన్యా? ఇవాళ నువు నన్నుకూడా రోడ్డెక్కించావు."

"ఎలా?"

"నేను నీకోసం భవనం నిర్మించి, నిన్నివాళ అందులోకి ఆహ్వానించాను. అందులోకి రా నిరాకరించి, మన సప్తపది మహాప్రస్థానమే నన్నావు."

"చాలు, మితా. నాకు వ్యవధిలేదు," అన్నది లావణ్య.

# 7

లావణ్యకూ తనకూ గల సంబంధం షిల్లాంగులోని ప్రతి బెంగాలీకీ తెలుసు నన్న సంగతి ఇప్పుడే అమితుడు గ్రహించాడు. ఈ విషయమై వారు తీవ్రమైన చర్చలు కూడా జరుపుతున్నారు. కుమార్‌ముఖర్జీ అనేవాడు గాలిమార్పుకుగాను షిల్లాంగు వచ్చి, అమితుడి వృత్తాంతం సిసీ, లిసీ ప్రభృతుల చెవిని వెయ్యడంకోసం వారం లోపునే కలకత్తాకు తిరిగివెళ్ళాడు.

ఈ వార్త నరేన్‌మిత్రకు ఆశాభంగం కలగించింది. అతను సిసీని పెళ్ళాడాలని ఉన్నాడు. కాని సిసీ ఎటూ తేలకుండా గుంభనగా ఉంటున్నది. అమితుడి సహాయంతో ఆమె గుంభనను విచ్ఛేదం చెయ్యాలని నరేన్ ఆశ. కాని పరిస్థితి చూస్తే అమితుడు షిల్లాంగు విడిచి కలకత్తాకు రావడమే అనుమానంలో పడింది.

చివరకు, అమితుణ్ణి ఉద్ధరించడానికి షిల్లాంగు వెళ్ళాలని తీర్మానం జరిగింది. అమితుడి ఉద్ధరణ విషయంలో అమితుడి చెల్లెలు సిసీకన్న నరేన్ చెల్లెలు కేటీ ఎక్కువ ఆసక్తి ప్రదర్శించింది; ఇండియాసొత్తు విదేశాలవాళ్లు కాజేస్తుంటే మన రాజకీయవేత్త లెంత ఆదుర్దాపడ్డారో, కేటీ అంత ఆదుర్దాపడింది.

కేటీ అసలుపేరు కేతకి. జమీందారుకూతురు. చాలాకాలం యూరపులో ఉండి వచ్చినవాడి చెల్లెలు. పాశ్చాత్యనాగరికతయొక్క సారం ఆమెకు పూర్తిగా వంటబట్టింది. ఆమె సహవాసంవల్ల సిసీకికూడా కొంత పాశ్చాత్యనాగరికత అబ్బింది. అది సొంతం అబ్బలేదు. ఆమె కింకా కిస్‌మిస్ పుడింగుకన్న చిమ్మిరే రుచి అనిపిస్తున్నది.

అమితుణ్ణి గురించిన పుకార్లు విని, ఈ ముగ్గురూ షిల్లాంగుకు ఆదరాబాదరా వచ్చారు. ఎందుకంటే వాళ్ళ పరిభాషలో లావణ్య ఒకప్రయివేటు పంతులమ్మ. ఆమె తన మాయాజాలంతో అమితుణ్ణి వశపరచుకుని ఉంటుందనీ, ఎంతో తెలివిగా అతన్ని ఆమె పట్టునుంచి విడిపించవలసి ఉంటుందనీ వాళ్లు ఊహించారు. అందుకుగాను వాళ్ళు ఒక పథకంకూడా వేశారు: ముందుగా శత్రుస్థావరాన్నీ, యుద్ధరంగాన్నీ,

ఆమాయావిని బలాబలాలనూ పరిశీలించకుండా అమితుడితో ఏమీ మాట్లాడరాదు.

అమితుణ్ణి చూస్తూనే అతను మోటుబారిఉండటం వాళ్ళకు కొట్టవచ్చినట్టు కన బడింది. అతనిరంగు ముదరబారింది. తెలివితేటలు మందగించినట్టు కనబడ్డాయి.

"నువు కొండవాడిలా తయారయిఉంటా వనుకున్నాం. కాని బొత్తిగా దేవదారు చెట్టులాగా అయిపోయా వేమిటి?" అన్నది సిసీ అతనితో.

"చెట్లమధ్య ఉంటే చెట్లగుణం అబ్బుతుంది," అన్నాడు అమితుడు.

వాళ్ళకునున్నట్టుగా అతను తానై లావణ్యసంగతి తేలేదు. నాలుగురోజులు గడి చాయి, కాని అత నా సంగతే ఎత్తడు. అతను వాళ్ళకన్నముందే లేచి ఎటో వెళ్ళి వచ్చేవాడు. తిరిగవచ్చినప్పు డతనిముఖం చినిగిన అరిటాకులా ఉండేది. ఇంత కన్న ఘోరమైన సంగ తేమంటే, అతని పక్కమీద టాగోరు గీతాలపుస్తకం ఉన్నది. దానిమీద లావణ్యపేరు ఇంగ్లీషులో రాసివున్నది. అందులో "లా" ఎర్ర సిరాతో కొట్టేసిఉన్నది.

ఉన్నట్టుండి అమితుడు, "ఆకలి తెచ్చుకోవాలి," అని ఎటో వెళ్ళిపోయేవాడు సిసీ లోలోపల నవ్వుకునేది. కేటీ లోలోపల మండిపడేది. అతను వాళ్ళనుగురించి పట్టించుకునేస్తితిలో లేడు. అతను తడుపుకోకుండా, జలపాతం చూడబోతున్నా ననేవాడు. అదేం జలపాతం. ఎక్కడున్నది? అందులో మొదలు నీరున్నదా లేదా అన్న సందేహాలు అవతలవాళ్ళకు తగులుతాయన్న ఆలోచనకూడా అతని కుండేది కాదు. ఈ ఉదయం అతను నారింజ తేనెకోసం పోతున్నా నన్నాడు. ఆడపిల్ల లిద్దరూ తాముకూడా వస్తామంటే, దారి చాలా భయంకరంగా ఉంటుందని చెప్పి, వాళ్ళు మళ్ళీ మాట్లాడేలోగా ఉడాయించేశాడు.

ఇక ఆలస్యం చేయడం మంచిదికాదని వాళ్ళు ఆరోజే నారింజతోటకు ప్రయాణమయారు. నరేన్ రేసులకు పోతూ సిసీని వెంటరమ్మంటే, రాననేసింది.

స్నేహితురాళ్ళిద్దరూ యోగమాయ ఇంటిముందున్న పోర్చిదాకా వచ్చి, చదు వులో నిమగ్నమైఉన్న లావణ్యానూ, సరమనూ చూశారు.

కేటీ, "సారీ," అంటూ మెట్లెక్కి వచ్చింది.

"మీ కెవరు కావాలండీ?" అని లావణ్య అడిగింది.

"అమిత్‌రాయ్ ఇక్కడ ఉన్నారా అని తెలుసుకోవడానికి వచ్చాం," అన్నది కేటీ, లావణ్యను ఎగాదిగా చూస్తూ.

అమిత్‌రాయ్ అనేది ఏరకంప్రాణో వెంటనే ఊహించలేక, "మా కాయన తెలీదే!" అనేసింది.

స్నేహితురాళ్ళిద్దరూ ఒకరి నొకరు చూసుకుని, వెటకారపు ముఖాలు పెట్టారు.

కేటీ బుసకొడుతున్నదానిలాగా, "ఆయన ఇక్కడికి తరుచు వస్తారని మాకు తెలుసు — తన క్షేమానికిమించి మరీనూ!" అన్నది.

లావణ్య చకితురాలై, తన పొరపాటు గ్రహించి, ''యజమానురాలిని పిలుస్తాను. ఆమె మీకంతా చెబుతారు,'' అన్నది.

లావణ్య లోపలికి వెళ్ళగానే సురమతో, "పంతులమ్మా? పేరు లావణ్య కాదూ?'' అన్నది. సురమ అవునన్నది. సురమచేత అగ్గిపెట్టె తెప్పించుకుని కేటీ సిగరెట్టు అంటించింది. సురమ లోపలికి పరిగెత్తిపోయింది.

స్నేహితురాళ్ళిద్దరూ లావణ్యగురించి విమర్శించుకున్నారు — లావణ్య మహా సౌందర్యవతిట! అమితుడు ఆమెను క్షణం సేపు ఎలా భరించగలిగాడు. మగవాళ్ళు మహా చిత్రమైనవాళ్ళు!

ఇంతలో యోగమాయ ఒక్కతే బయటికి వచ్చింది. కేటీ నిలబడబోగా, సిగరెట్టుపొగ వదులుతూ ఆమెకేసి నిర్లక్ష్యంగా చూసింది. ఆమెకు లావణ్యమీదనే హెచ్చుకోపం వచ్చింది. చెడిపోయిన లావణ్యను ఈ యోగమాయే అమితుడికి సంధానం చేసిఉంటుందని కేటీ అనుకున్నది.

సిసీ ముందుకు వచ్చి యోగమాయను కొంత మర్యాదగా పలకరించి, "నా పేరు సిసీ; అమితుడి చెల్లెల్ని," అన్నది.

యోగమాయ చిరునవ్వు నవ్వి "అతను నన్ను పిన్నీ అని పిలుస్తాడు. అందు చేత నేను నీకుకూడా పిన్నినే," అన్నది. ఆమె కేటీని లక్ష్యపెట్టక సిసీని, "రా, అమ్మా, లోపలికి రా," అని ఆహ్వానించింది.

"పైమిలేదు. అమితుడున్నాడా అని అడిగిపోవడానికే వచ్చాను,'' అన్నది సిసీ.

''అత నింకా రాలేదు.''

''ఎప్పు డొస్తాడో తెలుసా?"

''చెప్పలేను; కాని కనుక్కుంటాను.''

"ఆ చదువుచెప్పే పంతులమ్మ తాను అమితుణ్ణి ఎరగనట్టే నటించింది,'' అన్నది కేటీ, కూర్చున్నచోటినుంచి కదలకుండా.

యోగమాయ నిర్ఘాంతపోయింది.

"అమితబాబు మీ రుండే హోటల్లోనే ఉంటున్నట్టు తెలిసింది. అతని విషయాలు మీకే బాగా తెలియవచ్చునే," అన్నదామె.

కేటీ లోలోపల దహించుకుపోతున్నది. అలాటి మంట ఏమీ లేకపోవడంచేత సిసీకి యోగమాయమీద మంచి అభిప్రాయం కలిగింది. కాని కేటీకి భయపడి సిసీ



తన సహజమార్దవాన్నికూడా చంపుకునేది. తన ప్రవర్తన సిసీకి ఏమూలో నచ్చలేదని గ్రహించి, కేటీ యోగమాయ సమక్షంలోనే ఆశాభావాన్ని నిర్మూలించే ఉద్దేశంతో, సిసీ నోట సిగరెట్టు తోసి, దాన్ని తన సిగరెట్టుతో అంటించింది.

ఈ క్షణంలోనే అమితుడు వచ్చాడు. ఆడపిల్లలిద్దరూ అతన్ని చూసి దిగ్భ్రమ చెందారు. ఇంగ్లీషు దుస్తులతో హోటలునుంచి బయలుదేరినవా డిప్పుడు ధోతీ కట్టుకుని, శాలువ కప్పుకుని ఉన్నాడు. అతను భోజనం చేశాక తన కుటీరానికి వెళ్ళి, విశ్రాంతి తీసుకుని, దుస్తులు మార్చుకున్నాడు.

ఇవాళే కలకత్తానుంచి ఉంగరం వచ్చింది. దాన్ని లావణ్యచేతికి ఎలా పెట్టాలా అని అతను చాలగా ఆలోచించాడు. తీరా అతను వచ్చేసరికి యోగమాయ కొయ్యబారి చూస్తుండగా, కేటీ సిసీచేత సిగరెట్టు కాల్పిస్తున్నది. యోగమాయకు ఈ అమర్యాద బుద్ధిపూర్వకంగా జరుగుతున్నదేనని అతను గ్రహించాడు. అతను ఆ ఆడపిల్లల కేసి చూడనైనా చూడకుండా, "పిన్నీ!" అంటూ యోగమాయ ముందు వంగి ఆమె పాదధూళి తీసుకున్నాడు. లావణ్య ఎక్కడున్నదంటూ అతను యోగమాయతోసహా లోపలికి వెళ్ళాడు.

"అవమానం! ఇంటికి పోదాంపద, కేటీ. ఇక్కడ ఉండి లాభంలేదు." అన్నది సిసీ.

"ఏదో లాభం ఉండకపోదు ఇటేగా బయటికి వస్తాడు?" అన్నది కేటీ.

చివరకు అమితుడు రానేవచ్చాడు — లావణ్యతోసహా. యోగమాయ ముందు రాలేదు. అతను లోపలికి వెళ్ళి ఆమెను తెచ్చాడు. లావణ్యచేతిన కొత్త ఉంగరం ఉండడం కేటీ గమనించింది.

"పిన్నీ, ఇది నా చెల్లెలు శమిత. నా చెల్లెలు స్నేహితురాలు కేతకి," అని అతను యోగమాయకు పరిచయం చేశాడు. అతను లావణ్యను తన చెల్లెలికి పరిచయం చేస్తూ, "ఈమెపేరు నానోట వినకపోయినా ఇతరులు చాలామందినోట వినిఉంటావు. మేము వచ్చే మార్గశిరమాసంలో కలకత్తాలో పెళ్ళాడబోతున్నాం," అన్నాడు.

కేటీ రానినవ్వు నవ్వుతూ, "నారింజతేనె చాలా సులువుగానే దొరికిందన్నమాట దారి కూడా ఏమంత కష్టంలేదు. తేనె దానంతటదే వచ్చినోట పడ్డట్టున్నది!" అన్నది.

సిసీ కిలకిలా నవ్వింది. లావణ్యకు ఆమాటలలో ఉండే విషం తెలియవచ్చింది గాని, అంతరార్థం తెలియరాలేదు. అమితుడు వివరించాడు: "ఈ ఉదయం నేను బయలుదేరేటప్పుడు, ఎక్కడికని వాళ్ళడిగితే అడవితేనెకోసం అన్నాను. అందుకు వాళ్ళు నవ్వుతున్నారు. నే నెప్పుడు హాస్యంగా మాట్లాడతానో ఇతరులు తెలుసుకోలేరు," అన్నా డతను.

"నీకు తేనె దొరికింది గనక నేను నష్టపోకుండా చూడు," అన్నది కేటీ.

"నే నేం చెయ్యాలి?" అని అమితు డడిగాడు.

"నిన్ను తీసుకురాలేనని నరేన్ నాతో పందెంవేశాడు. తెస్తానని ఈ రవ్వ టుంగరం పందెం పెట్టాను. ఈ ఉంగరం పోతే నా కెన్నటికీ మనశ్శాంతి ఉండదు. ఆమాట నీకూ తెలుసు. దీన్ని నువే నా కిచ్చావు. ఒక్క క్షణంకూడా ఇది నా వేలునుంచి తియ్యలేదు ఇన్నేళ్ళూనూ. దీన్ని పందెం ఓడి పోగొట్టుకోమంటావా ?" అన్నది కేటీ.

"అసలు దాన్ని పందెం ఎందుకు పెట్టావు ?" అని సిసీ అడిగింది.

"ఎందుకా ? అతిశయమూ, మగవాడిలో నమ్మకమూ జాస్తి కావటంచేత! అంత అతిశయంకూడదు. నాకు బాగానే శిక్షఅయింది. నేనిప్పుడు అమితుడికి పనికి రాకుండాపోయాను. నన్నిలా మోసగించేవాడివి నా కీ ఉంగరం అంత ఆప్యాయంగా ఎందు కిచ్చావు ? అందులో నీ బాధ్యతగాని, నాకు వాగ్దానంగాని ఏమీలేదా ?"

కేటీ కన్నీటిని బలవంతాన నిగ్రహించుకుంటున్నట్టు కనబడింది.

ఏడేళ్ళ క్రితం, కేటీ పద్దెనిమిదేళ్ళ పిల్లగా ఉండగా, తా మిద్దరూ ఇంగ్లండులో ఉంటున్నప్పుడు, అమితుడా ఉంగరాన్ని కేటీ వేలికి తొడిగాడు. అదొక ముగ్ధ ప్రణయ సన్నివేశం. అప్పటి కింకా కేటీ మొహమంతటా రంగు మెత్తుకోవటమూ, వదరడమూ ఎరగదు.

కాని ఇప్పుడు అమితుడు ఏమీ అనలేని స్థితిలో పడ్డాడు.

"నేను రేసులో ఓడాను. ఈ ఉంగరం పచ్చిఅబద్ధంలాగా నా వేలిన దేనికి ? నువే తీసుకో," అంటూ ఉంగరాన్ని తీసి బల్లమీద కొట్టి, మెత్తిన చెక్కిళ్ళవెంట కన్నీరు కార్చుతూ బయటికి వెళ్ళిపోయింది.

# 8

లావణ్యకు శోభనలాలునుంచి ఒక ఉత్తరం వచ్చింది.

"నిన్నరాత్రి షిల్లాంగు చేరాను. నీ అనుమతి అయితే ఒకసారి వచ్చి నిన్ను చూస్తాను. నన్ను శిక్షించావు. నేను ఎప్పుడు, ఏం తప్పు చేశానో ఇంకా తెలుసుకో వలసిఉన్నది. నీనుంచి తెలుసుకుంటేగాని నాకు శాంతి లేదు. భయపడకు, నేను నిన్నిం కేమీ కోరబోను."

కళ్ళనుంచి ఉబికివచ్చే నీటిని తుడుచుకుంటూ, గతాన్ని నెమరువేసుకుంటూ లావణ్య కూర్చున్నది. తన హృదయంలో తొలిగా తలఎత్తిన ప్రేమకుసుమాన్ని ఆమె తుంచివేసి, విద్యే సమస్తమూ అనుకున్నది. తన తండ్రి ప్రేమపాశంలో చిక్కుకున్నప్పుడుకూడా ప్రేమ ఒక దౌర్బల్యంగానే ఆమెకు తోచింది. ఒకప్పుడు సహజమూ, సులభసాధ్యమూ అయినవి ఇప్పుడు ఎంతో దుర్ఘటమయింది. ప్రేమ ఆమెపైన పగతీర్చుకున్నది. ఆమె అతిశయం బూడిదలో పొర్లుతున్నది. అవమా

వించబడి వెళ్ళిపోయిన శోభనలాలు ప్రేమ ఇంతకాలం ఎలా నిలబడి దక్కింది? అతనిది చాలా ఉదారస్వభావ మైఉండాలి.

లావణ్య జవాబు రాసింది.

"నీవే నాకున్న ఉత్తమ మిత్రుడివి. నీ మైత్రికి వెల ఇవ్వడానికి నా వద్ద ఏమీ లేదు. నీవు నానించి ఎన్నడూ ఏమీ కోరలేదు; ఇప్పుడూ కోరడం లేదు. నిన్ను నిరాకరించేటందుకు తగినంత అహంకారంగాని, బలంగాని నాకు లేవు."

ఈ ఉత్తరం పంపేసిన మరుక్షణమే అమితుడు వచ్చాడు. అతను ఆమెను బయటికి రమ్మని ఆహ్వానించాడు – ఆమె నిరాకరిస్తుందని భయపడుతూనే. కాని ఆమె సరే నన్నది. దారిలో జంకుతూనే ఆమె చెయ్యి తీసుకున్నాడు. ఆమె అభ్యంతరం చెప్పలేదు.

"ఇంకొకరి వేలికి పెట్టిన ఉంగరం నన్నెందుకు కాజెయ్యనిచ్చావు?" అని లావణ్య మృదువుగా అడిగింది.

అమితుడు నొచ్చుకుని, "నీ కెలా అర్థమవుతుంది. వన్యా? నే నా ఉంగరం పెట్టినమనిషీ, ఇవాళ దాన్ని విసిరిపారేసిన మనిషీ ఒకటికాదు," అన్నాడు.

"ఒకటి సహజంగా తయారయినది; రెండవది నీ అలక్ష్యం ఫలితంగా సృష్టి అయినదీనూ."

"అది పూర్తిగా నిజంకాదు. కేటీకి ఇప్పటి రూపు కల్పించిన సమ్మెటపోట్లన్నీ నేను కొట్టినవికావు."

"కాని మితా! ఒకప్పు డామె పూర్తిగా నీదయింది. ఆమెను నీ దాన్నిగా ఎందుకు చేసుకోలేదు? ఆమె నెందుకు చెయిజారిపోనిచ్చావు? ఇతరుల ప్రభావాని కెందుకు గురికానిచ్చావు? నిన్ను పోగొట్టుకునే ఆమె ఇలా విదేశీ బొమ్మలాగా తయారయింది. ఆ విషయం పోనీ, ఒకపని చేస్తావా? సరే ననాలి."

"ఏమి టది?"

"ఒక వారంపాటు నీ మిత్రురాలను చిరపుంజి తీసుకుపో. ఆమెకు ఆనందం కలగక పోయినా ఉల్లాసం కలగవచ్చు."

అమితుడు కొంచెం ఆలోచించి, "సరే," అన్నాడు.

ఇంకొక్క విషయం. మితా! మన అంతస్సులమధ్య ఉండే బంధం కొంచెం కూడా నీ చేతులను బంధించనివ్వకు. ఇది ప్రేమపూర్వకంగానే నీతో చెబుతున్నాను. నా కీ ఉంగరంకూడా వద్దు. ఈ బాహ్యచిహ్నాలతో నాకు పనిలేదు."

ఆమె తనవేలి ఉంగరం తీసి అమితుడి వేలికి పెట్టింది; అతను పెట్టనిచ్చాడు.



ఏడు రోజులూ గడిచాక అమితుడు యోగమాయ ఇంటికి వచ్చాడు. ఇ ట్లో ఎవరూ లేరు. అంతా ఎటు వెళ్ళారో తెలియదు అతను వెళ్ళి యూకలిప్టస్ చెట్టుకింద నిలబడి ఉండగా తోటమాలి వచ్చి, ఇల్లు తెరవమంటారా? లోపలికి పోతారా?" అని అడిగాడు.

అమితుడు సంకోచిస్తూ సరే నన్నాడు. లావణ్యగదీ, పడకగదీ బోసిపోయి ఉన్నాయి. అతను దుర్భరమైన నీరసంతో తన కుటీరానికి వెళ్ళాడు. కుటీరం ఎప్పటి లాగే ఉన్నది. అతనికి షిల్లాంగ్ కొండలలో ఇప్పు డంద మేమీ గోచరించలేదు.

అమితుడు కొంతకాలం నైనిటాల్ లోనూ, కొంతకాలం ఊటీలోనూ గడిపి, చిట్టచివరకు కేటీ ముఖానికి పట్టించిన పులుముళ్లు వదలగొట్టడానికి పూనుకున్నాడు.

కలకత్తాలో కాలేజీలో చదువుతున్న యతిశంకరుడు ఒకరోజు అతన్ని, "అమితదా! నీకూ కేతకికీ పెళ్ళటగా?" అని అడిగాడు.

"ఈ సంగతి లావణ్యకు తెలుసా?" అని అమితుడు ఎదురడిగాడు.

"నిన్నడిగి రాద్దా మనుకున్నాను," అన్నాడు యతి.

"వార్త నిజమేగాని, లావణ్య అపోహ పడుతుందేమో?''

''అపోహ దేనికి? పెళ్ళి చేసుకుంటే చేసుకుంటావు!"

"ఏమైనా ఆమె కీ పెళ్ళిగురించి ముందుగా తెలపాలి. ముందు నీ కొక ఉత్తరం ఇస్తాను. దాన్ని ఆమెకు చేర్చగలవా?"

''చేర్చుతాను."

అమితుడు లావణ్య కిలా ఉత్తరం రాశాడు :

''ఆనాడు రోడ్డుచివర మనం నిలబడిఉన్న సాయంకాలం నీ కొకపద్యం చదివాను. ఇవాళ మరొకరోడ్డుచివర నిలబడిఉన్నాను. ఇప్పుడుకూడా ఒకపద్యం చదువుతాను. నా తుదిభావాలు నీ కవినోటనే వ్యక్తం చేస్తాను!

"నీ మారని అదృశ్యరూపం నా కళ్ళలో ఉన్నది
నా అదృశ్యహృదయకుహరంలో నీ వెప్పుడూ ఉంటావు.
అన్నిటినీ బంగారం చేయగల పరుసవేది లభించింది.
నాలోని శూన్యాన్ని నీవే నించావు.
జీవితం అంధకారంగా ఉండగా, నా హృదయ
మందిరంలో నీవు కానుకగా విడిచివెళ్ళిన జ్యోతి దొరికింది.
వియోగం, పవిత్రమైన అగ్నిలాగా, తన దుఃఖకాంతిలో
పవిత్రప్రేమమూర్తిని వ్యక్తం చేసింది.

— మిత."

కొద్దిరోజులు గడిచాయి. యతిశంకరుడు లావణ్యవద్దనుంచి ఒక ఉత్తరం తెచ్చి ఇచ్చాడు. అందులో కాగితానికి ఒకపక్క లావణ్యా శోభనలాలుల వివాహవార్త ఉన్నది. రెండవపక్క ఏడెనిమిది పద్యాలున్నాయి అందులో ఆఖరుపద్యం ఇలాఉంది:

"నేను నీ కిచ్చినది
శాశ్వతంగా నీదే.
హృదయం నిత్యమూ
ప్రార్థనలకు లొంగి ద్రవించే బొట్లే
ఇతరులకు దక్కుతవి.
నా సాటిలేని మిత్రరాజా
నేను నీ కిచ్చినది నీ నుంచి పుచ్చుకొన్నదే.
నీ వెంత ఆప్యాయంగా స్వీకరిస్తే అంతగా ఋణపడతాను.
మిత్రమా! సెలవు.

— వన్య."

# గుర్రప్పుకళ్లెం అను మరిడీమహాలక్ష్మికథ లేక గోవులొస్తున్నాయి జాగ్రత్త!

## రాచకొండ విశ్వనాథశాస్త్రి

(గతసంచిక తరువాయి)

"అంటే, ఇసివాస గాతుకుడన్న మాట!" అని వివరించేడు ప్రభుదాసు.

నాకు సత్యమూర్తిగాణ్ణి తల్చుకొంటే భయం వేసింది. విశ్వాసఘాతకులంటే వాళ్ళు రాక్షసులకంటే అధములని నాకు అప్పుణ్ణించే అభిప్రాయం ఏర్పడింది. వాళ్ళని చంపినా పాపంలేదు.

ఆ రోజున ఆ క్షణంలోనే ఆ ప్రభుదాసుడు మనకి చాలా నిశ్వాసంగా ఉంటాడని బోధపడిపోయింది.

"ఆడికీ నాకూ రేపో మాపో కసాలా తప్పదు!" అన్నాడు ప్రభుదాసుడు.

ఆ 'కసాలా'లో ప్రభుదాసుచేత ఆ సత్యమూర్తిగాడు చావుదెబ్బలు తింటే బావుంటుందని నా కనిపించింది.

"గుడ్డి మల్లిగాడన్జెప్పి ఉండీవోడు, ఆడు మన బాగ్గోరికాడ రైతెధవ! ఆడి కొడుకే ఈడు. బాగ్గోరే సదుం సెప్పించి తనకాడే నౌకిరీ సేసుకోరా అంటే, బాగ్గోరు జేర్నారుకదా అన్జెప్పి ఈడు కూడా – పులిన్జూసి నక్క ఓతలెట్టుకున్నట్టు – ఈడుకూడా కద్దరుసంగంలో జేరి బాబుగోరికంటె పెద్దోడైపోయినట్టు యిర్రీగుతున్నాడు! బాగ్గోరి పంచన్జేరి బాబుగోరి లోగిలికే ఓసా ల్లెక్కొడుతున్నాడు! పెద్ద లీడర్నన్జెప్పుకుని ఊరంట తిరిగి రోజుకో పితూరీ లెగదీస్తున్నాడు! అందరికంటె ముక్యస్తంగ నామీద కత్తిగట్టినాడు!" అని ప్రభుదాసు నాతో గబగబా చెప్పేడు. అంతలో మేం స్టేషన్ గేటువగ్గరకి వచ్చేం. టిక్కెట్లు ఇచ్చేసి గేటు దాటేం.

స్టేషన్‌కీ సువర్ణ సు[illegible]రపురానికీ నాలుగుమైళ్ళ దూరం ఉంది.

స్టేషనుబయట గుర్రబ్బగ్గీలో సామాన్లు పెట్టిస్తూండగా కొందరు పాటకపుజనం మాకు చూట్టూ కొంచెము దూరంగా నిల్చున్నారు. అందులో ఒకడు ప్రభుదాసుని కొంచెం రహస్యంగా, "ఒవురా బాబు?" అని నా గురించి అడగడం నాకు స్పష్టంగా వినిపించింది. "కలెక్టరుగారబ్బాయి!" అనిప్రభుదాసు

కొంచెం గట్టిగా, అందరికీ వినిపించేలా, చెప్పేడు. నేను వాళ్ళందర్నీ చిరునవ్వు నవ్వుతూ చూసేను. అలా చూడగానే వాళ్ళంతా నాకు దండాలు పెట్టేరు.

జనం, ఆ రోజుల్లో, అంత అమాయకంగానూ, వినయంగానూ ఉండేవారు. అటువంటివాళ్ళని ఈ ఖద్దరుసన్యాసిగాళ్ళు గాలిని రెచ్చగొట్టినట్టుగా రెచ్చగొట్టేరు. దాన్తో ఆ గాలి సుడిగాలిగా మారి, ఆ జనం ప్రభంజనంగా తయారయి మనల్నందర్నీ చుట్టబెట్టేస్తోంది! అందుచేత నేనా చిన్ననాటి 'సత్యకాలం' కోసం నేను తరచు తహతహలాడుతూంటాను. మన ఉప్పు తిన్నందుకు మనకి విశ్వాసంగా ఉంటూ మనల్ని కంటికి రెప్పలా కాపాడే ప్రభుదాసుడివంటి — జెమ్స్ — మణిపూసల వంటి సర్వెంట్సు కానరానందుకు గింజుకుపోతూంటాను.

ఆ రోజున గుర్రబ్బగ్గీలో మేం అంతా వెళ్తూండగా ఏదో మాటమీద మాటవచ్చి, సత్యమూర్తిగాడు, "పేదల్లోనూ ఉంటారు ద్రోహులు! అంటూ ప్రభుదాసు మీద అనవసరంగా ఓ విసురు విసిరేడు.

ప్రభుదాసుడు ఊరుకోలేదు. "కుడితెడితే సేతుల్నాకే సొమ్ములూ ఉంటాయి; కూడెడితే కరిసే కుక్కలూ ఉంటాయి!" అని సత్యమూర్తిగాడి విసురుకి ఎదురు విసురు విసిరేడు. దాన్తో, సత్యమూర్తిగాడి నోరు మూతపడిపోయింది.

గుర్రబ్బగ్గీ నిదానంగా వెళ్తోంది బండివాడు (వాడికూడా పచ్చటి కుచ్చుపాగా ఉంది) గుర్రాన్ని తాజుగా తోల్తున్నాడు. ఇంకా సూర్యోదయం కాలేదు. కాబోతూ కాబోతూ ఉంది.

దార్లో మేకలమందొకటి అడ్డొచ్చింది గుర్రబ్బగ్గీ ఆగింది.

ప్రభుదాసూ సత్యమూర్తీ నాకు ఎదురుగా కూర్చున్నారు. గుర్రం, వాళ్ళకి వీపువైపున ఉంది. గోదాసుగాడు బండివాడి పక్క కూర్చున్నాడు. బగ్గీ ఆగడము చూసి, బండివాణ్ని ఉద్దేశించి, "ఏట్రా!" అని కేక వేసేడు ప్రభుదాసు.

"ఏట్రా?!" అని ప్రభుదాసు కేక వేసి, వెనకకితిరిగి మేకలమందని చూసి, మేకలవాళ్ళని బూతులుతిట్టి, గద్దించి గర్జించేసరికి, గొల్లలు గజగజమని వణకడం నేను కళ్ళారా చూసేను. ప్రజల్ని అంత 'టెరర్'లో ఉంచేరుకాబట్టే రాజ్యం ఆ రోజుల్లో అంత సాఫీగా వెళ్ళింది.

అంతలో మేకలు పక్కకి తప్పుకున్నాయి. బండివాడికొరడా సర్రుమంది; బగ్గీ ముందుకి కదిలింది.

"అన్నట్టు రేపేకావాల, ఆవుల మందొచ్చి పడద్ది అయ్యగోరి పీకల మీదకి," అని అప్పుడన్నాడు ప్రభుదాసు. ఆమాట లతను వెటకారంగానూ, కొంచెం చిరాగ్గానూ అన్నాడు. 'ఆవులేమిటి? రావడం ఏమిటి?' అని నేను అడగలేదు. అదొక ముఖ్యమైన వార్తగాగాని విషయంగాగాని నేను తీసుకోలేదు.



మా గుర్రబ్బగ్గీ చల్లగాలిని సేవిస్తూ చెట్లకొమ్మల పచ్చితోరణాల కిందనించి దర్జాగా ముందుకి సాగుతోంది.

మా రాజయోగి పెదనాయనగారికి 'శత్రుప్రేమ' చాలా ఎక్కువని చెప్పేను కదా. ఆయనకి జంతుప్రేమకూడా అంత ఎక్కువగానూ ఉండేది. గోపాల చక్రవర్తి ఆయన యిష్టదైవం, గోవులు ఆయన ఇష్టజంతువులు. ఒక్కొక్కప్పుడు ఆయనకి మానవులంటే ప్రేమకంటె జంతువులంటేనే ఎక్కువప్రేమ ఉండేదని చెప్పవచ్చునేమో కూడాను; మనుష్యులకంటె కుక్కలు ఎన్నోరెట్లు నయం అని ఆయనొకసారి సీరియస్‌గా చెప్పడం నేను విన్నాను. బుగతల్ని ధిక్కరించే రైతుల్నీ, ఆఫీసర్లని ధిక్కరించే గుమాస్తాలనీ, కంపెనీలని ధిక్కరించే కూలీలనీ చూసినప్పుడల్లా మా రాజయోగి పెదనాయనగారి 'శునకనీతి మాటలు' ఎంత నిజమోకదా అని ఇప్పటికీ నాకు అనిపిస్తూంటుంది.

కాని,

'జంతుప్రేమ'లో కూడా ఎక్కువ తక్కువ లుంటాయి. మనలో కొందరికి కుక్కలంటే ఎక్కువ ప్రేముంటుంది. మరికొందరికి పిల్లు లంటే ఎక్కువ ఇష్టం ఉంటుంది. మా రాజయోగి పెద నాయనగారికి మాత్రం గోవులంటే అతి ఎక్కువ ప్రేముండేవని నేను ఖచ్చితంగా చెప్పగలను.

పాలిచ్చే చక్కటి ఆవులంటే నాక్కూడా ఎంతోఇష్టం. చక్కని ఆవుని చక్కగా రాటకి కట్టి, దాని పెయ్యని అది మాతృప్రేమతో పుత్రవాత్సల్యంతో నాకుతూండగా, దాని మెత్తని పొదుగులోంచి అమృతం పిండిస్తు మన పాలెకావు

దానిపాలు పితుకుతూంటే — ఆ దృశ్యం నాకు వర్ణించ నలవికానంత ఆహ్లాద కరంగా ఉంటుంది; ప్రకృతిమాత మన ఇంటిముంగిట కామధేనువులా నిల్చొని సకలసంపలూ, మనకి, అడక్కుండా ఇస్తున్నట్టనిపిస్తుంది. సృష్టిలో ఉండే కరుణంతా నాకు గోమాత కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తుంది. పంటచేలమధ్య కష్టించి, నవ్వుతూ నిల్చున్న కర్షకకాంత అమాయకపు కళ్ళల్లా గోదేవి కళ్ళు అమాయకంగా మనోహరంగా మెరుస్తుంటాయి. ఆ పంటచేలు మనవే ననీ, ఆ పవ్వేకాంత మనల్ని నమ్మి బతికే పాలె కాపు కూతురేననీ, ఆమె జీవితం మనకి ఏనాడో అంకితం అయిపోయిందనీ తెలిస్తే ఎంత సుఖంగా ఉంటుందో. మాకు పాలిచ్చే మా తెల్లావుని (నల్లావు నైనాసరే) చూస్తే నాకు అంత సుఖంగానూ ఉంటుంది.

మావైపు గోగణాల్ని సొమ్ము లంటారు. ధనానికి తెలుగుసేత — సొమ్ము, తెలుగైనా సంస్కృతం అయినా సొమ్ము సొమ్మేకదా! అందు చేతనే —

సొమ్ముల్ని కంటికిరెప్పలా కాపాడిన అలనాటి వెన్నదొంగకి నేను చెయ్యెత్తి దండం పెడుతూంటాను. వేణునాదంతో గోగణాల్ని పరవశింపచేసిన ఆ గోపాల చక్రవర్తి తన కళాచాతుర్యంతో ఆశ్రమ జీవుల కష్టాలన్నింటినీ కాణీ ఖర్చు లేకుండా తీరుస్తున్నా డన్నమాట ! వాటిని మైమరపిస్తున్నా డన్నమాట ! దీన్నిబట్టే నేను, ఆర్టుకీ ప్రజల జీవితానికీ ఉండవల సిన సంబంధం గురించి చక్కటిపాఠం నేర్చుకున్నాను. బక్క దుక్కిటెద్దుల జీవితంలా ప్రజలజీవితం చాలా కష్టాలతో కూడుకొనిఉంది. (అది అలా లేదనుకొని మనం వ్యవహరించినట్లయితే మనం పెద్ద పొరపాటు చేసినవాళ్ళం అవుతాం.) అందుచేత నిజమైన ఆర్టు ప్రజల్ని మైమరపించేదిగా ఉండాలేకాని వాళ్ని రెచ్చగొట్టేదిగా మాత్రం ఉండకూడదు. ఇది నా సిద్ధాంతం.

ఇక, మా రాజయోగి పెదనాయనగారి సంగతి —

తమ జమీగ్రామం అయినట్టి సువర్ణ సుందరపురంలో మా రాజయోగి పెదనాయనగారు స్థాపించినటువంటి "సు. సు. పు. గోశాల" మన రాష్ట్రాని కంతటికీ తలమానికంగా ఉండేది. బీద బక్క, చచ్చు పుచ్చు గోవులు పాతికనించి యాభై వరకూ ఆ సాల్లో ఎల్లప్పుడూ ఉంటూం డేవి. అయితే, మోతుబరీ రైతులుకూడా వాటి మేతఖర్చుకి సాయం చేస్తూండడం వల్లా, అవి అక్కడకి వచ్చిన కొద్ది రోజుల్లోనే చస్తూండడంవల్లా, "యోగ్గారికి ఆట్టే ఖర్చుండదు!", అని కొందరు క్షుద్రులు అంటూండేవారు. అయితే ఆ మాటలు అవి పలికినవారి క్షుద్రత్వం తెలియజేస్తాయే కాని మా రాజయోగి




పెదనాయనగారి ఔదార్యాన్ని మాత్రం కప్పిపుచ్చజాలవు. వెన్నెల చాలా వేడిగా ఉంటుందన్నంత మాత్రంచేత వెన్నెల తాలూకు చల్లదనం పోతుందా? మేఘాలు కమ్మినంత మాత్రంచేత సూర్యుడు చల్లారిపోతాడా?! ఈ రెండు సిమిలీలూ చాల్ను. మా రాజయోగి పెద నాయనగారి సౌశీల్యాన్నీ, ఔదార్యాన్నీ నిరూపించడానికి:

స్టేషన్నించి రెండుమైళ్ళు దాటేం. ఆరుగంటలు దాటిం దనుకుంటాను. సూర్యుడు షోగ్గా ఉదయిస్తున్నాడు.

మా గుర్రబ్బగ్గీ వెళ్తూ వెళ్తూ చటుక్కున ఎడమవైపు మళ్ళింది. తిన్నగా వెళ్తూన్న రోడ్డు అక్కడ పూర్తిగా ఎడమకి మళ్ళిందన్నమాట.

"అల్లదుగో బంగళా!" అన్నాడు ప్రభుదాసు.

బగ్గీలోంచి నా కుడిచేతివైపుకి ఎదురుగా చూసి ఆ అందం, ఆ శోభా, ఆ బ్యూటీ అంతాచూసి నివ్వెరపోయేన్నేను.

మా బగ్గీ సడెన్‌గా ఎడమకి తిరిగిన మళుపునించి ఆ రోడ్డు అవతలకొన మళుపు రెండుమైళ్ళ దూర్నంలో నాకు స్పష్టంగా కనిపిస్తోంది. ఈ మధ్య దూరంలో రోడ్డు అర్ధచంద్రాకారంగా చెరువుగట్టులో రెయిలుకట్టలా కొంచెం ఎత్తుగా షోగ్గారిబ్బన్‌లా పరిగెడుతోంది. బంగాళాఖాతంలోకి నీలిసముద్రం చొచ్చుకొచ్చినట్టు ఆ అర్ధచంద్రాకారపు దొన్నెలోకి పరుచుకువచ్చిన పచ్చటి వరిచేలు గాలికి పరిగెడుతూవస్తున్న ట్టున్నాయి. సముద్రంలా గంభీరంగా కాకుండా, పచ్చని సరస్సులా ఆ చేలు చల్లగా మనోహరంగా కనిపిస్తున్నాయి. రోడ్డు ఎత్తుగా ఉండడంచేత చెరువులా ఉన్న ఆ చేలకి అది దిట్టమైన గట్టులా కనిపిస్తోంది. ఆ పొడవునా ఆ రోడ్డుకి అవ

తలివైపు దట్టంగా పచ్చటి తోట లున్నాయి. పెద్ద ఉయ్యాల తొట్టెలో పిల్లలందర్నీ పడుకోబెట్టి చుట్టూ నిలబడి పరీక్షగా చూస్తూన్న తల్లుల్లా ఆ తోటలు ముద్దుగా ఉన్నాయి. ఆ తోటలమధ్యలో, నే నున్నచోటుకి సుమారు ఒకమైలు దూరంలో ఆ అర్ధచంద్రాకారపు రోడ్డుకి సరిగ్గా మధ్యలో ఆ తోటల్లోంచి గోపురం లేచినట్టు ఒక నారింజరంగు మేడ నిల్చుంది. వనరాజు కిరీటంలా ఆ మేడ ఆ ఉదయపు ఎండలో నిగనిగ మెరుస్తోంది. ఆ తోటల్లోనూ, వాటి కెదురుగా చేలమధ్యనూ అక్కడక్కడా తాటిచెట్లు కనిపిస్తున్నాయి. ఆకుపచ్చ టోపీలు పెట్టుకున్న నల్ల సిపాయిల్లా నిశ్చలంగానూ నిటారుగానూ నిల్చున్నా యవి. రాజుల భాగ్యానికి కాపలాగా నిలబడి అల్లర్లు చల్లార్చే స్పెషల్ పోలీసుల్ని చూసినట్టు వాటిని నేను చాలా సరదా పడుతూ చూసేను. అంతలో మరొక వింత చూసి నేను ఆశ్చర్యపడ్డాను.

ఆ తోటల వెనకనించి ఉదయించే సూర్యుడి కిరణాలు బంగారు పాముల్లా మా రాజయోగి పెదనాయనగారి మేడ చివర చుట్టుకొంటున్నాయి. మంచుకి తడిసిన తాటికమ్మలుకూడా ఆ లేత ఎండకి ఇనపటోపీల్లా మెరుస్తున్నాయి. అంతా ఎంతో బావుంది చూడ్డానికి. అంతలో అటు చూద్దును!

దొన్నెలో చేలమీద కొంత కొంతగా ఎండ పడుతోంది కాని, కొంతభాగం నల్లనల్లగా మిగిలిపోయింది. ఆ నల్లని భాగం అంతాకూడా నా కంటికి గమ్మత్తుగా అదొక వింత భూతంలా కనిపించింది. అది ఒక పెద్ద నీడ. వాటిలో ఆ తాటిచెట్ల నీడలు పెనుదూలాల్లా ఉన్నాయి. వాటిలో అన్నింటికంటె ఎక్కువ భయంకరంగా అతిపెద్దవాడైన ఎవరో ఇనపదేముడి పాదంలా ఆ చేలమీద ఆ దొన్నెమధ్య మా రాజయోగి పెదనాయనగారి మేడనీడ నయనానంద కరంగా పడుతోంది. అది చూస్తూంటే నాకు మహదానందం కలిగింది. మా రాజయోగి పెదనాయనగారు నన్ను "పెంచుకుంటారు కదా, అదంతా నాదే అవుతుంది కదా!" అనే ఆలోచనకూడా నా ఉత్సాహాన్నీ ఆనందాన్నీ ఇనుమడింప జేసింది.

"ఇజియపురి రాజుగోరి లోగిలి కూనాయిస్తే, మన బాబుగోరి లోగిల్ని మించిన లోగిలి ఈ దిక్కుంట ఎందలాలేదు." అన్నాడు ప్రభుదాసు. అతడు నా ఆనందాన్ని గమనించి సంతోషించేడని నేను గ్రహించేను.

అదే సమయంలో నేను సత్యమూర్తిగాడి ముఖం కూడా చూసేను. వాడు కూడా ఆ చేలవైపూ ఆ మేడవైపూ ఆ నీడలవైపూ చూస్తున్నాడు. అప్పుడు వాడిముఖం చూస్తే నాకు భయంవేసింది.

నా చిన్నతనంలో ఆ రోజుల్లో రూపాయినోట్లు ఉండేవికావు. బుగతలకి శిస్తులు చెల్లించవలసిన రైతులు, సొమ్ము చెల్లించినప్పుడు పదేసి వెండిరూపాయలు





దొంతులుగా పేర్చి లెక్కపెట్టి ఇస్తూండే వారు. బుగతలు ఆ వెండిదొంతులు తీసి లెక్కపెట్టుకుంటోన్నప్పుడు రైతులు నిశ్శబ్దంగా కూర్చొని నిశ్చలంగా ఆదో విధంగా చూస్తూండేవారు. కరడుగట్టిన వాళ్ళ కోపపు ఎరుపురంగు ఆ చూపులో కనిపించేదని నేననుకుంటాను. బుగతల భూముల్ని దున్నుకొని, సాగుచేసుకొని, పండిచుకొని బతుకుతోన్నందుకు, న్యాయంగా ఎంతో సంతోషంగా శిస్తులు చెల్లించవలసింది వాళ్ళు! అలా కాకుండా ఆ రైతుపక్షులు ఆ వెండిబిళ్ళలన్నీ తమ పిల్లలయినట్టూ, తాము కనిపెంచిన ఆ చిన్నపిల్లల్ని బకాసురుళ్ళా ఆ బుగత లాక్కుపోతున్నట్టూ మొహాలు పెట్టుకొని చేతకాని కోపంతోనూ కక్కలేని దుఃఖం తోనూ కూర్చొనేవారు. వాళ్ళ చూపులలో ఆవగింజపాటి కృతజ్ఞతైనా లేకపోడమే కాకుండా కొన్నిటన్నుల ద్వేషం ఉండేది.

మా రాజయోగి పెదనాయనగారి బంగళా కిరీటాన్నీ, దాని ఆడాకింద ఉంచే ప్రకృతి సౌభాగ్యాన్నీ చూసినప్పుడు సత్యమూర్తిగాడి ముఖం రైతుల విషపు మొహంలా మారడం నేను గమనించేను. వాణ్ని ఆసమయంలో చూసేసరికి నాకు భయమేకాకుండా అసహ్యం కూడా వేసింది. బంగళా చేరుకొనీ చేరుకోగానే నాకు వాణ్ని మా రాజయోగి పెదనాయన గారి ముందు అవమానించాలనిపించింది; కనీసం, మా రాజయోగిపెదనాయనగారు వాణ్ని నాముందు ఏదోవిధంగా అవమానిస్తే బావుండు ననిపించింది.

గుర్రబ్బగ్గీ నెమ్మదిగా నడుస్తోంది. నేను మా రాజయోగి పెదనాయనగారి ఆశ్రమపు బంగారపు కిరీటాన్ని చూస్తూ కూర్చున్నాను. దాన్ని చూస్తున్నకొద్దీ చూడాలనే అనిపించింది నాకు.

(సశేషం)

# వాళ్ళ మధ్య వంతెన



శీలా వీర్రాజు



ఏ సంవత్సరమైనా వెన్నెల్ని, మల్లెపూలనూ వ్యర్థపోనివ్వగూడదనుకున్నాడు అనంతమూర్తి. ఇరవై ఎనిమిదో పుట్టినరోజు జరుపుకున్న రాత్రి ఒంటరిగా గదిలో కిటికీముందు కూర్చుని, జీవితాన్ని తన చుట్టూ పరచుకుని గట్టిగా ఆ మాటే అనుకున్నాడు. కాని–

ఆ ఏడాదికూడా వర్షకాలం ప్రవేశించింది. వేసవిలో విరగపూసిన మల్లెపూలు క్రమంగా ఆఖరైపోయాయి. ఆ పూల చుట్టూ తిరిగి గుసగుసలు చెప్పి, పులకరింతలు పెట్టి, మైకంలోకి పడదోసి దొంగచాటుగా వాటి సువాసనల సంపదను దోచుకున్న గాలులు అతని తలమీంచి, అందరాని దూరంలోంచి కదిలి వెళ్ళిపోయాయి. వర్షంలా కురిసిన వెన్నెల అతని జీవిత క్షేత్రంమీద పడలేదు. ఎక్కడో ఏ అదృష్టపు కొండల

మీదనో కురిసి, ఆ కురిసిన వర్షపు నీరంతా కలిసి పరవళ్ళుతొక్కే ఏర్లై, అతని జీవితానికి అల్లంత దూరంగా ప్రవహించి కదిలి ఎవరి అనుభవాల సముద్రంలోనో లీనమైపోయింది.

నాలుగేళ్ళుగా యిలానే జరుగుతోంది. తన కోరిక ఎప్పటికి తీరేనో అన్న భయంకూడా యిప్పుడిప్పుడు కలుగుతోంది అతనికి. అది అతని దోషమే అని బంధువులూ, మిత్రులూ అంటున్నారు. ఇలా అయితే యిక పెళ్ళైనట్టే అని ఎగతాళికూడా చేస్తున్నారు.

ఏం చేస్తాడు మరి. చిన్నప్పటినించీ అతని అభిరుచులు అలానే రూపుదిద్దుకున్నాయి. సముద్రపు అంచులా వున్న ఉప్పాడలో అతను పుట్టాడు. ఊహ తెలిసినప్పటినించీ అతను సముద్రాన్ని చూస్తూనే వున్నాడు. సముద్రపు అలల మీద విరిగిన సూర్యచంద్రుల్నీ, కెరటాల మీద ఊగిసలాడి కదిలి నర్తించే పడవలనూ ప్రతిరోజూ అతను చూస్తూనే వచ్చాడు. ఉదయం నిద్రలేచి, ఆవలించి వరండాలోకి వచ్చేసరికి దూరంగా తామరమొగ్గలా సముద్రాన్ని చీల్చుకొచ్చిన బాలసూర్యుడు కెరటాల పొత్తిళ్ళలో ఊయలలూగుతూ కనిపించేవాడు. సాయంకాలం యిసుకలో ఆడుకోడానికి సముద్రపు వొడ్డుకు వెళ్తే ఏ ఆకతాయో తుంచిపారేసిన తామరపూవులా కెరటాలమీద తేలుతూ ఎగిరిపడుతూ ఆ సూర్యుడే కనిపించేవాడు. అప్పుడప్పుడు మనసుపుట్టిన రాత్రిళ్లు చంద్రుడుకూడా ఉల్లిపొరకాగితం కన్నా సన్నని వెన్నెల తెరలోంచి దిగొచ్చి, అక్కడ కెరటాల మీద నృత్యం చేసి; తెల్లారిపోతుండగా, చెదిరి కింద పడిపోయిన వెలుగుముత్యాల్నయినా ఏరుకోకుండా పారిపోయేవాడు. ఎప్పుడు చూసినా వయ్యారంగా వంగి, చివాల్న పైకెగిరి, దబ్బున జారిపడి, కాస్సేపు అటూయిటూ ఊగిసలాడుతూ కనిపించేవి పడవలు.

బాల్యమంతా అక్కడే గడిచింది. రోజూ కనిపించే ఆ దృశ్యాలే అతని మెదడుకు మేతయ్యాయి. తర్వాత కాకినాడ వచ్చేశారు. వాళ్ళ వీధిలో డాక్టరుగారు ఒకాయన నెమలిని పెంచుతుండేవాడు. వాళ్ళ బావమర్ది ఫారెస్టు రేంజరు. గొప్పిలి అడవుల్లో దాన్ని పట్టుకొచ్చి డాక్టరుగారికి యిచ్చాడట. ఆ నెమలి రోజూ యిళ్ళ కప్పులమీద ఆడుకుంటుండేది. అది కదిలినప్పుడల్లా సన్నగా, పొడుగ్గా వున్న దాని మెడ అటూ యిటూ ఊయలలూగేది. చంచలమైన దాని చూపులతోపాటు మెడకూడా మాటిమాటికీ కదిలేది. కుచ్చిళ్ళు విప్పుకుని, రంగులు పరచుకుని పొడుగ్గా, బరువుగా కిందకు జారిన దానితోక విలాసంగా అటూ యిటూ కదిలేది. దాని నడకలో లయవుంది; లాస్యం వుంది; అందం వుంది. అవన్నీ కలిసిన దాని

నడక అతన్ని ఆకర్షించి ఆకట్టుకొనేది. అదొస్తే చదువుకూడా మానేసి దాన్నే చూస్తూ కూర్చునేవాడు. ఆ దృశ్యం కొంతకాలంపాటే వుండినా అది అతని మనసులో ముద్ర వేసుకుని నిలిచిపోయింది.

ఆ తర్వాత ఆనర్సు చదివే రోజుల్లో ఆంధ్రా యూనివర్సిటీ పిఠాపురంహాస్టల్లో వుండేవాడు. సముద్రపువొడ్డున అర ఫర్లాంగుదూరంలో మూడేళ్లు గడిపాడు.

ఇవన్నీ అతనికి తెలియకుండానే అతని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాయి. యౌవ్వనారంభవేళ ఆలోచనల తలుపుల్ని తెరుచుకుని మనోహరమైన లోకంలోకి తొంగిచూసిన తొలిసారి అతనికి అక్కడ సప్తవర్ణాల కాంతులమధ్య కనిపించినది సముద్ర కెరటాలూ కాదు, సూర్యచంద్రులూ కాదు; ఊయలలూగే పడవలూ, ఆడుకునే నెమలీకావు. అక్కడ సూర్యచంద్రుల్ని వజ్రాల హారంలో బిగించి, సముద్ర కెరటాల్ని పాయలు పాయలుగా కుచ్చిళ్ళలో నింపి, ఎగిరిపడే పడవల కదలికల్ని పాదాలలోకి దించి, నెమలి రంగుల్ని వొంటినిండా కప్పుకుని, దాని నడకలోని లయనూ, సోయగాన్నీ, అభినయాన్నీ అందుకుని అతిమనోహరమైన భంగిమలో ఒక నర్తకి కనిపించింది.

ఆ తర్వాత అతనికి చాలా అభిరుచులు ఏర్పడ్డాయి.

కృష్ణుడంటే అతనికి యిష్టం. కారణం — ఏ బొమ్మలో చూసినా కృష్ణుడి చుట్టూ నాట్యం చేస్తూ గోపికలు కనిపిస్తారు కనక.

దేవాలయాలంటే యిష్టం — ప్రతి దేవాలయం మీదా అసంఖ్యాకంగా నర్తకిలు రాళ్ళల్లో దాగివున్నారు కనక.

లేడి అంటే యిష్టం — దానిచూపులు కూడా నర్తకి చూపుల్లా చంచలమై, సోయగమై, ఆకర్షణీయమైనవి గనుక.

అలాగే, నర్తకి వేసుకుంటుంది గనుక పొడుగైన ఒంటిజడ అంటే యిష్టం. బుట్టలోలకు లంటే యిష్టం. గోరింటాకు పెట్టుకోవడమంటే యిష్టం.

అతనికి యిరవై మూడోయేట తొలిసారి ఓ సంబంధం వచ్చింది. అతని బంధువులూ, మిత్రులూ చ[illegible] చాలా చక్కటి సంబంధం అని మురిసిపోయారు. అతనుమాత్రం కచ్చితంగా నేను చేసుకోను అన్నాడు. అందుకు అతను చెప్పిన కారణం — ఆఅమ్మాయికి నాట్యం రాదట. ఆ వార్త అలాఅలా పాకిపోయి బంధువులందర్నీ చుట్టుముట్టింది. 'అతగాడికి ఆటగత్తె కావాలట. అతనిగురించని యిప్పుడు గెంతడం నేర్పుతామా. చేసుకోకపోతే మానె.' అని నొక్కు నొక్కుకున్నారు బంధువులు. అతన్ని చూసి చాటుమాటగా నవ్వుకునేవారు కూడాను.

వచ్చిన సంబంధాలన్నిటినీ తిరగ్గొట్టే




స్తోంటే యిప్పుడు అవికూడ రావడం మానేశాయి. అడపా తడపా ఏ దూరపు సంబంధమో రావడం తప్ప తెలిసినవారెవరూ అతన్ని వెతుక్కుంటూ రావడం లేదు.

ఇప్పుడిప్పుడు అతనికి భయంకూడా పట్టుకుంది.

ఈ ఏడాదికి యిలా యీ వెన్నెల వెలుగులూ, ఈ పూలగాలులూ వ్యర్థమై పోయినా వచ్చే యేడాదైనా వాటిని సార్థకం చేసుకోవాలి - అని ప్రతిసారీ అనుకుంటూనే వస్తున్నాడు. అలా అనుకోవడమే మిగులుతోంది. తొలిరోజుల్లో మల్లెపూలు కొనుక్కునేవాడు. వెన్నెల్లో తిరిగేవాడు. ఇప్పుడు అవన్నీ మానుకున్నాడు. అవి బాధను కలిగిస్తున్నాయి. భయపడుతున్నాయి. అందుకని వాటి జోలికి వెళ్ళడమే మానేశాడు.

పదిరోజుల కిందట ఓ సంబంధం చూడ్డానికి వెళ్ళినప్పుడు, అమ్మాయిని గదిలోకి తీసుకొస్తుండగా అడుగుల్లో అడుగులువేసుకుంటూ, అలా వేసిన ప్రతి అడుగుమీదా బరువునంతా వాల్చి నన్నని నడుమును మరీ పక్కకు వాల్చేస్తూ అలలు అలలుగా చీరకుచ్చిళ్ళను ముందుకు నెట్టుకుని నడిచివస్తోన్న అమ్మాయిని చూసి, ఆ అమ్మాయి బుట్టలోలకుల్నీ, జడగంటలతో మరీ పొడుగుదేరిన జడనూ గుర్తించి, 'ఈ అమ్మాయికి తప్పక దేన్సు వచ్చుంటుంది' అనుకున్నాడు.

అతని చూపుల్ని కనిపెట్టి అతనికూడా వచ్చిన పినతండ్రి అడిగాడు : "అమ్మా

యికి డేన్సు ఏమన్నా నేర్పించా రేమిటి?" అని.

ఆ ప్రశ్నకి అమ్మాయితో సహా అంతా తెల్లబోయారు.

"డేన్సు నేర్పించలేదండి. ఏదో కాస్త సంగీతం మాత్రం వొచ్చు. పాడించమని అంటారా..." అన్నాడు అమ్మాయి తండ్రి.

"అక్కర్లేదులెండి" అనేశాడు అనంతమూర్తి. ఊరెళ్ళి యింట్లోవాళ్ళతో సంప్రదించి వుత్తరం రాస్తామని బయలు దేరారు.

అప్పుడే వచ్చి వారంరోజు లయ్యింది. కార్డుముక్కన్నా రాయలేదు. అవతలి వాళ్లు కంగారుపడుతూ వుత్తరంకూడా రాశారు.

ఏం రాయించాలో అనంతమూర్తికి తోచకండా వుంది.

ఇదికూడా యిలానే అయ్యింది. ఇంతచిన్నకోరికకూడా తీరడంలేదు. ఇంతకాలంగా కోర్కెల మొలకలకు నిరీక్షణల నీళ్ళుపోసి పెంచుకుంటూవస్తే, అవి ఏ కాయలనూ కాయలేని గొడ్రాలు చెట్లు అయిపోయాయి. పూసినపూలు రాలిపోతున్నాయే తప్ప నిలవడంలేదు. ఎన్ని అమృతంకురిసిన రాత్రిళ్లు తనకు కాకుండా పోయాయో! ఎన్ని గులాబీలు పరచుకున్న ప్రేమనిండిన సాయంకాలాలు తనకు మిగలకుండా పోయాయో!! ప్రకృతిలో ప్రతి అణువునా నిక్షిప్తమైన అందం యిప్పుడు తనకు అందడంలేదు. మోడుబారిపోయిన మొక్కలా అయిపోతోంది జీవితం. ఇంత మబ్బుతునక మీద వంగినా, ఇన్ని చినుకులు పైన జారినా, కాస్తంత ఎండపొడ తగిలినా ఏమీ అనిపించని చైతన్యరహితమైన యీ మోడు జీవితంలోంచి తనకిక విముక్తి వుండదా? చిటారుకొమ్మన మిగిలిన ఆకులా చెప్పా చెయ్యకుండా యీ యౌవ్వనం రాలిపోవడానికి యింకెంతకాలం కావాలి!...

దిగులుతో అతని మనసు రెపరెపలాడింది.

ఆ మార్నాడు వాళ్ళచిన్నాన్న అతన్ని అంతకుముందు చూసొచ్చిన సంబంధం గురించి అడిగితే "మీ యిష్టం. మీకు నచ్చితే నాకు నచ్చినట్టే," అన్నాడు.

తొలిసారి పెళ్ళిచూపులకు వెళ్ళినప్పుడు బంగారు బొమ్మలాంటి అమ్మాయిని చూసి చేసుకోనంటే ఎంతగా ఆశ్చర్యపోయారో యిప్పుడూ అంతగానే ఆశ్చర్యపోయారు బంధువులూ, స్నేహితులూను ఆలస్యమైతే మళ్ళీ ఏం బుద్ధిపుడుతుందో అని మాఘమాసంలో మొదటి లగ్నానికే పెళ్ళికూడా జరిపించేశారు.

దిగకేం చేస్తాడు. సాగనప్పుడు కొండ మీది కోతికూడా దిగొస్తుంది .. అనుకుని వ్యంగ్యంగా నవ్వుకుని, తగినశాస్తి జరిగిందన్న తృప్తిచూపొకటి అతను కనిపించినప్పుడు విసిరిన బంధువులు ఓరోజు ముక్కుమీద వేలేసుకున్నారు.

కారణం –

డేన్సు టీచరు ఒకామెను రోజూ యింటికి రప్పించుకుని భార్యకు డేన్సు నేర్పిస్తున్నాడు అనంతమూర్తి.

మొదట్లో అందుకు మలయవతి – అతనిభార్యే – ఒప్పుకోలేదు.

"చూడు మలయవతీ! ఆ బుట్టలోల కుల్ని తీసెయ్యకుండా అలానే వుంచేసుకుంటావు కదూ," అనంతమూర్తి తొలి రోజున అన్నాడు.

అలానే అన్నట్టు అనురాగపు కొస చూపులు విసిరీ, ఆనందపు చిరునవ్వులు వొదిలీ, నునుసిగ్గుతెరల మేలిముసుగును పైకి తీసుకుని మెల్లగా, లోలకులు సన్నగా పలకరించగా అతి మనోహరంగా తలూపింది.

"జడకూడా అలానే వేసుకో. జడ గంటలు అల్లుకున్న జడంటే నాకు చాలా యిష్టం," అన్నాడు

మరీ పొడవైన చూపుతో అతని హృదయపు లోతుల్లోని అమృతాన్ని తోడితీసి, ఆ తెల్లని అమృతపు పాల నురుగుల కాంతుల్ని అతని కళ్ళల్లో నిలిపి, మత్తెక్కిన అతని కనుపాపల్ని ఊయలూగిస్తూ. జడ గంటల చిరు మువ్వలు తాళం వేయగా 'అలానే' అన్నట్టు తలూపింది.

"నృత్యంఅంటే చాలాయిష్టం నాకు; నీకూ యిష్టమేనా?" అన్నాడు ఆమెను హృదయంలో నిలుపుకుంటూ.




జల్లు జల్లుగా కురుస్తోన్న సిగ్గు తుంపర్లలో తడుస్తూ అతని హృదయపు నీడలోకి మరింతగా వొదిగి గుసగుసలు పలుకుతున్నంత మెల్లగా, సంగీతంతో సానబట్టిన కంఠంతో మనోహరంగా 'ఊఁ' అంది.

"నిన్ను చూసినప్పుడు నర్తకివేమో అనుకున్నాను. నీ నడకలోని లయనూ, నీ చూపుల్లోని భావాలకదలికలో వేగాన్నీ, నీ ఆకారపువొంపుల్లోని సొగసునూ చూసి నీకు డేన్సు వచ్చేమోనని అడిగించాను పెళ్ళి చూపులనాడు. నిన్ను నర్తకిగా చూడాలని మరీ ముచ్చటగా వుంది నాకు. పోనీ నేర్పిస్తాను నేర్చుకుంటావా?"

ప్రియుని సందేశాన్ని మోసుకొచ్చిన గాలితెర గుసగుసలకు చిగురాకు

పవిట పులకరించినట్టు ఆమె మనసు జల్లుమంది భర్త పొగడ్తల గిలిగింత లకు తెరలు తెరలుగా చిరునవ్వు కెర టాలు హృదయంలోంచి కొట్టుకొచ్చి విడిచిన తెల్లటి నురగల్ని కనిపించ నీయకుండా పెదాలు బిగబట్టి, భర్త ముఖంలోకి విచిత్రంగా చూసింది మలయవతి

"నేర్చుకుంటే నీకు చాలా త్వరగానే వచ్చేస్తుంది: అట్టే కష్ట కూడా కాదు." అన్నాడు అతను.

భర్త ఆలోచనల్లోనూ హృదయం లోనూ నీడలా, కాంతివెంట కిరణంలా, జ్వాలవెంట వేడిలా, పూవువెంట తావిలా కలిసిపోవడమే తప్ప విడివడడం మర్చి పోవలసిన తొలిరోజుల్లో భర్త కోరికను కాదని చెప్పలేని మూగమనసుతో హృదయంలోంచి జారిపోయి పక్కకి జరిగి కూర్చుని భయపడుతూ, బిడియ పడుతూ జాలిగా, దీనంగా భర్త ముఖం లోకి చూస్తూవుండిపోయింది.

"నిజం. నీ అందమూ, నీ లావ ణ్యమూ, చక్కగా సరిపోతాయి. నీ లాంటిది నర్తకిఅయితే లాస్యాన్ని బాగా ప్రదర్శించగలదు," అన్నాడు తిరిగి.

తొలిరోజునే భర్త కోరికను మన్నించ లేని అసహాయతలో చిక్కుకున్నందుకు కళ్ళల్లో నీరు చేరి, అతని రూపాన్ని మసగ్గా అలికేస్తోంటే, అతని మనసు కూడా తననుండి జారిపోతుందేమో నన్నంత భయంతో కళ్ళ రెప్పల్ని టప టపా కొట్టుకుని కన్నీళ్ళను ఒత్తుకుని "ఎలాగండీ: అసలు ఏమాత్రం నాకు చేతకాదుకదా ఇప్పుడెలా నేర్చుకొనేదీ? ఈ వయసులోనా?'' అంది. కళ్ళల్లో తడినైతే అద్దేసుకో గలిగింది గాని, కంఠంలో దుఃఖాన్ని మాత్రం పక్కకు నెట్టేయలేకపోయింది

''కళ్ళకు కావలసింది సాధనగాని వయసుతో సంబంధమేంటి. నువ్వేం గొప్ప నర్తకివి కానక్కర్లేదు. స్టేజిమీద డేన్సు చేసేంత పరిపూర్ణంగా నేర్చుకో నక్కర్లేదు. నా గురించి ఏకాంతంగా డేన్సు చేస్తేచాలు. చిరకాలంగా నాకున్న కోరిక అది ఇలా చూడు మలయవతీ! నా గురించి ఆమాత్రం కష్టపడలేవూ:" జాలిగా, పేదవాడి ఆకలికోరికలా అతి దీనంగా తనను తాను తగ్గించుకుని, తన వ్యక్తిత్వాన్ని ప్రేయసిముందు ద్వారంలా మండించే ప్రేమభక్తుడి ఆశ కళ్ళలాంటి కళ్ళతో, ఎదుట నుంచున్న భర్తముఖం చూసేసరికి నిలువునా ఆమె నీరైపోయి అప్రయత్నంగానే తలూపేసింది. అలా వూపుతూ చటుక్కున ఆగిపోయి "ఏమండీ: నలుగురూ ఏమనుకుంటారో నండీ!'' అంది.

''ఏమనుకుంటే మనకేం. మనిష్టం మనది. అయినా యింత పెద్దవాళ్ళే మనల్ని గుర్తించి పట్టించుకునేవాళ్ళే వుండరు,'' అన్నాడు. ఆమెను దగ్గరికి




తీసుకుని ఆమె కళ్ళల్లో తనరూపాన్ని చూసుకున్నాడు.

నెలరోజుల తర్వాత డేన్సుటీచరు ఒకామెను ఏర్పాటు చేశాడు. సాయంకాలంపూట ఆమె వచ్చి, ఓ గంటసేపు చెప్పివెళ్తుండేది. అనంతమూర్తి ఆఫీసు నుంచి ఆరింటికి యింటికి వచ్చేవాడు. ఆ పాటికే డేన్సుపాఠాలు అయిపోయేవి. మలయవతి స్నానంకూడా చేసేసి భర్త గురించి ఎదురుచూస్తూ కూర్చునేది.

ఆ ఇంట్లో వుంటున్నది వాళ్ళిద్దరే. కొత్తసంసారం కాస్త దారిన పడేవరకు వుందామని అతని తల్లి వచ్చి, నెలరోజు లుండి వెళ్ళింది. తండ్రి రిటైరయ్యాక కాకినాడలోనే యిల్లొకటి కట్టుకుని స్థిర పడిపోయాడు. చదువుకుంటున్న ఆడ పిల్లలున్నారు. స్వగ్రామంలో పొలాలు ఉన్నాయి. కాకినాడ అనువుగా వుంటుందని అక్కడ స్థిరపడ్డాడు తండ్రి. అనంతమూర్తి వుంటున్నది బెజవాడలో రైల్వేలో వుద్యోగం. బంధువులు చాలా మంది ఆ వూళ్ళో వున్నారు.

వాళ్ళందరూ, అనంతమూర్తి భార్యకు డేన్సు నేర్పిస్తున్నాడని తెలిసి 'అవ్వ' అని నోరు నొక్కుకున్నారు. అతను ఎదురైనప్పుడు పలకరించి, వ్యంగ్యంగా విసుర్లు విసిరేవారు. అతను వాటిని ఏ మాత్రం లక్ష్యపెట్టేవాడు కాదు.

ఊరిలో ఏమూల నృత్యప్రదర్శన జరిగినా భార్యను వెంటబెట్టుకుని వెళ్ళేవాడు. శాస్త్రీయ నృత్యాలుగల ఏ సినిమా వచ్చినా ఒకటికి రెండుసార్లయినా భార్యతోసహా వెళ్ళివస్తుండేవాడు. భారతీయ నృత్యరీతుల్ని గురించి, ముఖ్యంగా

భరతనాట్యం, కూచిపూడి నృత్యాలను గురించి అతనికి బాగా తెలుసు. వాటి మీద వచ్చిన పుస్తకాలూ, పత్రికల్లో వ్యాసాలూ చదువుతూండేవాడు తరచుగా. ఆ విషయా లన్నీ భార్యకు తెలియజే స్తుండేవాడు. ఆమె నిరుత్సాహంతో నీరు గారిపోకుండా ప్రతిపలుకులోనూ ఆమెను ప్రోత్సహిస్తూ మాట్లాడేవాడు.

భర్త శ్రద్ధ చూస్తే ఆమెకే ఆశ్చర్యం వేసేది. నేర్చుకుంటున్న తొలిరోజుల్లో ఆమెకు విసుగ్గా వుండేది కానీ కొద్ది కొద్దిగా వంటబడుతున్న తర్వాత ఆమెకే ఆసక్తి కలిగింది. ఎవరూ లేనప్పుడు గదిలో నిలువుటద్దం ముందు కూర్చుని తన చూపుల్తో తనే ఆడుకునేది.

క్రమక్రమంగా ఆమె పాదాలలోకి ప్రవాహంలోని ఒరవడీ, గలగలలూ జారి వెనకటి ఆమె కదలికల్లోని హోయలుతో కలిసి హంసనడకలోని విలాసాన్నీ, పావురం కదలికల్లోని ఠీవినీ, నెమలి అడుగుల్లోని నాజూకునూ నింపుకుంటున్నాయి. ఆమె చూపులు పదును దేరి కళ్ళకొసల్ని మృదువుగా కోసి విస్తరించి ఏ మారుమూల వెలుగు రేఖనైనా, ఏ దూరతీరాల్లోని మిణుగురు రేణువునైనా వెంటనే అందుకోగలిగే చురుకు దనాన్నీ, గ్రహణ శక్తినీ అలవరచుకుంటున్నాయి. ఆమె శరీరం ఒక్కొక్క చోట కుంచించుకుని, మరొక చోట వికసించి, వొంపులు ప్రస్ఫుటమై, వెలుగు నీడల్ని స్పష్టంగా విడదీయ గలిగే కోణాల్ని నింపుకుని కంచుప్రతిమ ల్లోని గట్టిదనాన్నీ, నునుపునూ ప్రకటి స్తున్నాయి. రూపం లేని పొగమంచులా జారి, మాయలోంచి వాస్తవంలోకి దిగి ఆకారాల్ని ఏర్పరచుకున్న మంచుబిందు వుల ముత్యాల్లా అతని జీవితంమీదకు వాలిన కలలు యదార్థమై అనుభవాల ముత్యాలసరాల్తో అతన్ని అలంకరిస్తు న్నాయి.

అప్పుడూ అప్పుడూ వెన్నెలవర్షాలు కురుస్తూనే వున్నాయి. అనేక రాత్రిళ్లు వాళ్ళు డాబామీద ఆ వెన్నెల్లో తడిసి చలికి రక్షణగా వెచ్చని అనుభవాల దుప్పట్లు కప్పుకుని నిద్రపోయేవారు.

చాలాకాలంక్రితం, కాపరానికి వచ్చిన కొత్తల్లో, వాళ్ళ పెరడులో మలయవతి నాటిన మల్లెతుప్ప ఓ సాయంకాలం మసకచీకట్లో మూడు నక్షత్రాల్లాంటి పూలు పూసింది. వాటిని అతను కొయ్యా లేదు గానీ ఆ మర్నాటినించీ ఆఫీసు విడిచాక యింటి కొచ్చేటప్పుడు రోజూ పావలా మల్లెపూలు కొనుక్కుని పట్టు కొచ్చేవాడు. డాబామీద పక్కలపై చల్లుకునేవారు. రాత్రల్లా ఆ పూల పరి మళం వాళ్ళచుట్టూ దోమతెరలా అల్లు కునేది. చంద్రుడు వున్న వెలుగురాత్రిళ్లు ఆ పూలు వెన్నెలవర్షంలో పడిన వడగ

పంచాంగం చూస్తే మట్టుకు
వచ్చిన రని పోతుంటారా?




ళ్ళయ్యేవి. చంద్రుడులేని చీకటిరాత్రిళ్ళ నక్షత్రా లయ్యేవి. రాత్రల్లా ఆ పూల చక్కటి, మృదువైన గిలిగింతలస్పర్శ, చుట్టూ పరిమళం తెర, ఉదయం లేచే సరికి నిద్రలేని కళ్ళలా పక్కలమీద ఎర్రబడి కనిపించే పూలు, చూసేకొలదీ సిగ్గుతో కందిన చెక్కిలి ఎరుపుతో నవ్వు తున్న ట్టనిపించే ఆ పూల కొంటెతనం– ఆ పగలల్లా అతని ఆలోచనల్లో అవే.

జీవితం గుబురునిండా కోరికల మొగ్గలు. అవి యౌవ్వనపు నిండుతో విరిసి, గాలిలో పరిమళాల తెరలు పరిచి, రంగురంగుల ముగ్గులు పెట్టి మర్నాడు తృప్తిగా రాలిపోయేవి. అవి రాలక ముందే ఆ పక్కనే మరికొన్ని.

రోజూ ఉదయిస్తున్నాడు సూర్యుడు. వడగళ్ళతో హోరున వర్షిస్తోంది వెన్నెల. ఒకొక్కప్పుడు జల్లు జల్లుగ కురుస్తోంది. తుంపర్లు జారి పుప్పొడిలా సన్న సన్నగా రాలుతోంది. ఇంకొ కప్పుడు పొగమంచులా అతని జీవితం చుట్టూ మత్తుగా అల్లుకుంటోంది.

మెల్ల మెల్లగా మల్లెపూలు వెనక వడ్డాయి. కుంభవృష్టిగా వర్షం కురిసి వెలిసిపోయినా ఆకుల్ని అంటిపెట్టుకుని వొదల్లేక వొదల్లేక జారే నీటిచుక్కల్లా వెనకబడిపోతున్న మల్లెల పరిమళాల కొసర్లు ముక్కుపుటాల్ని పట్టుకొని వెలాడుతున్నాయి.

జీవితం రసమయంగా, శోభాయ మానంగా, రాగ భరితంగా అనిపిస్తోంది. కాలానికి పగ్గాలు వేసి, తాపీగా కలల్ని నెమరేసుకుంటున్నారు.

నెలరోజులుగా రోజుకి పదిసార్లన్నా

జ్ఞాపకం చేసుకుంటూ వచ్చిన పెళ్ళిరోజు చివరకు ఓరాత్రి చిక్కటి చీకట్లను చీల్చుకొని బైటపడింది. ఒక్కొక్క వెలుగురేఖనే విప్పుకుని నిండుగా వికసించాడు సూర్యుడు. అతను జార్చిన కాంతిపుప్పొడి లోకమంతా దట్టంగా పరచుకుంది.

ఆరోజు అనంతమూర్తి ఆఫీసుకి సెలవుపెట్టాడు. ఆ పగలల్లా ఆమెను తన కళ్ళల్లోనే ప్రతిష్ఠించుకున్నాడు. సాయంకాలం మిత్రులకు ఘనంగా పార్టీ యిచ్చాడు. ఆ హడావిడి అంతా పూర్తయే సరికి ఏడయ్యింది. తీరుబాటుగా కూర్చుని పెళ్ళినాటిముచ్చట్లునెమరేసుకుంటున్నారు.

అనంతమూర్తి చటుక్కున లేచివెళ్ళి పెట్టెలోంచి ఓ పెద్దపార్శిలు పట్టుకొచ్చి ఆమెచేతిలో పెట్టాడు.

కళ్ళరెప్పల్ని ఎగరేసి 'ఏమిటి ?' అన్నట్టు చూసింది.

"విప్పు నీకే తెలుస్తుంది."

ఆమె విప్పింది. కళ్ళు జిగేల్ మన్నాయి. మెరుస్తోన్న రంగురాళ్ళతో ఆభరణాలూ, ఆ అడుగున ముదర రంగులో మధ్య మధ్య జరీ అల్లకం డిజైనులతో ఏవో బట్టలూ — ఆమె ఆశ్చర్యపోయింది. పెళ్ళిరోజు కానుకగా పొద్దున్నే సిందూరంరంగు గద్వాల్ చీరా, వాచీకని బంగారం చెయినూ భర్త యిచ్చాడు. ఇప్పుడివన్నీ ఏమిటో ఆమెకు అర్థంకాలేదు. బట్టలు పైకి తీసి మడతలు విప్పింది. అర్థమయ్యింది. డేన్సుడ్రెస్సు అది !

"అద్దెకు తెచ్చాను. ఇవ్వాళ నువ్వు యివన్నీ కట్టుకుని డేన్సు చెయ్యాలి. ఫొటోలు తీద్దామని రమణిని అడిగి ఫ్లాష్ కెమెరా పట్టుకొచ్చాను." అన్నాడు అనంతమూర్తి.

"అప్పుడే ఏంవస్తుందండీ. కరణాల్ని కూర్చడం యిప్పుడప్పుడే ఎలా చేతనవుతుందీ. ఏడాదికూడా కాలేదుకదా. ముద్రల్నయితే పట్టగలను కానీ వాటిని వరసగా కూర్చడం అంతగా రాదే."

"ఎలా వొస్తే అలా చెయ్యి. చాలు. అసలు ఆ డ్రెస్సులో ఎలాకదిలినా అందంగానే వుంటుంది."

అక్కడికీ ఆమె సందేహిస్తూనుంచుండిపోయింది గాని అతను అతి జాలిగా, దీనంగా మరీ మరీ అడిగే సరికి 'అలాగేలెండి' అని చెప్పి లోపలకు వెళ్ళింది. పావుగంట తర్వాత తలుపులు తీసుకుని వచ్చి "ఎలావుంది ఈ డ్రెస్సు. నాకు నప్పిందా ?" అని అడిగింది.

అతను . మాట్లాడడంకూడా మర్చిపోయి కళ్ళార్పకుండా ఆమెనే చూస్తూ వుండిపోయాడు ఇంతకుముందెప్పుడూ కనీసం కల్పనలోకూడా, చూడనంత అందంగా కనిపిస్తోంది ఆమె. యౌవ్వనాన్ని ఎక్కడికక్కడ బంధించేసిన బట్టల్లో మామూలుకన్నా పుష్టిగా, ఆరోగ్యంగా, అందంగా వుంది. ఆ గదిలో

ఆమె చుట్టూ రేడియో, ఎలక్ట్రిక్ లైటు వంటి ఆధునిక పరికరాలు కన్పిస్తున్నాయి గాని లేకపోతే ఆమె కొన్ని తరాల క్రితంలో వున్నట్టు, ఈ ప్రజాస్వామ్యానికి ముందు ఏ రాచరిక పువ్యవస్థలోనో జీవిస్తున్నట్టు, కలకంటున్నట్టు అనిపించివుండేది అతనికి.

"ఎక్సెలెంట్, బ్రహ్మాండంగా వుంది," అన్నాడు. ఆమెను దగ్గరకి తీసుకుని గట్టిగా కావలించుకున్నాడు. ఆమె భుజానికి తగిలించుకున్న దండ కడియంలో రాతిపొడి రాలినచోట యిత్తడిరేకు గుచ్చుకోగా ఆమెను ఒదిలేసి చిన్నగా నవ్వుతూ "తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నాను కదూ, ఇంత కాలానికి నా కోరిక తీరింది. నన్ను నేనే మర్చిపోయాను ... ఏదీ చక్కటి పోజు యివ్వు, ఫొటో తీస్తాను," అన్నాడు.

ఆమె మెల్లగా కదిలివెళ్ళి అతని ఎదుట మూడు గజాల దూరంలో నిలుచుని శరీరాన్ని ఓ పక్కగా తిప్పి, ఎడమకాలును కొద్దిగా వంచి, శరీరం బరువునంతా దానిమీదుగా పాదంమీద నిలిపి, కుడికాలునుకూడా అదే రీతిలో అట్టే బరువును ఆన్చకుండా, తేలిగ్గా చేర్చి, రెండు చేతుల్నీ నేలకు సమాంతరంగా చాచి, అలా చాచిన కుడిచేతిని రొమ్ముల ఎదుటికి మడిచి, రెండు చేతుల్లోనూ త్రిపతాక ముద్రలు పట్టింది.



అతను ఏంగిల్ సరిచూచుకుని ఫొటో తీశాడు.

శిల్పంలా నిల్చున్న ఆమె ఆ భంగిమలోంచి కరిగి లయానుగుణంగా, కాల ప్రమాణంతో ఆయా స్థితులకు గల హస్తముద్రలు పడుతూ పాదవిన్యాసాన్ని చూపుతూ నమస్కరించింది.

ఆ తర్వాత సన్నగా పాడుతూ, పాటకు తగిన అభినయం చేస్తూ, ఒక స్థితినుండి మరొక స్థితికి చటుక్కున కదులుతూ, దానికి అనుగుణంగా కరణాలను కలుపుకుని, అంగహారాలను అల్లుకుని, ఒక్కొక్క అంశాన్నీ అతని ముందు వుంచింది.

అతను మరికొన్ని ఫొటోలు తీశాడు.

ఆమె వచ్చి అతని పక్కనే కూర్చుని

"సరిగ్గా రాలేదు కదండీ. తాళం ఎవరైనా వేసిపాడుతూవుంటే బావుండేది." అంది. కళ్లు ఎగరేసి పక్కవాటుగా చూపుల్ని జార్చి "ఎలా వుందండీ? చెప్పరూ!" అంది తిరిగి కుతూహలంగా.

"ఇంకా కొత్తకదా. మరో రెండేళ్ళు యిలాగే నేర్చుకుంటే బాగానే రావొచ్చు. అభినయం చక్కగానే కుదిరింది గానీ తీర్మానాల్లో తాళకట్టు దెబ్బతింటోంది మరి. ఆటలో యింకా నాజూకు వొచ్చి చేరాలి. మరికొంతకాలం పోతే అదే వొస్తుందనుకో. అసలు ఏడాదిలో యీ మాత్రం నేర్చుకోవడమే గొప్పకదా. ఎలాగైతేం నాకోరిక తీర్చావు,''అన్నాడు ఆమెను హృదయానికి హత్తుకుంటూ. అలసిపోయిందేమో రొమ్ములు ఎగిరి పడుతున్నాయి. ఆమె విడుస్తోన్న నిశ్వాసాలు మెడమీద గిలిగింతలు పెడుతున్నాయి. "నా పంతం నెరవేరడానికి నిన్ను యిబ్బంది పెడుతున్నానుకదూ," అన్నాడు తిరిగి ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

కదిలి, విరిసి, విప్పారి, వాల్పడిన కనురెప్పల కిందనుంచి చూస్తూ 'ఉహూ(' అంది. ఆమె అతని కళ్ళలో వాలుతోన్న మత్తుపొరల్ని గుర్తించి, నవ్వుకుని, మెల్లగా ఒడిలోంచి జారి లోపలకు వెళ్ళిపోయింది.

ఆ రాత్రి వాళ్ళ డాబామీద వెన్నెల లేని చీకట్లో యీ ఏడాదిగా జరిగిన విశేషాలన్నీ ఒక్కొక్కటే మననం చేసుకుంటూ బాగా పొద్దుపోయేవరకూ కూర్చుండిపోయారు.

మూడురోజుల తర్వాత ఫొటో(ప్రింటులు పట్టుకొచ్చాడు అనంతమూర్తి. మరీ బాగా నచ్చిన ఫొటోకు (ఫ్రేము కూడా వేయించాడు. ఫొటోలో తనని తాను చూసుకుని మురిసిపోయిందామె. 'ఇంకా బాగా కృషిచేసి నేర్చుకోవాలి' అనుకుంది. ఇప్పుడు ఆమెకు అడుగడుగునా నాట్యమే కనిపిస్తోంది. వంట చేసేప్పుడు స్టౌలోంచి ఎగసిన జ్వాలల్లోనూ, తడిపి ఆరేసిన దండెంమీది చీర కదలికల్లోనూ, దేవుడిముందు వెలిగించిన అగరువత్తి పొగ మెలికల్లోనూ, చెయిజారి ఒలికిన నీళ్ళు పల్లానికి జారిన చాలులోనూ—ప్రతిచోటా నాట్యరూపాలే కనిపిస్తున్నాయి. ప్రతి వస్తువు కదలికలోనూ కొత్తదనం కనిపిస్తోంది. చూపుకి కొత్తకోణాలు ఏర్పడ్డాయి. ఇంతకు పూర్వం జీవితం ఒకనాటకం అనుకునేది. ఇప్పుడు అదొక 'బాలే'గా అనిపిస్తోంది.

ఆమె ఉత్సాహానికి అదిలోనే హంసపాదు తగిలింది. తండ్రికి రక్తపోటు వస్తే సాధ్యమైనంత త్వరగా తిరిగి వచ్చేద్దామని వెళ్ళింది. అనంతమూర్తికి వీలుగాక ఒక్కర్తినే పంపించాడు. వారంరోజుల్లో తండ్రికి తగ్గింది కాని, ఎలాగూ సంక్రాంతి రానే వస్తోందికదా అల్లుడు వస్తే ఎకంగా యిద్దరూ కలిసే వెళ్ళిపోవచ్చు అని ఆపేశారు ఆమెను.

పండక్కి అతను వెళ్ళాడు. కొత్త ల్లుడికి పెట్టిపోతలవీ బాగానే జరిపారు. ఉన్న అయిదురోజులూ బాగానే గడిచి పోయింది. ఇల్లు కదలి బయటికే వెళ్ళ లేదు. ఒకరోజు సాయంకాలం మాత్రం యిద్దరూ కలిసి సినిమాకు వెళ్ళారు.

బయలుదేరి వచ్చేస్తూ బంధువులకు చెప్పడానికి వెళ్ళినప్పుడు యించుమించు అంతా ఒకేవిధంగా దీవించారు-ఆర్నెల్లు తిరక్కుండానే పుట్టింటికి నిండుగా రావాలి సుమా - అని. అమాటే ఆమె స్నేహితు రాలు చూడ్డానికివచ్చి అంది. అప్పుడు మలయవతి "అఁ, ఏంపిల్లలో పోనిస్తూ, మరో అయిదేళ్ళవరకూ పిల్లలు కలక్క పోతేనే మంచిది," అంది.

ఆ మాటల్ని వాళ్ళ నాయనమ్మ ఆల కించినట్టుంది 'ఓహో! మీ ఆయన నిన్ను కోతిని చేసి ఆడిస్తున్నాడుకదే. అందుకా యీ ఆలోచన వచ్చింది' అని దెప్పి పొడిచింది. ఆ మాటలు అనంతమూర్తికి వినిపించాయి.

బాధపడ్డాడు.

రైల్లో "నిన్ను కోతిని చేసి ఆడిస్తు న్నానా?" అని అడిగాడు అనంతమూర్తి.

బయలుదేరిన దగ్గర్నుంచీ భర్త ముభావంగా ఎందుకున్నారో ఆమెకు అర్థ మయ్యింది. 'ఇందుకా మీ రిలా మూతి ముడుచుకూర్చున్నారు. భలేవారే' అని నవ్వేసింది. ఆయన మూడ్‌ని మార్చుదా మని ఏమిటేమిటో చెప్తోంది. ఆమెకు రైలుప్రయాణమంటే యిష్టంట. చిన్న ప్పుడు ఎక్కడకర్నాకు వెళ్ళినప్పుడు కిటికీ పక్కసీటు గురించి తరచు పోట్లాడుకునే వారట. ఇలా ఏమిటేమిటో చెప్తోంది.

ఆమె చెప్తున్నప్పుడు ఆమె చూపులు జ్ఞాపకాల్లో జారి, పసిపాప చూపులోని కుతూహలంతో కదిలి, యౌవ్వనంలోని తీవితో నిలకడగా కొద్దిసేపు నిలుచుండి పోతున్నాయి. బాల్యంలోని కొంటెతన ముతో గెంతి, అలసటేలేని ఉత్సాహంతో ఎక్కువైనప్పుడు కళ్ళరెప్పలు టప టపా కొట్టుకుని, అంతలోకే చటుక్కున ఆగి, సిగ్గుతో ముడుచుకుపోయి, కొద్ది కొద్దిగా తెరచుకుని చూపుల్ని దాగుడు మూత లాడిస్తున్నాయి. మధ్య మధ్య వాలుగా, కళ్ళకొసల్లోంచి విలాసంగా చూసి, అతని ఆలోచనల్ని తనవైపు తిప్పుకునే ప్రయత్నం చేస్తోంది ఆమె.

ఆమె పన్నిన చూపుల ఉచ్చు లో చిక్కుకుపోయి శ్రద్ధగా ఆలకిస్తోన్న అనంతమూర్తి మధ్యలో ఎందుకో తలెత్తి అటుచూశాడు. అవతలకూర్చున్న వ్యక్తి తమవైపే చూస్తున్నాడు. అనంతమూర్తి యిటు చూశాడు. ఈపక్క కూర్చున్న వ్యక్తీ అలానే చూస్తున్నాడు. ఎదుటికి చూశాడు. ఆ ఎదుటివ్యక్తీ అంతే. మూడువైపులా చూశాడు. అందరికళ్ళూ యిటే వున్నాయి. అనంతమూర్తి చూడ్డం చూసి తప్పుచేసినట్టు చూపులు తిప్పేసు కుంటున్నారు వారు.

ఆమె చెప్పడమైతే మెల్లగానే చెప్తోంది కానీ ఆ కళ్ళను తిప్పడంవల్లే అందరి చూపులూ యిటు వాలుతున్నాయి. అలా కళ్ళతో మాట్లాడ్డం అతనికి కొత్తేమీ కాదు. చాలా సరదాగాకూడా వుండేది.

ఇంట్లో అయితే బావుండును కాని యిక్కడేమిటి? — అతనికి సిగ్గుగా వుంది. ఆమెమాత్రం అదేమీ గుర్తించినట్టులేదు. రాజమండ్రి ఎక్స్‌కర్షన్ అనుభవాలు. అక్కడ చూసిన విశేషాలూ చెప్తోంది.

ఆమె ఆపేటట్టులేదని మధ్యలో అతను అందుకుని ఆ మధ్య అస్సాంలో జరిగిన రెండు రైలుప్రమాదాల్ని గురించీ చెప్పడం ప్రారంభించాడు.

ఆమె కళ్ళను యింతింత చేసుకుని చక్రాల్లా గుండ్రంగా తిప్పి మధ్యలో కనుపాపల్ని ఆశ్చర్యంగా, కళ్ళను ఆర్పి వెలిగిస్తూ చిటుకు చిటుకుగా, భృకుటి ముడిచి కనురెప్పల్ని కొద్దిగా వాల్చి, చూపుల్ని పగ్గాలతో వెనక్కులాగి బిగించి పట్టుకుని, ప్రశ్నార్థకంగా, పైకెత్తి పట్టుకున్నచోటినించి దబ్బున జారి పడి కుప్పగా నిస్త్రాణంగా వాలినచూపుల్తో జాలిగా చూస్తూ, మధ్యమధ్య కళ్ళతో పలకరిస్తూ, అడుగుతూ, అవునంటూ వింటోంది. చూపులతోపాటు తలనూ కదుపుతోంది. పెదాలనుకూడా ముడుస్తూ, కొసమెలికలు తిప్పి, ధనుస్సులా నిలిపి, సంధించినట్టు లాగి, అభినయపూర్వకంగా తలూపుతోంది.

మధ్యమధ్య రహస్యంగా అతను చుట్టూ చూస్తున్నాడు. అందరి చూపులూ — యిటే వున్నాయి. ఏవో మాట్లాడుకుంటున్నట్టున్నారు. వాళ్ళ చూపుల్లో కుతూహలం వుంది; దొంగతనం వుంది; చిరునవ్వుంది.

అనంతమూర్తికి అదోలా వుంది. మలయవతి ఈ కళ్ళ కదుపుల్ని కట్టిపెడితే బాగుండు ననుకుంటున్నాడు. నలుగురూ చూస్తున్నారన్న ఆలోచనైనా లేదేమిటి ?—అతనికి చిరాకుకూడా కలిగింది.

ప్రయాణం పొడవునా అతను అలాంటి యిబ్బందిని ఎదుర్కొంటూనే వున్నాడు. బైటకే చెప్పేద్దా మనుకున్నాడు గాని మళ్ళీ ఆమె బాధపడుతుందేమో నని ఏమీ అనలేదు. భరిస్తూనే కూర్చున్నాడు. బెజవాడలో దిగిపోతున్నప్పుడు తమ చుట్టూ కూర్చున్నజనం తమనే చూస్తున్నట్టనిపించింది అతనికి. స్టేషను దాటి బైటికొచ్చి తేలిగ్గా ఊపిరితీశాడు.

వెళ్ళినరోజు బడలికగా వుండి డేన్సు టీచరును పిలిపించలేదు. మర్నాడు కబురంపిస్తే మళ్ళీ మామూలుగా రావడం ప్రారంభించింది ఆమె. చురుగ్గా పాఠాలు సాగుతున్నాయి.

ఒకరోజు అనంతమూర్తికి తలనొప్పిగా వుంటే ఓ గంట ముందుగా



యింటికి బయలుదేరాడు. రెండు రోజులుగా రొంపచేసింది; తగ్గలేదు. ఒళ్ళంతా బరువుగావుంది. మధ్యాహ్నం నించి తలనొప్పిగా వుంటే యింటికెళ్ళి ఏ అమృతాంజనమో రాసుకుని, టీ తాగి, కాస్సేపు నడుం వాల్చుదామని బయలుదేరాడు. రిక్షా సగందూరం వచ్చాక టైము చూసుకుంటే అప్పుడే దేన్నుపాతాలు కావుకదా అనిపించింది. బైట ఏ హోటల్లోనైనా టీ తాగి వెళ్దామని గవర్నరుపేట సెంటరు దగ్గిర రిక్షాను ఆపించి దిగిపోయాడు. నాలుగడుగులైనా వెయ్యకుండానే ఎదురుగ్గా పరాంకుశంగారు కనిపించారు. పినతండ్రి కొడుక్కి పిల్లనిచ్చిన మావగారు ఆయన. మంచి హోదాలో వుండి రిటైరయిన వ్యక్తి. ఆయనంటే అందరికీ గౌరవమే. సాయంకాలంపూట బారేజివరకూ షికారుకు వెళ్ళడం అలవాటు. "రావోయ్! అలా వెళ్ళొద్దాం", అని పిలిచారాయన. పిలిస్తే తప్పించుకోలేకపోయాడు. అక్కడికీ "మధ్యాహ్నంనించీ తలనొప్పి వస్తోందండీ; ఆఫీసులో కూర్చోలేక ముందే యింటికి బయలుదేరాను," అన్నాడుగాని ఆయన "చల్లగాలి తగిలితే అదే తగ్గిపోతుందిలేవోయ్." అని తేలిగ్గా తీసిపారేశారు.

గంటన్నరసేపు ఆయనతో గడపాల్సి వచ్చింది అనంతమూర్తికి. టీ అయినా పుచ్చుకోలేదు. తలనొప్పి మరీ ఎక్కువగా వుంది. ఒళ్ళు బాగా నొప్పులు పెట్టాయి. నడుం లాగేస్తోంది. ఆఫీసునించి తిన్నగా యింటి కెళ్ళకుండా యిలా రావడం బుద్ధి తక్కువ అనిపించింది. ఇంటికెళ్తే, యీ

బాధలన్నీ లేకపోనుకదా అనుకున్నాడు. వెళ్ళకపోవడానికి కారణం భార్యే అని ఆమెమీదా, దార్లో కనిపించి యివతలి వారి కష్టసుఖాలైనా ఆలోచించకుండా కూడా వెంటబెట్టుకుపోయిన గౌరవం వున్న ఆ పెద్దమనిషిమీదా కోపం వచ్చి లోలోపలే చిరాకుపడ్డాడు, విసుక్కున్నాడు. ఆయన్ని అలా వెళ్ళనిచ్చి రిక్షాలో కూలబడి యిల్లు చేరుకున్నాడు.

"ఆలస్యమయ్యిందేం?" అంది మలయవతి ఎదురొచ్చి.

"ఏమీలేదు," అనిచెప్పి లోపలకు వెళ్ళిపోయాడు.

భర్త ముఖంలోని అలసటను, చికాకును గుర్తించి అతనివెనకనే గదిలోకి వచ్చింది. బట్టలయినా మార్చకుండా మంచంమీద సాగిలబడుతున్న భర్తను చూసి ఆశ్చర్యంగానూ, గాభరాగానూ "ఏమిటండీ, మీ ఒంట్లో బాగాలేదా," అంది. నొసలు తాకి చూసింది. మంచులా చల్లగా తాకిన ఆమెచేతిని తొలిగిస్తూ కళ్లు విప్పకుండానే "మరేంలేదు. తల నొప్పిగా వుంది, టీ వుంటే పట్టుకురా," అన్నాడు.

ఫ్లాస్కులో టీతెచ్చియిచ్చింది. అమృతాంజన్ తెచ్చి కణతలకి రాస్తూకూచుంది. ఆమె ఆదుర్దాను చూస్తే అనవసరంగా ఆమెను కంగారుపెడుతున్నానే అనిపించింది అతనికి. లేచి బట్టలు మార్చుకుని కూచుందామా అనుకున్నాడు.

"ఒంట్లో బాగోకపోతే సెలవుపెట్టి వెంటనే యింటి కొచ్చేయలేకపోయారా? యింతసేపూ బయట ఎందుకు తిరుగుతున్నారూ," అంది ఆమె మందలింపుగా.

అత నేమీ మాట్లాడలేదు. ఒకసారి కళ్లు తెరిచిచూసి మళ్ళీ మూసుకున్నాడు. రాత్రికి భోజనం చెయ్యలేదు. ఆమె బలవంతం చేస్తే పాలుమాత్రం తీసుకున్నాడు.

పొద్దుటికి బాగా జ్వరం వచ్చింది. వొళ్ళంతా నొప్పులు; కదిలే ఓపికలేదు. నడుమంతా విపరీతంగా లాగేస్తోంది. దానికితోడు తలనొప్పి. మలయవతి కంగారుపడి డాక్టరును పిలిపించింది. 'ఫ్లూ తగిలింది, మరేం కంగారు పడనక్కరలే'దని చెప్పి, మందిచ్చివెళ్ళాడు డాక్టరు. ఆరోజు దేన్సుటీచరు వస్తే రెండు రోజులపాటు వొద్దనిచెప్పి పంపించేసింది మలయవతి.

మర్నాటికి తలనొప్పి కాస్త తగ్గింది. వొళ్ళు నొప్పులు యింకా తగ్గలేదు. గబగబా వంట పూర్తి చేసుకుని వొచ్చి కూర్చుంది. "నిన్న భలే భయంవేసింది లెండి. ఒంటరిదాన్ని. ఇంటికి టెలిగ్రాం యిద్దామనుకున్నాను. డాక్టరు వచ్చి ఫ్లూ అనేవరకూ మనసు మనసులో లేదు." అంది.

అనంతమూర్తి ఆమె ముఖంలోకి చూడలేక చూపులు మార్చుకున్నాడు. కొద్దిసేపయ్యాక యిటు తిరిగి చూస్తే—




"నూట మూడు డిగ్రీల జ్వరం అనే సరికి మతిపోయింది. దానికి తోడు జ్వర తీవ్రతలో మీరు మూలుగుతోంటే మరీ భయపడిపోయాను,'' అంది.

అతను గట్టిగా కళ్లు మూసుకుని అవతలివైపుకు వత్తిగిల్లాడు.

''ఏమిటి! మళ్ళీ తలనొప్పి వస్తోందా? వుండండి, అమృతాంజనం రాసుకుందురుగాని," అని గబగబా వెళ్ళబోయింది.

"వొద్దు, అక్కర్లేదు." అన్నాడు గట్టిగా.

ఆ మాటల్లోని తీక్షణతకు ఆమె తెల్లబోయి చూస్తోంటే ఆతను తనని తనే సమాధానపరచుకుని "కాస్త టీ కలిపి పట్టుకురా మలయవతీ! ఏమిటో యివ్వాళ ఆకలి ఎక్కువగా వుంది." అన్నాడు.

అర్ధగంట క్రితం బత్తాయిపండు వలిచేదా అని అడిగితే 'వొద్దు, ఆకలిగా లేదు' అన్న భర్త యిప్పుడు ఆకలేస్తోంది అంటే ఆశ్చర్యం వేసింది ఆమెకు. "ఈ టీలూ అవీ తాగితే ఆకలేం తీరుతుంది, రెండు బత్తాయిలు తినండి," అంటూ గబగబా ఓ బత్తాయి పండు ఒలిచింది. 'కాస్సేపు లేచి కూర్చోండి, ఈ తొనలు తిందురుగాని' అని తనూ మంచంమీద కూర్చుని, అటు తిరిగి పడుకున్నవాడ్ని యిటు తిప్పింది. లేచి కూర్చున్నాడు. అమె ఒక్కొక్క తొనే యిస్తోంటే తిన్నాడు. కడుపునిండుగా వుంది, యిక చాలు అని అంటున్నా, వినిపించుకో

తుండా మరో బత్తాయికూడా వొలి చేసింది. "ఒక పండుతోనే ఆకలేం తీరిపోయిందండీ. యిదిగో యిటు చూడండీ... యిలా చూసి చెప్పండి. నిజంగా ఆకలి తీరిందా...అబద్ధం. మరీ చిన్నపిల్లవాళ్లు అయిపోతున్నారు మీరు. తీసుకోండి ... పోనీ యీ నాలుగు తొనలూ ..."

ఆ చూపులు, ఆ కదలికలు, ఆ కళ్ళల్లో విలాసం, ఆ [illegible] గిలిగింతలు, దాగుడు మూతలు; ఆ ముఖంలో అభినయం అతనికి చాలా చికాగ్గా అనిపించాయి. 'ఉద్రేకాన్ని రెచ్చగొడుతున్నట్టు ఏమిటా తళుకు బెళుకులు? ఎందుకీ సంరంభం? మామూలుగా ఎందుకు ప్రవర్తించదూ'— అనుకున్నాడు.

ఆమె చేతిలోంచి చివాల్న ఆ నాలుగు తొనలూ లాక్కుని కసిగా నమిలి, తొక్కల్తోనే మింగేసి, 'నాకు నిద్రొస్తోంది, [illegible]డుకుంటాను. నువ్వెళ్ళి నీ [illegible]ని చూసుకో'— అని చెప్పి ముసుగు లాక్కున్నాడు.

ఆమెకు ఏమిటో అర్ధంకాక తెల్లబోయి లేచి వెళ్ళిపోయింది.

మర్నాటికి జ్వరం పూర్తిగా తగ్గింది. పత్యం పుచ్చుకున్నాడు కాని ఆఫీసుకు వెళ్ళలేదు. ఆరోజుకూడా యిల్లాంటి సంఘటనలే ఎదురు డినప్పుడు సహనం అవధులు దాటిపోయి, "అలాకళ్ళు తిప్పి మాట్లాడకపోతే మామూలుగా మాట్లాడలేవూ," అన్నాడు. ఆమె ముఖం మాడ్చుకుంది. ఆ ఉక్రోషంతోనే ఆరోజు దేన్నీ పాఠాలుకూడా చెప్పించుకుంది. నిజానికి ఆవేళకూడా సెలవు తీసుకుందామని అనుకుంది గాని పంతం వొచ్చి ఆ రోజు పాఠాలు చెప్పించుకుంది.

అతను ఎవరినీ ఏమీ అనలేక తనను తానే కసురుకున్నాడు. తనమీద తనకే కోపం వచ్చింది. ఒకరోజుపాటు వాళ్ళు ఎడముఖం పెడముఖంగానే మసిలారు. మర్నాడు మళ్ళీ మామూలుగా మెసలక తప్పలేదు. ఇంట్లో మూడోవ్యక్తి వుంటే ఎన్ని పంతాలకు పోయినా సా[illegible]వి. దానికి తోడు తను అలా ప్రవర్తించడం అర్ధం లేనిదిగా అనిపించింది అతనికి. భార్యను అనవసరంగా కసురుకున్నందుకు సిగ్గుపడ్డాడు కూడాను. "ఏవో ఎగతాళికి అంటే అలా బాధపడతావేం?'' అన్నాడు ఆమెను దగ్గరికి తీసుకుని. ఆమె తీగలా అతిన్ని అల్లుకుపోయింది.

శ్రీరామనవమికి ఊళ్ళో పందిళ్ళు వేసి నాటకాలవీ వేస్తున్నారు. వాళ్ళ వీధిలోకూడ పందిరి వేశారు. ఆయన దగ్గర చందాకూడా తీసుకెళ్ళారు. నాలుగోరోజున భరతనాట్యం ప్రోగ్రాం ఏర్పాటు చేశారు. ఆ రోజున అనంతమూర్తి భార్యను వెంటబెట్టుకుని వెళ్ళాడు. భరతనాట్యం చేసే అమ్మాయిలు యిద్దరే. ఆ యిద్దరికీ ఎనిమిదీ, పదేళ్ళకన్నా

మించివుండవు. చిన్నపిల్లలైనా చక్కగా చేశారు.

ఇంటి కెళ్ళాక ఎలా వుంది?" అని అడిగాడు అనంతమూర్తి.

"చాల చక్కగా వుంది. చిన్నప్పుడు ఏ అయిదోఏట నుంచో నేర్చుకోవడం ప్రారంభించివుంటారు." అంది ఆమె. 'మరి మీ కెలా అనిపించింది,?— అన్నట్టు అతనివైపు చూసింది.

"కదిలికలు బాగున్నాయిగాని ముఖంలో సరైన ఎక్స్‌ప్రెషన్ లేదు." అన్నాడు.

"చిన్నపిల్లలకి అదెలా వొస్తుందండీ. వయసు వచ్చేకొలదీ పరిపూర్ణత వొస్తుందిగాని. నవ్వుతూ నవ్వుతూ చటుక్కున వెనక్కు తీసేసుకోవడం, జారిపోతున్నట్టు కోక బిగించి పట్టుకుని పగ్గాలను ఒదులుతున్నట్టు చూపుల్ని ఒదలడం, ముఖభంగిమల్లో కృత్రిమంగానే అయినా వాస్తవికతను కనబరచడం— యివన్నీ వయసుతో వచ్చే విద్యలుగాని పుట్టుకతో వొచ్చేవి కావు."

"ధీరీకూడా బాగానేవచ్చే," అన్నాడు నవ్వుతూ. మంచులోని మొగ్గలా, కన్నెపిల్ల మనసులా సిగ్గుతో ముడుచుకుపోయిన కళ్ళలోంచి జారీ జారని చూపుల్తో చూసి, చిరునవ్వు ఒలికీ ఒలకనట్టు పెదాల్ని కదిపింది.

అతని మనసు చటుక్కున ఆలోచనల్లోకి ఎగిరింది. ఇంతకుముందే ఆమె



అన్న మాటల్ని మననం చేసుకుంటు న్నాడు.

ఆమె ఏమిటో అడిగినట్టుంది. అతను పలక్కపోతే అతన్ని కదిపి "ఏమిటండీ ఆలోచిస్తున్నారు," అంది.

"అబ్బే ఏంలేదు," అన్నాడు అతను.

"భలేవారే, పరధ్యాన్నం కూడా వస్తోందే మీకు. పక్కలు డాబామీద పరిచేదా, యింట్లోనా అంటే, ఏమీ లేదంటా రేమిటీ," అంది నవ్వుతూ.

'అవును ... అవును ... అదే చిరునవ్వు, అదే అదే అనుకున్నాడు అతను ఆ ఎదుటి గోడమీద మలయవతి నాట్య భంగిమ ఫొటోలోకి చూస్తూ.

ఆమెకు ఏమీ అర్థం కాలేదు. "ఏమో బాబూ, నాకు నిద్రొస్తోంది. నేను గది

ళ్లోనే పడుకుంటాను," అని ఆమె వెళ్ళిపోయింది.

ఆ రాత్రి చాలా సేపటివరకూ అతనికి నిద్ర పట్టలేదు.

మర్నాడు ఆఫీసుకు వెళ్తున్నప్పుడు "సాయంకాలం త్వరగా వస్తారుకదూ, మర్చిపోతారా? మీతో పనుంది," అంది. వాలుగా చూసి, 'తప్పక రావాలి సుమా' అన్నట్టు కళ్ళతోనే చెప్పింది.

"అలాగేలే," అని ముఖం చిట్లించుకుని వెళ్ళిపోయాడు. మనసును ఎంతగా సమాధానపరచుకుందామన్నా వీలుకావడంలేదు అతనికి. ఆ మధ్య డేన్సు చేసిననాడూ యిలాగే చూసింది. ఇలాగే కళ్ళతోనే పలకరించింది. ఆ రెప్పల్ని వాల్చడమూ, ఆ చూపుల్ని జార్చడమూ, ఆ పెదాల్ని మెలికలు తిప్పడమూ— అన్నీ అలానే వున్నాయి. కృత్రిమంగానే వాస్తవికతను ప్రదర్శిస్తోందా?— అతని మనసు మబ్బుపట్టినట్టు అయిపోయింది.

సాయంకాలం, కావాలనే వేగంగా యింటికి వెళ్ళలేదు. రాత్రి బాగా పొద్దుపోయేక వెళ్ళాడు. ఆమెకు ఏదో వంక చెప్పాడు.

నేనూ అదే అనుకున్నాను లెండి. ఏ స్నేహితుడో తగిలుంటాడని ఎనిమిది కావస్తోంది. భోజనం వడ్డించెయ్యమంటారా?"

ఆమె ముఖంలోకి పట్టిపట్టి చూశాడు. ఎక్కడా బాధపడుతున్న ఛాయలే లేవు. మరీ మరీ ఆమె చెప్పినప్పుడు ఆమెను నిరుత్సాహ పరచాలనే ఆలస్యం చేశాడు. కాని ఆ ఛాయే కనిపించలేదు. ఆమె బాధపడకుండా వుంటుందని అనుకోలేకపోతున్నాడు. అంతకుముందు ఎప్పుడైనా ఏ ప్రోగ్రామైనా వేసుకున్నరోజున ఆలస్యంగా వస్తే మూతి ముడుచుకునేది. ఆమెను ప్రసన్నం చేసుకోవడానికి అర్ధగంటైనా పడుతుండేది. ఇప్పుడిది — ఇది నటన కాక మరేమిటి?

"ఇవ్వాళ మీకు యిష్టమైన కొత్తిమిరి పచ్చడి చేశాను. బట్టలు మార్చుకుని వస్తే వడ్డించేస్తాను. కాసేపు డాబామీద కూర్చుందాం. ఇవ్వాళ వెన్నెలకూడా వుంది." అర్థవంతంగా, ఆనందాన్ని కళ్ళల్లో దాగుడుమూత లాడిస్తూ, పెదాల వెనక చిరునవ్వును దాచుకుని చూసింది.

అతను కళ్ళార్పకుండా ఆమెనే సూటిగా చూస్తోంటే సిగ్గుతో ముడుచుకుపోయి, ముసి ముసిగా నవ్వుకుంటూ "అబ్బ! ఏమిటండీ అలా చూస్తారు. మీరు అలా చూస్తుంటే మీ ముందుకే రాను బాబూ," అంది.

"ఆమధ్య డేన్సు చేసినప్పుడు కూడా నువ్వు యిలానే రెప్పల్ని కదిపి, కంటిపాపల్ని ఆడించావుకదూ! అచ్చం యిలానే నవ్వావుకదూ!" అని ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

"ఏమో బాబూ, నాకు అవన్నీ

జ్ఞాపకంలేవు. చూసిన వాళ్ళకు మీకే తెలియాలి," అంది. అని కళ్ళ కొసల్లోంచి వాలుగా చూసింది.

"చూశానుగనకే అంటున్నాను. ఆ కళ్ళ కులుకులు, ఆ పెదాల వొంపులు అచ్చం ఆ భరతనాట్యంలో లానే వున్నాయి."

భర్తమ్మాటల్లో ఆ పదునేమిటో ఆమెకు అర్థం కాలేదు.

"సరేగాని మీరు వేగంగా తెమిలి రండి, వడ్డించేస్తున్నాను." అని చెప్పి లోపలకు వెళ్తున్నదల్లా చటుక్కున ఆగి పోయింది. వెనక్కు తిరిగి భర్త ముఖంలోకి విచిత్రంగా చూసింది. ఆమె కళ్ళల్లో వెలుగులు ఆరిపోయాయి. ఆమె పెదాలమీద చిరునవ్వు విరిగిపోయింది. ఆమె ముఖంలో సంతోషం భగ్గున మండి పోయింది. ఆమె చూపులు పిచ్చిగా వున్నాయి. ఆమె పెదాలు వణికి పోతున్నాయి. ఆమె ముఖం పాలి పోయింది,

"ఇప్పు డర్థమయ్యింది. ఇదంతా నటన అని కదూ మీ రనేది. ఈ అభిప్రాయం, ఇలాంటి విచిత్రమైన ఆలోచన మీ కెలా కలిగింది. మిమ్మల్ని మోస గిస్తున్నా నన్న అభిప్రాయం మీ రెలా ఏర్పరచుకున్నారు. ఇంతకన్నా పెద్ద అభాండం మరోటి వుండదు ... ఎందు కిలా శిక్షిస్తారు నన్ను." ఆమె కళ్ళల్లో




కన్నీరు కదిలింది. ఆమె కంఠం బొంగురు పోయింది.

అత నేమీ మాట్లాడలేదు. బట్టలు మార్చుకుని డాబామీదకు వెళ్ళిపోయాడు. ఆమె దుఃఖాన్ని ఆపుకోలేక మంచంమీద వాలి పోయి వెక్కి వెక్కి ఏడ్చేసింది.

గంటతర్వాత అతను డాబా దిగి నిద్రపోదామని గదిలోకి వస్తే టేబిల్‌మీద భోజనం వడ్డించివుంది. ఆమె ముసుగు

పెట్టి నిద్రపోతోంది. అతను భోజనం చెయ్యలేదు.

ఒకరినొకరు పలకరించుకోకుండా నాలుగు రోజులు గడిచిపోయాయి. ముఖం కడుక్కొని వచ్చేసరికి కాఫీ, టిఫిను గదిలో పెట్టివుండేది. తొమ్మిది న్నర అయ్యేసరికి అతను వంటగదిలోకి వెళ్తే భోజనం వడ్డించివుండేది. మరీ యిబ్బందికరమైన పరిస్థితుల్లో ఆమె పొడి పొడిగా దగ్గేది. అతను అటు చూసే వాడు. ఆ టైమునుబట్టి ఆమె స్నానానికి నీళ్ళు తోడిందనో, భోజనం వడ్డించిందనో తెలుసుకునేవాడు.

ఆరోజు మధ్యాహ్నం కేంటీనుకు వెళ్ళినప్పుడు జేబులోంచి డబ్బులు తియ్యబోతే చిన్నచీటీ బైటికి వచ్చింది. 'దేన్ను టీచరును మాన్పించి వారంరోజులైంది. ఆమెకు జీతం యివ్వాలి. చీరా, రవికలగుడ్డా పెట్టాలి. నలభైరూపాయ లవసరమౌతాయి. రేపు వస్తుంది ఆమె,' అని వుంది.

మాన్పించేసిందంటే అతనికి బాధేమీ కలగలేదు. ఆమె మానేస్తేనే బావుండునన్న ఆలోచన కొంతకాలంగా అతని మనసులో మెదులుతోంది. ఇటీవల జీవితమునిండా అసహనం పేరుకుపోయింది. రోజురోజుకీ యిద్దరిమధ్యా ఎడం ఎక్కువై పోతోంది. దీన్ని ఎలా దాటడం? కోరిక తీరిందన్న సంతోషంకూడా లేకుండా పోతోందికదా! అలాంటప్పుడు ఎందుకిది?

సాయంకాలం యింటికొచ్చినప్పుడు, మధ్యాహ్నం ఎస్. బి. లోంచి తీసిన యాభై రూపాయలూ అలమారులో పై రేక్‌లో ఆమెకు కనిపించేటట్టుగా పెడుతుండగా అక్కడ అతనికి కొత్తగా కొన్ని మందుసీసాలూ, ఇంజక్షను బుడ్లూ కనిపించాయి. అతను ఆశ్చర్యంగా అవతలి గదిలోకి చూశాడు. అక్కడ అటు తిరిగి రేడియో వింటూ ఏమిటో అల్లుకుంటోంది మలయపతి. పరిశీలనగా చూశాడు. ఆమె చేతిలో పూర్తి అవుతూ అవుతూవున్న బుల్లి మేజోడు!

అతను మెల్లగా కదలివెళ్ళి, ఎప్పుడో ఆమె చేతిలోంచి జారిపడి దొర్లుకుంటూ చాలాదూరం వచ్చేసిన ఊలువుండను తీసి, దారం చుట్టుకుంటూ, ఆమె దగ్గరకు చేరుకున్నాడు.




(గత సంచిక తరువాయి)

కాళ్ళు తడబడ్డాయి. కళ్ళు పూడుకు వచ్చాయి. కిక్కురుమనకుండా బయటికి పోయాడు. శేషయ్యకొడుకు చదువుసంగతి వూళ్ళో అందరి నోళ్ళలోనూ నానింది. రచ్చబండ ఎక్కింది. పంచాయితీపాకలో దూరింది. ఊరువూరంతా నాలుగు రోజులపాటు తిరిగింది.

శేషయ్యని తోటివాళ్ళంతా చివాట్లేశారు - "కుర్రోడు సుబ్బరంగా చదువుకుంటానంటే వద్దనటానికి నీకేం పొయ్యేకాలం? ఒక్కగానొక్కడు. ఆడికి గాకపోతే ఈ పొలం పుట్రా ఎవరికి? ఆడు చదువుకుని పైకొచ్చాక నీకు గొప్పకాదా? ఎన్ని ఏసాలేసినా ఆణ్ణిమాత్రం బాధపెట్టమాకు. తల్లి



లేనోడు," అంటూ దుయ్యబట్టారు. "ఆణ్ణి చదువుకి పంపించు శేషయ్యా? మానేవు సుమా! మెరికలాంటోడు," అంటూ కొరుక్కుతిన్నారు.

శేషయ్య అడిగినవా ళ్ళందరికీ కాదని చెప్పలేకపోయాడు. ఏమనుకున్నాడో గానీ రెండోనాటి కల్లా ఒక వంద రూపాయలు తెచ్చి వీరన్న చేతి కిచ్చి పంపించాడు.

వీరన్న డబ్బు తెచ్చి అందిస్తే వాణ్ణి అమాంతం కావిలించుకున్నాడు శివా. ఆ సంతోషం తగ్గాక డబ్బు లెక్కపెట్టుకుంటే ఏడుపొచ్చింది.

"కాలేజీ ఫీజు కట్టాలి. పుస్తకాలు కొనుక్కోవాలి. నాకు బట్టలన్నీ చిరిగిపోయాయి. ఉన్నవికూడా బాగా పొట్టి అయిపోయాయి. ఒక్క వంద రూపాయలు ఎలా సరిపోతాయిరా వీరన్నా?" అన్నాడు దిగులుగా చూస్తూ.

"ఇప్పటికి పుచ్చుకో బాబూ! ముందెళ్ళి జీతం కట్టుకో. నేను మీ అయ్యతో సెబుతాగా? పంపిస్తాళ్ళే," అంటూ ధైర్యం చెప్పాడు వీరన్న.

* * *

కాలేజీఫీజులు కట్టి సీటు దక్కించుకున్నాడు శివశంకరం. కాంతమ్మ యిచ్చిన డబ్బుతో కొన్ని కొన్ని పుస్తకాలు కొన్నాడు. హాస్టల్లో ప్రవేసించాడు. ఇంటికి పుత్తరం రాస్తే మళ్ళా ఓ వందరూపాయలు పంపాడు శేషయ్య. శివాకి చాలా ఆశ్చర్యం కల్గింది. నాన్న ప్రతీ నెలా డబ్బు పంపిస్తాడంటే ఎందుకో నమ్మకం కుదరటం లేదు. ఎన్నాళ్ళు సాగుతుందో ఈ చదువు? ఏమైనా సరే! 'నేను చదువుకోవాలి.'

కాలేజీలో చదువూ హాస్టల్ వాతావరణం చాలా కొత్తగా వున్నాయి, శివాకి. శివా పేరు మరుగునపడి శంకరం అయ్యాడు.

కాలేజీలో ఎంత శ్రద్ధగా విన్నా అర్థం గాని లెక్చర్లూ – అదికూడా వినకుండా పిల్లలు చేసే అల్లర్లూ శంకరాన్ని అయోమయంలో పడేశాయి. ఫస్ట్ టెర్మ్ అంతా ఆ అయోమయంతోనే గడిచింది. శంకరం తన రూమ్ మేట్ రామానికి బాగా సన్నిహితం అయ్యాడు.

రాము శంకరాన్ని చాలా అభిమానిస్తాడు.

ఓసారి శంకరం ఎవరితోనో ఏదో మాట్లాడుతోంటే పక్కవాళ్ళు నవ్వుకొంటూ మొహా మొహాలు చూసుకున్నారు.

శంకరం చిన్న పిల్లాడిలా బిక్కమొహం వేశాడు. శంకరం మాటల్లో పెల్లెటూరి పదాలు బాగా దొర్లుతూంటాయి. ఉచ్చారణలో ఏదో యాస కొట్టవచ్చినట్టు విన్పిస్తుంది.



అందుకే శంకరం నోరు విప్పటానికే భయపడుతూ తన మానాన తను కూర్చుని చదువుకొంటూవుంటాడు. రామం తప్పితే శంకరానికి స్నేహితులెవ్వరూ లేరు. కానీ హాస్టలులోవాళ్ళందరికీ కాస్తో కూస్తో శంకరం తెలుసు. కారణం శంకరం ఎప్పుడూ ఏదో క్లాసుబుక్కూ - నోట్సూ - డిక్షనరీ - వెంటవేసుకు తిరుగుతూ - వాటితో కుస్తీలు పడుతూ అర్థాలు రాసుకుంటూ కన్పించటం.

ఓ రోజు సాయంత్రంవేళ హాస్టల్లో కుర్రాళ్ళంతా ఎప్పటిలా బయటికి పోయారు. పోగా మిగిలినవాళ్ళు జట్టు జట్లుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

శంకరం చేతినిండా పుస్తకాలు తీసుకుని వరండా చివరికి పోతోంటే ఎవరో అన్నారు - "ఎవరోయ్ ఈ మంచి బాలుడూ?"

ఫక్కుమన్నారు కుర్రాళ్ళంతా.

శంకరానికి కూడా నవ్వొచ్చింది. ముసిముసిగా నవ్వుకొంటూ తల ఒంచుకుని వెళ్ళిపోయాడు. అక్కడ కూర్చుని పుస్తకం అడ్డం పెట్టుకు చూస్తే గుంపులో బాలకృష్ణ కన్పించాడు. బాలకృష్ణ అక్కడ చేరినవాళ్ళలో చాలా మందికి సీనియరు. వయస్సులోకూడా పెద్దవాడే. ఎప్పుడూ మంచి ఖరీదైన బట్టలతో దర్జాగా కన్పిస్తాడు.

జుట్టుమాత్రం బొత్తిగా అతనిసింగారంతో సహకరించకుండా ముళ్ళలా ఎదురు తిరుగుతూవుంటుంది. అతని బట్టల మీదనుంచీ - ఒంటి మీదనుంచీ

గుప్పుగుప్పుమంటూ సువాసనలు వీస్తూ వుంటాయి.

అందరిమీదా అధికారంచేస్తోన్నట్టు ఠీవిగా మాట్లాడుతూంటాడు. వేరే రూమ్‌లోవుంటోన్నా చాలాతరుచుగా హాస్టల్‌కి వస్తూంటాడు. అతను వచ్చీ రాగానే 'గురూ! గురూ!' అంటూ చాలా మంది స్టూడెంట్స్ అతనిచుట్టూ గుమిగూడుతారు. అంతా కలిసి గట్టిగా మాట్లాడుకొంటూ - అరచుకొంటూ - నవ్వుకొంటూ గంటలకొద్దీ నించుంటారు. బాలకృష్ణ హాస్టల్ లోంచి వెళ్ళిపోతేచాలు కుర్రాళ్ళంతా నిరుత్సాహంగా తలోమూలకీ పోయి కూర్చుంటారు.

శంకరానికి కాలేజీ పరిభాష కొంతవరకూ వంటబట్టింది - "బాల కృష్ణ రింగ్‌మాష్టర్" అనుకున్నాడు మనస్సులో.

"శంకరం! నిన్నివాళ బాలకృష్ణకి పరిచయం చేస్తాను; రావోయ్!" అంటూ వచ్చాడు రామం.

శంకరాని కెందుకో సిగ్గువేసింది. లేచి నించున్నాడు. అంతలోనే బాల కృష్ణ ముఠానంతా వెంటేసుకుని వరండా చివరికి రానేవచ్చాడు. శంకరం కేసి నవ్వుతూ చూస్తూ- "భయ్యా! నువ్వు చాలా మంచి బాలుడిలా కన్పిస్తున్నావోయ్!" అన్నాడు. కుర్రాళ్లు చాలామంది శంకరాన్ని పొగుడుతూ బాలకృష్ణకి చెప్పారు. "శంకరంగారు ఇరవై నాలుగ్గంటలూ చదువుతోనే వుంటారండీ! మీల్స్‌కి వెళ్తోన్నప్పుడు కూడా పుస్తకం వెంటబెట్టుకునే వస్తారు."

బాలకృష్ణ శంకరం మొహంలోకి నిస్సంకోచంగా చూస్తూ- "నువ్వింకా ఫస్టియరే కదుటోయ్! చదవటానికి చాలాకాలం వుంది. మరీ అంత కష్ట పడిపోకు. ఇదేం హైస్కూల్ అనుకున్నావా?" అంటూ నవ్వాడు.

శంకరం ఏం మాట్లాడలేదు. అందరిలాగే తనూ నవ్వుతూ బెదురు అణుచుకొంటూ నించున్నాడు.

బాలకృష్ణ మిగతా వాళ్ళతో ఏవేవో మాట్లాడి కాస్సేపటికి వెళ్ళిపోయాడు.

తర్వాతకూడా బాలకృష్ణంటే శంకరానికేం సదభిప్రాయం కల్గలేదు. బాలకృష్ణ తనొక్కడే చాలా గొప్ప వాడైనట్టు - భూమిమీద రెండంగుళాల ఎత్తుమాత్రం వున్న మరుగుజ్జు మనిషితో మాట్లాడుతోన్నట్టు - తగని హోదా ఒలకబోస్తూ మాట్లాడుతాడు. సాధ్యమైనంతవరకూ అతని కంట పడకుండా వుండటమే శంకరానికి యిష్టం.

బాలకృష్ణ ఒంటరిగా తిరగటం చాలా అరుదు. సూరిబాబు అతని క్లాసుమేటూ, రూమ్‌మేటూకూడా. సూరిబాబు బాలకృష్ణకి కుడిభుజం. సూరి

బాబుని ఎప్పుడు చూసినా రత్తాలు తమ్ముడు అప్పారావే కళ్ళల్లో మెదులుతాడు శంకరానికి. సూరిబాబు జుత్తుగూడా సరిగ్గా అప్పారావు జుట్టు లాగే ఠెగ నొక్కులతో ఎత్తు పల్లాలుగా నున్నాలు చుట్టినట్టు వుంటుంది.

ఎందుకో సూరిబాబు అంటేకూడా శంకరానికి నచ్చలేదు. వాళ్ళిద్దరి గురించీ రామం కూడా కొంచెం అయిష్టం వెల్లడిస్తూ మాట్లాడా డొకసారి శంకరంతో— "మొత్తంగా కాలేజీలో వాళ్ళిద్దరికీ వున్న మంచిపేరుకన్నా చెడ్డపేరే ఎక్కువ," అన్నాడు చిట్టచివర.

శంకరం తెల్లబోయాడు—"అయితే నువ్వుకూడా వాళ్ళతో అంతబాగా మాట్లాడతావుగా?" అంటూ ధర్మసందేహం వెల్లడించాడు.

"బావుందోయ్! మధ్య మన కెందుకు? అందరిలా మనమూ చూసీ చూడనట్టు వుండాలి. ప్రతీవాడితోనూ సాధ్యమైనంతవరకూ స్నేహపాత్రంగానే వుండాలి," అన్నాడు రామం.

నిజమే నన్పించింది శంకరానికి.

* * *

సెకండ్ టెర్మ్ ఎగ్జామ్స్‌లో శంకరానికి మంచిమార్కులు వచ్చాయి.

బాలకృష్ణకూడా అభినందిస్తోంటే శంకరానికి గర్వం కలిగింది. కానీ చాలామంది కళ్ళు తనమీద పడ్డట్టు



తెలుసుకుని యిరుకునపడ్డాడు శంకరం.

పుస్తకాలు తెరుచుకొని ఏ స్టూడెంటయినా చదువుకోవాలని కూర్చుంటే కొంపలు మునుగుతోన్నట్టు ఎవడో వస్తాడు – "ఏమోయ్! అప్పుడే మొదలుపెట్టేశావా? ఎందాకా అయింది?"

"ఛ! లేదోయ్! ఇప్పుడే యిలా పుస్తకం తెరిచి కూర్చున్నాను. నువ్వు రానేవచ్చావ్?"—చదవటం లేదని ఎదుటివాణ్ణి నమ్మించాలని చూస్తాడు.

"ఎంతైనా నువ్వు శ్రద్ధగానే చదివేస్తున్నావ్ లెద్దూ! అన్నీ పూర్తి చేసేసినట్టున్నావ్?"

"అరె! నమ్మవేం? ఒక్క పాఠం ముట్టుకోలా. ఎప్పు డవుతాయో అర్థం

కావటంలా, అంటూ ఠక్కున పుస్తకం మూసిపడేసి ఇద్దరూ కబుర్లకి దిగుతారు. లేకపోతే పేకముక్కలు పరుస్తారు. వార్డెన్ వచ్చేవరకూ ఆపుస్తకాలలా పడివుంటాయి. వార్డెన్ వచ్చే వేళకి మాత్రం పుస్తకాల్లో మొహాలు దూర్చుకుని-అసలు తా మా చదవటానికే సృష్టించబడ్డట్టు మునీశ్వరుల్లా కూర్చుంటారు. వార్డెన్ గది దాటగానే వేడివేడి . నిట్టూర్పులు విడిచి - పిల్లి అరుపులతో - కుక్క అరుపులతో - తుమ్ములతో - దగ్గులతో సాగనంపి నిశ్చింతగా సిగరెట్టు వెలిగిస్తారు - శంకరం కొత్తగా హాస్టల్ కి వచ్చిన రోజుల్లో ఏ అలవాట్లూ లేని కుర్రాళ్ళని చాలామందిని చుశాడు. నెలలు గడుస్తోన్నకొద్దీ వాళ్ళలోనే చాలామంది సిగరెట్లు కాల్చటం నేర్చుకున్నారు. వార్డెన్ కళ్ళు గప్పి సినిమాలకి పోవటం అలవాటు చేసుకున్నారు. చతుర్ముఖ పారాయణం సరేసరి. చదువులచాటున చేసే పనే అది - ఇక పల్లెటూరి తిట్లభాష మాట్లాడ్డంకూడా ఫాషనే!

శంకరం పెద్దసైకాలజిష్టులా కుర్రాళ్ల మెంటాలిటీ గురించి ఆలోచిస్తూ కూర్చుంటాడు అప్పుడప్పుడూ.

"రామం! వీళ్ళంతా చదువుకోవాలనీ - అభివృద్ధిలోకి రావాలనీ కదా యిక్కడికి వచ్చారు? చదువులు నిర్విఘ్నంగా సాగితే తర్వాత ఎన్ని అల్లరి చిల్లరపనులు చేసినా లెక్కలోకిరావు. మొదటిదానికి ఎగనామం పెట్టి ఎందుకిలా చేస్తారు?" అంటూ రామం అభిప్రాయం సేకరించబోతాడు.

"వాళ్ళని మనం ఇలా అనుకుంటే మనలాంటి వాళ్ళని వాళ్ళు పుస్తకాల పురుగు లనుకుంటారు తెలుసా?"

"మనం కాలేజీకి ఎందుకు వచ్చినట్టు?"

"చదువుకోటానికే లేవోయ్. అయితే మాత్రం క్లాసుల్లో వింటోన్న బోరింగంతా చాలదూ? పూర్వం గురు ఆశ్రమాల్లో వుండే శిష్యపరమాణువుల్లా బట్టీ బడుతూ కూర్చోవాలా? 'అంత పరీక్షలు దగ్గిరికొస్తే చూద్దాం. గైడ్సులేవూ? ఆ మాత్రం భాగ్యానికి సంవత్సరం అంతా ఈసురోమంటూ ఏడుస్తూ చదవటం ఎందుకు?' - అదీ వాళ్ళ భావం అనుకుంటా "

"చూడు! ఆ ముకుందం కొత్తలో బాగా చదివేవాడు. ఇప్పుడు పుస్తకాన్ని చూస్తే సిగ్గుపడిపోతాడు."

"చదవటం అనాగరికుల లక్షణం అని మనవాళ్ళలో చాలామంది అభిప్రాయంలే."

"ఇక్కడి కొచ్చేసరికి మనవాళ్ళకన్నీ సరికొత్త అభిప్రాయాలు పుట్టుకొస్తాయి. ఇల్లు దాటి - వూరు దాటి స్వతంత్రవాయువులు పీలుస్తూ




బయల్దేరుతారు బైట ప్రపంచంలోకి. నెలనెల చేతినిండా డబ్బు అందుతూ వుంటుంది. శారీరకంగా మానసికంగా ఎదుగుతోన్న వయస్సు. ఏ ప్రభావాల కైనా తొందరగా లోంగేస్థితిలో పడతారు. వాళ్ళనంత తప్పుపట్టి ప్రయోజనంలేదు. ఎప్పుడో బాధ్యత తెలుసుకుంటే వాళ్ళే తమని తాము సరిదిద్దుకుంటారు. కానీ ఈ లోపునే చాలా సర్వనాశనం అవుతారు. అదే విచారించాల్సిన విషయం." రామం శంకరం రూమ్‌లో కూర్చుని అప్పుడప్పుడూ మనస్తత్వచర్చలు సాగిస్తూంటారు.

* * *

శంకరం డబ్బుకోసం ఎదురుచూస్తోంటే తండ్రి రాసిన వుత్తరం అందింది. సారాంశం— "ఇన్ని నెలలూ ఎలాగో కష్టపడి డబ్బు పంపాను. ఇక నావల్ల కాదు. ఇక్కడ మడులూ మాన్యాలూ లేవు. గొప్ప గొప్ప వాళ్ళకే చదువులుగానీ మనలాంటి వాళ్ళకు కాదు. నాలుగెకరాల కొం[illegible] దున్నుకోమని ఆదిలోనే చెప్పాను. వినకుండా బయల్దేరావు. చదువుకుంటావో ఏంచేస్తావో నాకు తెలీదు." —

వుత్తరం మొదట శంకరానికి ఆశ్చర్యము కల్గించింది. క్రమంగా అయోమయంలో పడేసింది. గుండె లెంతో బరువెక్కి విపరీతమైన దుఃఖం వచ్చింది— అది అప్పారావుచేత రాయించిన వుత్తరం. అప్పారావు మాట్లాడే మాటలు చాలా వున్నాయి అందులో.

త్తాలూ అప్పారావూ కలిసి తన తండ్రికి బోధించి రాయించిన వుత్తరం అది. శంకరం వుత్తరం మడిచి చేతిలో వుంచుకుని అలాగే కూర్చున్నాడు.

రామం రూమ్‌లోకి వచ్చి బట్టలు మార్చుకుంటూ "ఉత్తరం ఎక్కణ్ణుంచి? మీ వూరునుంచా?" అన్నాడు.

శంకరం జాలిగా చూశాడు.— "చదువుతావా?" అంటూ వుత్తరం అందించాడు.

రామం వుత్తరం చదివి తెల్లబోయాడు.

"మీ నాన్నగారు రాశారా?"

దుఃఖంతో మాట పెగలక తల వూపాడు శంకరం. శంకరం తన విషయాలేవీ రామానికి చెప్పకపోయినా ఆ వుత్తరంతో శంకరం స్థితిగతులన్నీ తెలిసిపోయినట్టయ్యాయి.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా కూర్చున్నారు. "మరేం చేద్దా మనుకుంటున్నావు?" అడగలేక అడిగాడు రామం.

శంకరానికి నోరు పెగ ల్లేదు. జవాబు చెప్పలేదు. రెటించలేదు రామం.

శంకరం మీల్స్‌కి పోకుండా పడుకోపోతోంటే రామం చెయ్యిపట్టి లాక్కుని తీసికెళ్లాడు.

రూమ్‌లోకి వచ్చి ఎవ్వరూ పుస్తకాలు ముట్టకుండా కూర్చున్నారు. వార్డెన్ వచ్చి వెళ్ళగానే లైటార్పి పడుకున్నారు.

తెల్లవార్లూ ఇద్దరికీ ఏమంత నిద్ర పట్టలేదు. బాగా చీకటితో రామం లేచికూర్చున్నాడు. దెబ్బ తిన్న పక్షి పిల్లలా ముడుచుకు పడుకున్నాడు శంకరం—

"శంకరం—" అప్యాయంగా పిల్చాడు రామం. శంకరం తలతిప్పి చూశాడు.

"నీగురించే నేను తెల్లవార్లూ ఆలోచించాను. పోనీ ఒకలా చేస్తే?"

చటుక్కున లేచి కూర్చున్నాడు శంకరం. రామం లైటు వేసి శంకరం పక్కన కూర్చుంటూ — "నీ సంగతి బాలకృష్ణతో చెప్తే?" అన్నాడు.

తెల్లబోయాడు శంకరం— "బాలకృష్ణతోనా? ఎందుకూ?''

"ఎందుకేమిటి? నిన్ను తన రూమ్‌లో వుంచుకుంటాడేమో!"

"బాలకృష్ణ రూమ్‌లోనా?"

"అవును, అక్కడ వుండచ్చు... కానీ భోజనం...?''

శంకరానికంతా అయోమయంలా తోచింది. ఇంటిదగ్గరనుంచి తండ్రి డబ్బు పంపించకుండా ఇంకా చదువుకోవటం ఎలా?

మళ్ళా రామమే అన్నాడు— "భోజనం సంగతికూడా బాలకృష్ణ చూస్తాడేమో!''



శంకరానికి ఆశ్చర్యంతో మతి పోయింది. అంత మంచివాడా బాల కృష్ణ?

"సాయం చెయ్యాలని తల్చుకుంటే తప్పకుండా చెయ్యగలడు. నెల నెలా వందలకొద్దీ తగలేస్తోనే వుంటాడు. ఒక సత్కార్యం చేస్తే తృప్తి అయినా వుంటుంది. అలాంటి ఖర్చు విషయంలో అతనేం ఆలోచించడు మరి."

ఏమో! నమ్మకం కుదరలేదు శంకరానికి. సాయంత్రం బాలకృష్ణ హాస్టల్‌కి రాలేదు. రామం శంకరాన్ని వెంటబెట్టుకుని బాలకృష్ణ రూమ్‌కి వెళ్ళాడు.

సూరిబాబేదో వుత్తరం కాబోలు రాసుకొంటున్నాడు. బాలకృష్ణ పత్రిక చూస్తున్నాడు.

"అరె; రామారావ్! రావోయ్! శంకరంకూడా వచ్చాడే!" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించాడు బాల కృష్ణ.

ఇద్దరూ కూర్చున్నారు రూమ్ చాలా విశాలంగా పెద్ద పెద్ద కిటికీలతో వెలుతురుగా వుంది. నిలువెత్తు అల్మైరా నిండా బట్టలూ పుస్తకాలూవున్నాయి. రెండే బల్లలూ-నాలుగైదు కుర్చీలూ- రెండు మడతమంచాలూ వున్నాయి. రూమ్‌కి పక్కనే మరో చిన్న గది వుంది. అది బాత్‌రూమ్‌గా వుపయోగించుకుంటోన్నట్టు స్పష్టంగా తెలు

స్తోంది. నీళ్ళబకెట్టూ – సబ్బు పెట్టెలూ గుమ్మంలోంచి కన్పిస్తున్నాయి.

శంకరం లేచి వెళ్ళి పెరటిగుమ్మం దగ్గిర నించున్నాడు.

కొంతసేపటికి స్థిమిత పర్చుకుని అసలు సంగతి ఎత్తాడు రామం – "శంకరంవాళ్ళ నాన్నగారు వుత్తరం రాశారు," అంటూ వుత్తరం బాలకృష్ణచేతికిచ్చాడు – బాలకృష్ణ ఉత్తరం చదివి ఆశ్చర్యంగా చుశాడు – "అరె! ఇప్పు డేం చేస్తాడు?"

"అదే తోచటంలేదండీ! పాపం అతనికి మాత్రం చదువుకోవాలనే వుంది."

శంకరం తెలివితేటల గురించీ – చదువుమీద శ్రద్ధగురించీ ఇద్దరూ మాట్లాడుకున్నారు కాస్సేపు. చివరికి "నాకు చాలా విచారంగా వుంది," అంటూ సానుభూతి చూపించాడు బాలకృష్ణ.

రామం ధైర్యంచేసి మనస్సులో మాట కాస్తా బయటపెట్టేశాడు – "పోనీ...అతన్ని...మీ రూమ్‌లో..."

బాలకృష్ణ సంభ్రమంగా చూశాడు – "నా రూంలోనా? అరె! చెప్పావు కావేం? దాని కేం అభ్యంతరం? అతని మానాన్న అతను వుంటాడు."

బాలకృష్ణ బొత్తిగా వెనకాముందూ తటపటాయించకుండా అంత తొందరగా ఒప్పేసుకుంటే శంకరానికి మతి పోయి నట్టయింది.

"కానీ ... అతని భోజనం ..." రామం సందేహిస్తోన్నంతలో శంకరం అనేశాడు – "నన్ను కొంచెం రూమ్‌లో వుండనిస్తే చాలు. భోజనం విషయం ఎలాగో నేను చూసుకుంటాను."

"నువ్వు చూసుకుంటావా? ఎలా చూసుకుంటావు?"

"బాలకృష్ణగారు ఒప్పుకుంటే భోజనం సంగతేమిటా అని పొద్దుటి నుంచీ ఆలోచిస్తోనే వున్నాను. ఫర్వాలేదు. ఎవరిళ్ళల్లోనైనా అడుగుతాను."

శంకరం పట్టుదల చూస్తే అందరికీ మనస్సులు కరిగాయి.

"అలాగేలేవోయ్! ఏదో చేద్దాం. నువ్వుమాత్రం కాలేజి మానేసి వెళ్ళిపోకు. ఎప్పుడు కావాలంటే అప్పుడు నా రూమ్‌కి మకాం మార్చెయ్," అన్నాడు బాలకృష్ణ శంకరంకేసి ఒదార్పుగా చూస్తూ.

బాలకృష్ణ కాళ్ళమీదపడి పాదాలు రెండూ కళ్ళకద్దుకోవా లనిపించింది శంకరానికి.

చిన్నకుర్రాడిలా తలదించుకు నించున్నాడు – వారం పదిరోజుల్లో శంకరంస్థితి చాలా నిర్దుష్టంగా ఐంది. వారానికి రెండురోజులు భోజనం హోటల్లో ఏర్పాటు చేశాడు బాలకృష్ణ. మిగతారోజులకి శంకరం సిగ్గు చంపుకుని పెద్దపెద్దవాళ్ళ ఇళ్ళకి వెళ్ళి

వారాలు కుదుర్చుకున్నాడు. కొంత మంది స్టూడెంట్సు కలిసి నెల నెలా శంకరానికి పదో పరకో యివ్వటానికి నిశ్చయించారు.

తుఫాను తగ్గి తలక్రిందులవబోతున్న నావ సాఫీగా తిరిగి ప్రయాణం సాగించి నట్టయింది శంకరానికి

తండ్రి వుత్తరానికి జవాబురాశాడు శంకరం.

—"నేను చదువు మానదల్చుకో లేదు. మాఅమ్మ నాకు బాగాచదువుకో మని చెప్పింది. నా శక్తికొద్దీ నేను చదువుకోవటానికే ప్రయత్నిస్తాను. దయార్ద్రహృదయులైన నా తోటి విద్యార్థులు నాకు అన్ని విధాలా సహాయం చేసి నన్ను చదివిస్తున్నారు. ఇదికూడా నీకు కష్టంఅయితే నే నేమీ చెయ్యలేను."—

* * *

శంకరం బాలకృష్ణరూమ్‌లోకి వచ్చి ఐదారు నెలలు దాటింది.

రూమ్‌వాళ్ళిద్దరికీ శంకరం ఏమంత సన్నిహితం కాలేదు. శంకరం కార్య క్రమం వేరు, బాలకృష్ణావాళ్ళ కాల క్షేపం వేరు.

బాలకృష్ణపట్ల గతంలో శంకరానికి వున్న దురభిప్రాయాలు చాలావరకు తగ్గాయి. బాలకృష్ణని శంకరం బాగానే అర్థం చేసుకోగలిగాడు.

బాలకృష్ణకి ఆడంబరం — హోదా కావాలి. వాటికోసమే ఆత నెప్పుడూ తపిస్తూ వుంటాడు. అమ్మాయిలకి ప్రేమలేఖలు రాసినా — లెక్చరర్స్‌కి మారుపేర్లు పెట్టినా — కాలేజీలో సమ్మెలు జరిపించినా. అసలు బాలకృష్ణ రింగ్‌మాస్టర్ కావటానికి సూరిబాబు పాత్ర చాలావుంది. బాలకృష్ణ సాధార ణంగా ఏం చెయ్యబోయినా సూరి బాబునే సలహా అడుగుతాడు. సూరి బాబు చెప్పిందాన్ని అక్షరాలా పాటిస్తాడు. సూరిబాబు ప్రభావంలో బాలకృష్ణ గొంతువరకూ మునిగి వున్నాడు. వాళ్ళది చాలా గొప్ప స్నేహం అనే స్టూడెంట్సంతా అను కొంటూవుంటారు.

శంకరాని కెందుకో సూరిబాబు సహచర్యం యిబ్బందిగా తయారైంది.

కానీ సూరిబాబు చదువులో తెలివైనవాడు. ఎప్పుడో బుద్ధిపుట్టి నప్పుడు మాత్రం పుస్తకాలు తిర గేస్తాడు. ఆదరా బాదరా నోడ్సు రాస్తాడు. అయినా అతని మార్కులకేం ఢోకావుండదు. కాస్త మంచిమార్కులే తెచ్చుకుంటాడు.

బాలకృష్ణకి చదువుదగ్గిరికి వచ్చేసరికి చెప్పలేని బద్ధకం. ఒక్క పావుగంట చదివేసరికి ఆవులింతలతో తలమున్కలై పోతూ అర్ధరాత్రి నిద్రలేచినవాడిలా తూలుతూ పోయి, పక్కమీదపడి నిద్ర పోతాడు. చదువు విరమించేముందు

బాగా తెలివివుంటే - "శంకరం - రేపు చీకటితో నన్నూ లేపవోయ్!" అంటాడు.

కొత్తలో శంకరం రెండుమూడు సార్లు తెల్లవారుఝామున తను లేచి. నప్పుడు బాలకృష్ణ మంచం దగ్గిరికి వెళ్ళి— "బాలకృష్ణగారూ! చదువుకోటానికి లేపమన్నారుగా?'' అంటూ లేపాలని ప్రయత్నించాడు.

''అబ్బ! వూరుకోవోయ్! ఇప్పు డేం చదువు? నువ్వూ పడుకో, రాత్రికి చదువుకుందాం."

శంకరం ఎటూ తోచక కాస్సేపు తటపటాయించి తను చదువుకోటానికి కూర్చున్నాడు.

ఎనిమిదిగంటలవేళ బాలకృష్ణ లేచి "నన్ను లేపనేలేదేమోయ్?'' అంటూ నిష్ఠూరం వేశాడు.

"లేపానండీ! మీరే లేవలేదు. నన్ను కూడా పడుకోమన్నారు," అన్నాడు నవ్వుతూ శంకరం.

బాలకృష్ణకూడా నవ్వేస్తూ-"నాకు గుర్తేలేదోయ్! పోనీ రేపు బాగా లేపు. లేవనంటే వూరుకోకు," అన్నాడు.

సూరిబాబు శంకరంకేసి చూసి నవ్వి "బాలకృష్ణ రేపుకూడా లేవనంటాడు. ఊరుకోకుసుమా! తొడపాశం పెట్టు," అన్నాడు.

బాలకృష్ణ పగలబడి నవ్వాడు.

"బాబ్బాబు! అంతపని మాత్రం చెయ్యకు," అంటూ శంకరాన్ని అర్థిస్తూ ఓ పావుగంటవరకూ నవ్వాడు.

సాధారణంగా బాలకృష్ణా సూరిబాబూ సాయంత్రం కాలేజీనుంచి రాగానే మొహాలు సబ్బుతో రెండేసిసార్లు తోమి - పౌడర్లు అద్ది - ముస్తాబవుతారు. బాలకృష్ణ జుట్టుని లొంగదీసుకోవటానికి రూమ్‌నిండా రకరకాల నూనెలూ - క్రీమ్‌లూ వున్నాయి. సెంట్స్‌కి లెక్కే లేదు. ఇద్దరూ బయటికి పోయారంటే తొమ్మిది పదిగంటల ప్రాంతంలోగానీ రూమ్‌కి రారు. ఒక్కోసారి కలిసే వస్తారు. ఒక్కోసారి విడివిడిగా వస్తారు. వచ్చిన దగ్గిర్నుంచీ పుస్తకాలు ముందేసుకుని - కబుర్లు మాత్రం సినిమాల మీదో, అమ్మాయిల మీదో - కథల మీదో - ఇంకా ఎన్నో ఎన్నో విషయాల గురించి అలిసిపోయి విసుగొచ్చేవరకూ చెప్పుకుంటారు. నిద్ర ముంచుకువచ్చి పక్కలమీదికి ఒరిగితే తెల్లవారి ఎనిమిదిగంటలకి లేవటం. ఒక్కోసారి స్నానంకూడా చెయ్యకుండా ఆదరా బాదరా హోటల్‌కి పోతారు. మరీ ఆలస్యమైతే కాలేజీ ఎగ్గొడతారు.

ఇక శెలవురోజులైతే బాలకృష్ణ రూమ్ క్లబ్బులాగో-థియేటర్‌లాగో-స్టేషన్ లాగో - ఎలాగో ఎలాగో వుంటుంది. బాలకృష్ణకి అన్ని క్లాసుల



లోనూ ఫ్రెండ్సున్నారు. సూరిబాబుకి కూడా తక్కువేం లేరు. వాళ్ళిద్దరి కోసం వచ్చేవాళ్లు వస్తొంటే పోయే వాళ్లు పోతుంటారు.

గమ్మత్తు ఏవిటంటే శెలవురోజుల్లో మాత్రం బాలకృష్ణ బాగా పెందరాడే లేస్తాడు రాత్రుళ్ళుకూడా చాలా ఆలశ్యంగా రూమ్‌కి వస్తాడు. ఒకో్క వారం రోజంతా పేకాట లేసుకు కూర్చుంటారు. ఒకో్కవారం ఎక్కడి కైనా షికార్లు వెళ్తూవుంటారు.

బాలకృష్ణ రూమ్ వాతావరణం శంకరాన్ని చాలావరకు లొంగదీసింది. పేకలో ఎన్నిముక్కలు వుంటాయో ఎరగని శంకరానికి పేకాట బాగానే చేతనైంది. బాలకృష్ణకికూడా శంక రంతో పేకాడటం యిష్టం సూరిబా బయితే వుత్తప్పుడు ఎంత ముభావంగా •వున్నా పేకాటలో సవాలక్ష తగూలు పెడతాడు వాళ్ళిద్దరూ రెండేసి రోజులు మాటాడుకోకుండా మొహాలు ముడుచుకు తిరుగుతారు.

బాలకృష్ణ బలవంతంతో శంకరా నికి తరుచూ సినిమాలు చూడటం కూడా అలవాటైంది.

మరోకాలక్షేపం-బాలకృష్ణ బుల్ బుల్ వాయిస్తోంటే విని ఆనందించ టం. బాలకృష్ణ బుల్ బుల్ వాయిస్తే నిజంగా వింటోంటే ఆనందం కల్గు తుంది. ఏ కారణం చేతనైనా విసుగే సినా అది బయట పెట్టకుండా కళ్ళు మూసుకుని కుర్చీలో వెనక్కి వాలి పడుకుని తన్మయత అభినయిస్తాడు శంకరం.

బాలకృష్ణ పాట ముగించి "ఎలా వుందోయ్?" అంటే - చాలా బావుం దండీ!" అంటూ నిటారుగా కూర్చుని శక్తికొద్దీ మెప్పు ప్రకటిస్తాడు. "అస్త మానూ సినిమాపాటలే వాయించక పోతే సంగీతం - కృతులూ అవీ వాయించకూడదాండీ?" కృతులు బుల్ బుల్ మీద వస్తాయో రావో శంకరానికి తెలీదు. బాలకృష్ణకీ తెలీదు - సంగీతం రాక.

"పోనిద్దూ! చెత్త! న...న...న్న న్న...అనుకొంటూ ఏమి టా సుఖం? 'మైఁ ఆవారాఁ హూఁ ఆసుమాను మేఁ తారా హూ!' అంటూ వాయి స్తోంటే ఎంత దిల్ గా వుంటుంది!"

బాలకృష్ణ గాత్రంకూడా పాడ తాడు. హైస్కూల్లోనో మిడిల్ స్కూల్లోనో అతనికి పాడినందుకు బహుమతిపత్రం వచ్చిందట. దాన్ని శంకరానికి చాలాసార్లు చూపించాడు.

అతను సినిమా పాటలేవో పాడితే ఎలాగో వినచ్చుగానీ - "రామాంజ నేయ యుద్ధం", "ద్రౌపదీ వస్త్రా పహరణం" వగైరా డ్రామాల్లో పద్యాలు ప్రారంభిస్తే శంకరం గుండెల్లో గుబులు బయల్దేరుతుంది - చిక్కేమిటంటే బాలకృష్ణకి డ్రామాల్లో పద్యాలే చాలా యిష్టం! - చంటిపిల్లలు ఉగ్గు మింగుతూ గుక్కపట్టినట్టు - "ఊఁ ఊఁ ఆఁ...ఆఁ" అంటూ లేచి నిలబడి చెయ్యెత్తి కంఠస్వరాన్ని గిరి కీలు కొట్టిస్తూ - పద్యం చివర ఆరున్నర నిముషాల రాగం తీస్తాడు. "ఊపిరి అందటం లేదుగానీ - అలా ఎంతసే పై నా రాగం తీయగలను,'' అంటాడు గర్వంగా. బిక్కమొహం వేసి కూర్చున్న శంకరం - రాగసమాప్తితో పుట్టెడు సంతోషం తెచ్చుకుని - ఇంత సేపు మీరు కాబట్టి ఊపిరి నిలబెట్ట గలిగారు. ఇలాటి రాగం నే నేనాటకా ల్లోనూ వినలేదు," అంటాడు.

"ఏడిశారు, మనవాళ్ళ కేమీరాదు. రాదని ఒప్పుకోరు." రూమ్‌లోకి శంకరం వచ్చాక బాలకృష్ణ గాన కచ్చేరికీ వాద్యకచ్చేరికీ మంచి శ్రోత దొరికాడు.

నాలుగైదు రోజులకోసారి బాల కృష్ణ బుల్ బుల్ ప్రోగ్రాం తప్పదు. సూరిబాబు జారుకున్నా శంకరానికి వినక తప్పదు.

ఓ రోజు మాటల సందర్భంలో రామంతో మనస్సు విప్పి చెప్పేశాడు శంకరం - "బాలకృష్ణ రూమ్ లో చదువుకోవటం చాలా కష్టంగా వుందోయ్! వాళ్ళు చదువరు, నన్ను చదువుకోనివ్వరు. మిగిలిన సదుపాయా లన్నీ బ్రహ్మాండగా వున్నాయిగానీ చదువే సాగటం లేదు."

రామం తనకు తోచిన సలహా చెప్పాడు.




"తామరాకు మీద నీటిబొట్టు" అంటారే మనవాళ్లు — అలా వుండాలి నువ్వు. కంపెనీ మంచిది కాదు. అయినా బాలకృష్ణ మనస్సు మంచిది. నువ్వు వాళ్ళ అలవాట్లలో పడేకన్నా ఈ చనువు మానుకోవటం మంచిది. కొంచెం మెలుకువగా వుంటే ఫర్వా లేదు. నీ చదువు ఎలాగైనా సాగుతుంది.

శంకరం తన పరిస్థితినంతా అవగాహన చేసుకుంటూ బాలకృష్ణ మనస్సు నొప్పించకుండా నడుచుకోవాలని తీర్మానించుకుని రూమ్‌కి తిరిగివచ్చాడు.

* * *

పరీక్షల రోజుల్లోమాత్రం బాలకృష్ణా, సూరిబాబూ తెల్లవార్లూ జాగారాలు చేస్తూ చదివారు. వాళ్ళిద్దరూ కప్పులకొద్దీ టీ గుమ్మరించుకుంటూ ఒద్దంటూన్నకొద్దీ శంకరం గొంతులో కూడా బలవంతాన పోసేవారు - టీ దారిన టీ పోయి నిద్రదారిన నిద్ర ముంచుకొస్తే మధ్యమధ్య బాలకృష్ణ బుల్‌బుల్ కచ్చేరీ సాగేది.

"ఈ ఏడుపుకన్నా ఆ ఏడుపే బావుందిరా!" అంటూ సూరిబాబు మళ్ళా పుస్తకం చేతిలోకి తీసుకు కూర్చుంటే, సూరిబాబుకేసి నిద్రకళ్లతో

ఎర్రగా చూడబోయి తేలిపోయి తనూ పుస్తకం తీసుకునేవాడు బాలకృష్ణ.

రెండోవిడత నిద్ర ముంచుకొచ్చినప్పుడు మళ్ళా పుస్తకం పడేసి – "నాకు బాగా నిద్ర వచ్చేస్తోందోయ్! గొంతు చాచి ఓరాగం తీస్తేగానీ నిద్ర పోయేలాలేదు,'' అన్నాడోసారి బాలకృష్ణ.

"ఏమోయ్! శంకరం!' నువ్వు చదవటం ఆపుజేసి కాస్సేపు పాట వినరాదూ?" అంటూ ఆజ్ఞకూడా జారీ చేశాడు.

అర్ధరాత్రి సూరిబాబుకి వీధిలోకి పారిపోవటానికి భయం వేసింది. పిరికి చూపులు చూస్తూ ప్రాధేయ పడుతున్నట్టు అన్నాడు – "బాలకృష్ణా! అంత స్వార్థం పనికిరాదురా నీకు. నువ్వు గొంతు చాచుకుని పాట పాడతావు, నీనిద్రపోతుంది నిజమే; కానీ నీ గానమాధుర్యంతో మాకు నిద్రలు పట్టేస్తాయి. చూశావా? అప్పుడెలా."

"నిజమే. అప్పుడుమాత్రం ఎట్లా? మీ రిద్దరూ నిద్రపోతే ఎట్లా?'' అంటూ ఆలోచనలో పడ్డాడు బాలకృష్ణ.

శంకరం మొహానికి పుస్తకం అడ్డం పెట్టేసుకున్నాడు.

సూరిబాబే మళ్ళా అన్నాడు – "బాలకష్ణా! కూజాలో నీళ్ళున్నాయి. కాస్త మొహం కడుక్కురా! నిద్ర అదే పోతుంది."

బాలకృష్ణ మొహం కడుక్కుని మళ్ళా కూర్చున్నాడు. మూడోవిడత నిద్రవస్తేమాత్రం తిరుగులేనిఉపాయం – హాయిగా మంచంమీదపడి నిద్ర పోవటం, పరీక్షలకి చదివినంతకాలం ఈ మూడో వుపాయమే బాలకృష్ణని బాగా రక్షించింది.

* * *

ఇంటర్ ఫస్టియర్‌లో చాలా మంచి మార్కులు వచ్చాయి శంకరానికి.

శంకరం కొంచెం పదిమంది దృష్టిలోకి వెళ్ళాడు. లెక్చెరర్స్ కూడా శంకరం కన్పించినప్పుడు అభినందిస్తోన్నట్టు నవ్వుతూ మాట్లాడటం సాగించారు. శంకరాన్ని ఎరిగివున్న స్టూడెంట్సంతా శంకరం ప్రోగ్రెస్ వింటూ ముచ్చటపడ్డారు.

బి. ఎ. ప్రీవియస్‌లో సూరిబాబుకి ఫర్వాలే దనిపించాయ్ మార్కులు. బాలకృష్ణకి అత్తెసరూ కాదు. అయినా బాలకృష్ణేం ఖాతరు చెయ్యలేదు. "ఇంకా సంవత్సరం లేదుటోయ్? ఏంచేసుకోవాలి లైమంతా?" అన్నాడు ధీమాగా.

"శంకరం! ఎలాగైనా నువ్వు మంచి బాలుడివేనోయ్!'' అన్నాడు నవ్వుతూ.



సూరిబాబుకూడా అదో మాదిరిగా నవ్వి —

"నిన్ను చూస్తోంటే నాకు జెలసీగా వుందోయ్ శంకరం," అంటూ చూశాడు శంకరంకేసి.

శంకరం దేనికీ జవాబు చెప్పలేదు. నవ్వి వూరుకున్నాడు.

రోజులు ... వారాలు ... నెలలు సాఫీగానే గడుస్తున్నాయి శంకరానికి కూడా.

ప్లీడరు రామేశంగారింటికి భోజనానికి వెళ్లాల్సిన పూటా— బాలకృష్ణ బుల్‌బుల్ వినాల్సిన గంటా— సూరిబాబు నవ్వులో ఏడుపు కన్పించే క్షణం— ఏవో కొన్ని కొన్ని మినహాయింపులు తప్పితే— కాలం పంచకల్యాణిలా పరిగెడుతోన్నట్టే వుంది శంకరానికి

* * *

కొత్త తెలుగు మాష్టారు క్లాసుకొచ్చారు. ఆయన బొత్తిగా తెలుగు మాష్టారిలా లేరు. పిలకా— పంగనామాలూ— ఏమీ లేవు. తెల్లని పంచెకట్టూ— వుత్తరీయం— ఆకు చెప్పులూ— కళ్ళజోడూ— చేతిలో పుస్తకాలూ—

పిల్లలందరికీ ఆశాభంగం అయింది. మాష్టారు రాగానే రెండు నిమిషాలు అటూ యిటూ చూసి అటెండెన్స్ తీసుకున్నారు. వెంటనే పాఠం ప్రారంభించారు —

"గిరిక ప్రణయం" సాగుతోంది.

కుర్రాళ్ళకి విసుగొచ్చింది. పిల్లులూ-కుక్కలూ అయ్యారు.

అరుపులతోనూ- కూతలతోనూ- గిరిక ప్రేమప్రవాహం ఆగింది.

మాష్టారు మండిపడుతూ చూశారు క్లాసంతా. చివరి బెంచీలో ఒంటరిగా కూర్చున్న శంకరంమీదికి పోయింది దృష్టి – "స్టాండప్."

తెల్లబోయాడు శంకరం.

తడబడుతూ లేచి నిలబడ్డాడు.

"గెటౌట్ !"

"మాష్టారూ!"

"షటప్ ! గెటౌట్ ఫస్ట్ !"

శంకరం అడుగుల బరువు విన్పించేంత నిశ్శబ్దమైపోయింది క్లాసు.

శంకరం పోయి చెట్టుక్రింద నించున్నాడు. మాష్టారిమీద కోపంకన్నా-ఆశ్చర్యం ముంచుకువచ్చింది. తనే అల్లరి చేశాడని మాష్టారనుకున్నారా? తను చెవులు రిక్కించుకుని పాఠం వింటూ నిశ్చలంగా కూర్చుని వున్నాడే?

పిరియడ్ అయింది. మాష్టారు బయటికి వచ్చారు వరండాలోంచి తిన్నగా వెళ్ళి లెక్చెరర్స్ రూమ్ముందు నించున్నాడు.

శంకరం ..ర్యంగా దగ్గిరికి వెళ్ళాడు.

"నమస్కారం మాష్టారూ!"

చేతిలో పుస్తకాలు సర్దుకొంటూ చూశారు మాష్టారు. మాష్టారి చూపుల్లో శంకరాన్ని పోల్చిన జాడలేదు.

"నేనండీ మాష్టారూ ! నన్ను మీరు క్లాసులోంచి పంపించేశారు."

మాష్టారు నిర్లక్ష్యంగా చూశారు. "ఊఁ అయితే యిప్పు డేమంటావ్ ?"

"నేను ... అల్లరేం చెయ్యలేదు మాష్టారూ!" తన నిర్దోషిత్వాన్ని వెల్లడిస్తూ అన్నాడు శంకరం.

"సాధ్యమైనంత వరకూ నేను ముందే కూర్చుంటానండీ! ఇవ్వాళ ఖాళీలేదని వెనక కూర్చున్నాను. నేను ఒక్కణ్ణే కూర్చున్నాను. అల్లరి చేస్తోందీ లేనిదీ కనిపించనే కనిపిస్తుంది మాష్టారూ! నేను ఎంతో శ్రద్ధగా పాఠం వింటున్నాను – అల్లరేమీ చెయ్యలేదండీ!"

మాష్టారు నుదురు చిట్లించి అబద్ధాల కోరుని చూస్తోన్న చూపు చూశారు.

(సశేషం)

*

# అజ్ఞానం

## బుచ్చిబాబు

గ్రంథకర్త: అనామకోపాఖ్యానం

"పెనిమిటి బిడ్డని గుణముల
వినుతింపగ, ప్రేమ భావ విహ్వల
మతియై
చనుమొనల పాలు గురియగ
కనుగొనలను జలము లొలుకగా
బెగ్గిలియెన్."

*  *  *

"మన దేశం మొత్తంమీద 15.8 కోట్లకుపైగా పశువులున్నాయని అంచనా. ఉజ్జాయింపుగా చెప్పితే దేశంలో ప్రతి ముగ్గిరికీ ఒక పశువు చొప్పున ఉన్న దన్నమాట. అయితే వీనిలో అధికభాగం తిండిలేక బక్కచిక్కి ఎందుకూ కొరగాకుండా ఉన్నాయి. దేశంలోని ఉత్తమ జాతి ఆవులైనా పాశ్చాత్య దేశాలందలి సామాన్యపు ఆవులు యివ్వగల పాలలో సగము మాత్రమే యివ్వగలుగుతున్నాయి. మేలుజాతి పశువుల ఉత్పత్తిని ప్రోత్సహించే నిమిత్తం కీలక గ్రామ పథకమనేది ప్రవేశపెట్టబడింది. గత రెండు ప్రణాళికలలో ఈ పథకం క్రింద దాదాపు రెండువేల గ్రామాలు ఎన్నిక చేయబడినవి. ఈ గ్రామాలలో ఉత్తమజాతి యెద్దులు ఉంచబడతాయి. ముసిలిపశువులు, వ్యాధిపీడితమైన పశువుల సంరక్షణ నిమిత్తం పెక్కుచోట్ల గోసదనములు యేర్పాటు చేయబడ్డాయి."

*  *  *

మొదటిది పద్యం. అందులో మధురమైన కవిత్వం వుంది. పాలిస్తూ పులకించి పరవశురాలైన తల్లిస్థితి వర్ణన. చనుమొనల పాలు కురుస్తూవుండగా, కన్నులంట నీరు కారుతుం దన్నది గొప్పభావన. నా కళ్ళంట నీళ్ళు తిరుగుతాయి. ఇది వ్రాసినాయన్ని ప్రపంచ కవుల చిట్టాలో వుంచడానికి సంకోచించను.

రెండోది వచనం. దేశంలో ప్రతి ముగ్గురికీ ఒక పశువుచొప్పున వుందని గ్రహించినప్పుడు నా గుండె జలదరి

స్తుంది. వీటిల్లో చాలా భాగం తిండిలేక బక్క-చిక్కి ఎందుకూ కొరగాకుండా వున్నాయని తెలుసుకుంటే భయం వేస్తుంది. ముసలిపశువులు, వ్యాధిపీడిత మైన పశువుల సంరక్షణ నిమిత్తం చాలాచోట్ల గోసదనాలు ఏర్పాటుచేస్తున్నారని తెలుసుకుంటే, నా కళ్ళంట నీళ్ళు తిరుగుతాయి.

ఆ పద్యం, ఈ గద్య-కరుణ రసాన్ని పోషిస్తున్నాయి. ఆ పద్యం వ్రాసినాయన, వెనకటితరం మహాకవి. ఈ వచనం వ్రాసినాయన, నేటి కాలపు గ్రంథకర్త. కాని ఇద్దరికీ పేళ్ళు లేవు - 'పేరులు' అనడం బదులు-'పేళ్ళు' అన్నాను; చూశారా, వెనకటితరం కవిత్వము అనగానే, గ్రాంథికంలో పడిపోతాము కాబోలు! ఈ ఇద్దరికీ పేరులు లేవని కాదు. ఉంటాయి. అమ్మా, నాన్నా వాళ్లు పుట్టగానే నామకరణం చేసివుంటారు. సందేహం లేదు. కాని ఆ పేరులు మనకి తెలియవు. ఏమిటీ దారుణం? అంత గొప్ప పద్యం వ్రాసిన కవిపేరే మనకి తెలియదా? తెలియకేం! మా చక్కా తెలుసు. పరిశోధకులు ఊరుకుంటారా? ఈ కవి ఒంటిమిట్ట వాసి అని వావిలికొలను సుబ్బారావుగారు వాదించారు. ఈయన తెలంగాణములో ఓరుగల్లు వాడని వీరేశలింగం పంతులుగారు నిర్ధరించారు. ఆ తర్వాత, కొమర్రాజు లక్ష్మణరావుగారు, ఈ కవి ఏకశిలానగర వాసియై వుంటాడనీ, ఏకశిలానగరమూ, ఓరుగల్లూ వొకటేననీ వాదించారు. ఈ వాదా లన్నింటినీ విమర్శించి అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఈ కవి ఓరుగల్లు మండలం జనగామ తాలూకా లోని...ఈ వాక్యం పూర్తిచెయ్యను. ఆ ఊరుపేరు చెప్తే, ఆ కవి ఎవరో నా పాఠకులు ఇట్టే గ్రహించివేస్తారు. ఈ పాటికి గ్రహించారేమొకూడా-ముఖ్యంగా, నా పాఠకులలో స్త్రీలు, ఇట్టె గ్రహించి వుంటారు. ఈ కవి తెలుగువారికి అత్యంత ప్రియుడు. ప్రపంచకవుల జాబితాలో వేసేశానుకూడా. వాక్యం పూర్తి చెయ్యనా?

"ఈ కవి ఓరుగల్లు మండలం జనగామ తాలూకాలోని బమ్మెరయే నని స్థాపించినారు.'' పోతన పూర్వుల జన్మస్థలము బమ్మెర అనీ, ఆయన భాగవతం ఓరుగల్లులో వ్రాశాడనీ తేలిపోయింది. ఆ కవి ఎవరో, ఏ ఊరివాడో తెలుసుకోడానికి ఇంత గంద్రగోళం జరిగింది. ఆ కవి ఏకాలంనాటివాడో ఈనాటివరకూ నిశ్చితంగా తేలలేదుట. పండితులు రకరకాలుగా చెప్తున్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన 'శ్రీ మహాభాగవతం' సంపాదకవర్గం వారు, ఈ పండితుల నిర్ణయాలపై చేసిన తీర్పు యిది:

"ఇన్ని నిర్ణయములందు కొంత మెరుగైనది. పోతన పదునైదవ శతాబ్ది




యుత్తరార్ధమునం దున్నవా దనునదే యైనను పోతనకాలము తదితరకృతుల నిదమిత్థముగా తేల్చిచెప్పుట కిప్పటికి లభించిన చారిత్రిక సామగ్రి చాలదనియే మా యభిప్రాయము."

ఊరు, కాలం మాట అటుంచి పోతన పేరన్నా, మనకి తెలిసిరావడం మన అదృష్టం. కాని నేనుదహరించిన వచనం వ్రాసినాయన పేరు కూడా మనకి తెలియదు. వందలాదిగా వర్ధిల్లుతున్న అనామక గ్రంథకర్తలలో ఆయన వొకడు. ఆ గ్రంథంపేరు 'పురోభివృద్ధికి ప్రణాళికలు.' గ్రంథకర్త పేరు లేదు.. ఎన్నికాపీలు ముద్రించారో లేదు. రచయిత తన హక్కులు కాపాడుకో లేదు.' వెల' లేదు. అవి 'అమ్మకమునకు కాదు.' పీఠికలోమాత్రం, సెకండరీ పాఠశాలల విద్యార్థుల నుద్దేశించి వ్రాసిన పుస్తకం అని చెప్పుకున్నాడు. "పాఠ శాలా విద్యార్థులకే కాక మనదేశంలో ప్లానింగును గురించి తెలుసుకొనగోరే సామాన్య పాఠకులకు సహితం ఈ పుస్తకం చక్కని ప్రవేశికగా ఉపయోగ పడగలదని ఆశిస్తున్నాము." అని పీఠిక ముగింపు. 'ఆశిస్తున్నాము' ఏమిటి? ఆ రచయిత వొక్కడూ రాసిందికాదా? చాలామంది కలిసి వ్రాశారా? ఏవొక్కరి పేరూలేదు. ఈ గ్రంథంలో ఆడదో, మొగాడో తెలియదు. ఆయనకి సన్మానం లేదు. పుస్తకం విడుదల చేసే ఉత్సవం లేదు. ఆయన ఫొటోపత్రికల్లో పడదు. ఆయనకి ఏ అకాడమీ ఎవార్డు లివ్వరు. ఆయన వొకపుస్తకం వ్రాసినట్లే ప్రజకి తెలియదు. సాహిత్య గోష్ఠులలో అందులో భాగాలు చదివి వినిపించడు; ఆయన భార్యకికూడా తెలియదేమో.

తెలిసినా ఆ పుస్తకం ఆమె చదవదు. అసలు వ్రాసిన రచయితే దాన్ని చదవ దేమో! ప్రూఫులుకూడా ఆయన చూసి వుండడు. అది మరొకరిపని. ఇందుకు కారణం? ఆ పుస్తకం, భారతప్రభుత్వం సమాచార, రేడియో మంత్రిత్వశాఖ ప్రచురణ విభాగంవారు ప్రచురించడమే ఇందుకు కారణం.

దీన్నిగురించి ఆలోచిస్తే నాగుండె తరుక్కుపోతుంది. ఇట్లాంటి అనామకులైన గ్రంథకర్తలు వొందలాదిగా వున్నారు. ఆ గ్రంథాలలో వొస్తువు అతిముఖ్యమైనది. మనదేశంలో రెండు అద్భుత సంఘటనలు జరిగాయి. మొదటిది దేశంలో, విదేశీ పరిపాలన ముగిసి, జాతీయ ప్రభుత్వం ఏర్పడటం; రెండోది ఒక జాతీయ ప్రణాళికి రూపొందించబడి అమలు జరుపబడటం. ఈ ప్రణాళికల ఆధారంగా, భారతజాతి కష్టసుఖాలూ, పురోగమిస్తూవున్న పద్ధతీ, ఇంకా ఏవేమిచేస్తే ఈజాతి సుఖపడతారో చూపడం – ఇదీ, యీ గ్రంథాలలో విషయం. ఇట్లాంటి సాహిత్యాన్ని వెలువరిస్తున్న రచయితలు అనామకులు కావడం బెంగేస్తుంది. గ్రంథకర్త ఎవడైతే నాకెందుకు, ఈ పుస్తకం చదవ తగ్గది, ఇందులో విషయం అద్భుతమైంది, నేను తప్పక తెలుసుకోవల్సింది– అనుకుని, పాఠకులు చదవవొచ్చుగా! పేరులేని గ్రంథకర్తలు వ్రాసిన ఈ గ్రంథాలని, చదవరు సరికదా, అసలు ఇట్లాంటి గ్రంథాలు వున్నాయనే, జనానికి తెలియదు. ఒకామె పుట్టినరోజుకి, ఎవరో వొక టేబిల్‌లైట్ బహూకరించారుట. దాన్ని వాడడంకోసం, ఆమె పుస్తకం కొందిట. అట్లాంటి సందర్భంలో కూడా, ఈ పుస్తకాన్ని ఎవరూ కొనరు, చదవరు. పుస్తకంలో విషయం – దేశానికీ, ప్రభుత్వానికీ, ప్రజాక్షేమానికీ సంబంధించినది. వీటనిగురించి తెలుసుకోవాలన్న అక్కర, అభిరుచి లేకపోవడమే శోచనీయం.

ప్రాచీన గ్రీస్ దేశంలో, డెమాస్థినిస్ అనే మహావక్త వుండేవాడు – దేశం గురించీ, ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాలని గురించీ ప్రసంగిచేవాడు – వేలాదిగా మూగినజనం, ఆయన చెప్పింది వినక, గంద్రగోళం చేస్తూండడం చూసి, ఇల్లా మొదలుపెట్టాడు డిమాస్థినిస్ –

ఒకడు వొకగాడిదని తీసుకు వెడుతున్నాడు. కొంతదూరం వెళ్ళాక, ఆ గాడిద తనకు కావాలనీ అమ్మితే కొంటాననీ అన్నాడుట, మరివొకడు. సరే బాగుంది అనుకుని. యజమాని, తన గాడిదను అమ్మివేశాడు. బాగా ఎండ కాస్తోంది. గాడిదను అమ్మివేసిన యజమాని, గాడిదనీడలో ఎండ తగలకుండా కూర్చున్నాడుట. 'ఇది, నా గాడిద; నేకొన్నాను దీనినీడలో నువ్వు కూర్చొడానికి వీలులేదు, తొలిగిపో, అన్నాడుట కొన్నవ్యక్తి. 'నేను గాడిదను అమ్మానే

ఈ మధ్య ఆడవాళ్ళెవరో మగవాళ్ళెవరో
కనిపెట్టడం కష్టంగా వుందోయ్! మొన్న
బస్టాపులో పంట్లాం చొక్కా వేసుకోనున్న
నూనూగు మీసాల కుర్రాణ్ని టైమెంత నాయనా
అనడిగా— పక్కనున్న మరో కుర్రాడు
ఆవిడ అమ్మాయండి-
అబ్బాయి కాదు —
అన్నాడు



కాని, దాని సీదని అమ్మలేదు' అన్నాడుట అమ్మినాయన. అల్లా తగవులాడుకున్నారు." అని ఉపన్యాసం నిలుపు చేశాడుట డిమాస్థనీస్. "తరువాత ఏం జరిగింది? చెప్పండి," అని గోల చేశారుట ప్రేక్షకజనం. అంతే డిమాస్థనీస్ ఇల్లాగన్నాడు.

"మీరంతా వెఱ్ఱి ప్రజలు. దేశం, ప్రభుత్వం, ప్రజలూ గురించిచెప్తే, మీ కక్కర్లేదు, వినరు, గోలచేస్తారు. ఒక గాడిదకథ చెప్తే, చెవులు నిక్కపొడిచి వింటారు. అంతేగా!"

ఆకథ ముగింపు ఏమిటో తెలుసుకోవాలనుంది నిజమే. కథలంటే మనందరికీ అంతఇష్టం. విషయం గాడిదను గూర్చినదే_ అంత ముఖ్యమైందికాదు, నిజమే. గ్రీసుదేశంలో, పదివేలగాడిద లున్నాయి; వాటిల్లో ముప్పాతికవంతు వ్యాధికి గురై మానవుడికి వుపకరించకుండా వున్నాయి. వాటిని చికిత్సచేసి సంరక్షించే బాధ్యత ప్రభుత్వానిది. ఆ ప్రభుత్వయంత్రంతో ప్రజలంతా సహకరించాలి అని చెప్పితే, జనం వినడాని కిష్టపడరు. వెళ్ళిపోతారు.

చెట్టంత మనిషి ఎదురుగా నిలబడి చెప్తేనే. వినిపించుకోని ప్రజ, ఆయన వ్రాసిన పుస్తకాన్ని చదువుతారా? చదువరు. అమెరికాలో, 'వంటకాలు_వాటికి కావల్సిన పరికరాలు' అన్న గ్రంధాన్ని ప్రచురించారుట. ఒక్క కాపీకూడా అమ్ముడు పోలేదుట. 'ప్రతి కన్య తెలుసుకోవల్సింది,' అన్న పేరుతో ఆ గ్రంథాన్ని విడుదల చేసేసరికి, కొన్ని వేల కాపీలు అమ్ముడు పోయిందిట.

వ్యక్తికీ — సమూహానికీ — అంతటి వ్యత్యాస ముంది. వ్యక్తినిగూర్చినదే సాహిత్యం. వ్యాధిపీడితమైన వొక పశువుని, గోసదనంలో చేర్చిన కధనం వింటాను, చదువుతాను. తెలుసుకుని, కళ్ళంట నీళ్ళెట్టుగుంటాను. అన్ని పశువుల్నీ సంరక్షించేటందుకు, పదమూడు వందల గోశాలలు పని చేస్తున్నాయి, ప్రస్తుతం ఆరవ ప్రణాళికలో, వీటి సంఖ్య పదిహేడు వందలు కాగలదు, ఇందుకు ప్రజలు సహకరించాలి, అంటే, ఉత్సాహపడను, విసుక్కుంటాను. ఇది వ్రాసినాయన అనామకు డవడమే నా కిష్టం, అనుకుంటాడు పాఠకుడు.

ఈ గ్రంధం, విద్యార్థుల నుద్దేశించి వ్రాసినా, దీని నెక్కడా పాఠ్యగ్రంథంగా పెట్టారనుకోను. లైబ్రరీలకీ, పంచాయితీ సమితులకీ, డెవలప్‌మెంట్ బ్లాక్‌లకీ, ఈ గ్రంధాలని పంపుతారు. సామాన్య మానవుణ్ణి వుద్దేశించి వ్రాసిన ఈ పుస్తకాన్ని సామాన్య మానవుడు చదువడు. అతనికి చదవడం రాదు. గ్రామంలో చదవనేర్చిన యువకులు, నలుగుర్నీ పోగుచేసి, ఈ పుస్తకంలో భాగాలు చదివి వినిపించాలి — కాని అల్లా జరుగుతోందనుకోను. దిగ్భ్రమ కలగ చేసే సంగతు లుంటాయి ఈ గ్రంధాలలో. "దేశ జనాభా ఏడాదికి 80 లక్షలకు పైగా పెరుగుతూ వున్నదని తేలింది." నేటి కధలలో, నవలల్లో పుట్టుకొస్తూవున్న జనాభా కలిపితే, జనాభా మరెంతగా పెరిగిపోతూవుందో, మన సాహితీ విమర్శకులు అంచనా వేస్తే బాగుండును.

"ఈ నవల మధ్యలో లక్ష్మి చనిపోయిన ఘట్టం నమ్మతగిందిగా లేదు." అంటాడు విమర్శకుడు, కాని లక్ష్మి జీవించి వుండి, మోహన్‌ని పెండ్లాడితే, దేశ జనాభా పెరిగే సంగతిని వ్యాఖ్యానించడు.

ఈ వాక్యం చూడండి :

"నీరు నదులందు పుష్కలంగా వుంది. దీనిలో చాలాభాగం సముద్రాల పాలౌతున్నది. ప్రతి యేటా సముద్రాలలో కలిసిపోతున్న నీరు యెంతో తెలుసా ? ఈ నీటితో మన దేశమును 16 అంగుళాల లోతుకు ముంచివేయ వచ్చును."

నీరులేక పంటలు దెబ్బతింటున్నాయి. తిండిలేక జనం మలమల మాడుతున్నారు. నా గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఇందులో విషాదం వుంది.

"1950 సంవత్సరంలో, దేశంలో ఉత్పత్తిచేసిన గుడ్డనంతా మన జనాభా యావత్తుకూ సరిసమానంగా పంచే పక్షంలో తల వొకటికీ 9 గజములు మాత్రమే లభించేది. 1957 లో, తల వొకటికీ 17 గజముల గుడ్డ లభించింది." అంటాడు మన అనామక గ్రంధకర్త. అంటే బట్ట ఉత్పత్తి పెరిగిందన్నమాట. కాని 1950 లో అత్తగారు 9 గజాల




చీర ధరించి వుండవచ్చు. 1957 లో కోడలు 6 గజాల చీర కడుతోంది. ఆ మిగత 12 గజాలూ, 5 గజాలూకూడా దొరకనివారికి లభ్యమవాలన్న త్యాగ బుద్ధి చూపుతోంది కోడలు. దీని ఫలితంగా, అత్తగారి పోరు కాస్త తగ్గింది.

"ఓణి కనబడేలాగు, మరీ చిన్న చీర కట్టుకుని, షికార్లెల్లడం ఏంబాగుంటుందే?" అని అత్తగారంటుంది.

"అదేమిటం డత్తయ్యా. తల వొకటికీ మనకి దొరికేది 17 గజాలే. ఇది 5 గజాల చీర. మిగత 12 గజాలూ మీకే ఇస్తున్నానుగా," అంటుంది కోడలు.

"ఏమన్నావ్? నాకు 12 గజాల చీరా! నేను అంత లావుగా కనిపిస్తున్నానుటే! నా కిచ్చిన 17 గజాలూ వుండనే వుంది_ను వ్విచ్చే దేమిటి మహా."

"మీ కిచ్చినదాంట్లో 6 గజాలు దుప్పటిగా కప్పుకుంటున్నారు. మిగతాది పెట్టి స్టీల్ సామాను కొంటిరాయిరి, మీ అబ్బాయి డైనింగ్ టేబిల్ మీదికని." అన్న కోడలి సమాధానానికి పళ్ళు పటపట కొరకడంతో, హాస్యరసం తొణికిసలాడ్డం లేదంటూరా?

అనామక గ్రంథకర్త కొత్త విషయాలు చెప్తాడు. తూనికలు, కొలతల విషయం చూడండి. "ఈ మధ్య దేశమందు 1100 గ్రామాలు యెన్నిక చేయబడి, వానిలో వాడుకయందున్న తూనికలను, కొలతలను పరిశీలించడం జరిగింది. మొత్తంమీద 143 రకాల కొలమాన పద్ధతులు వాడుకలో నున్నట్లు తేలింది. దేశమందు 100 రకాల మణుగు తూకములు ప్రచారమందున్నవట!"

ఇన్ని రకాల తూకాలు వాడుతూ, వర్తకులు ప్రజల్ని మోసం చేసి ఆర్థిక మాంద్యానికి కారకులై, ధనికులు మరీ ధనికు లౌతున్నారన్న మార్క్సు సిద్ధాంతం లాంటిదాన్ని ప్రతిపాదించి మన గ్రంథ కర్త, ఆశ్చర్యం ప్రకటించాడు. అవుతే ఏంచెయ్యాలి? మెట్రిక్ (దశాంశ) పద్ధతిని ఎన్నుకొన్నాం. "దాదాపు 2000 సంవత్సరముల క్రిందట ఒక భారతీయ గణిత శాస్త్రవేత్త 'సున్న' యొక్క విలువను కనుగొన్న విషయం మీకు తెలుసా? దశాంశ పద్ధతి దీని మీద ఆధారపడింది."

ఆ గణిత శాస్త్రవేత్త పేరు ఎందుకు చెప్పడానికి సంశయించాడో నాకు తెలియదు. తెలుసుకుందామని ప్రాచీన గణిత శాస్త్ర చరిత్ర చదివాను. క్రీ. పూ 200 సంవత్సరం నాటికే పింగళుని 'చందా సూత్రం' లో 'సున్న' వాడుకలో వున్నట్లు తెలుస్తుంది. పాఠకుడిలో పరిశోధనాతృష్ణ రేకెత్తించే టట్లు చేస్తాడు మనగ్రంథకర్త.

దేశంగురించి నాకు తెలుసుకోవాలని లేదు. మన ఆంధ్రదేశంగురించి చెప్పండి, వింటాను — అని మీలో కొంద రంటారని నాకు తెలుసు. ఇంతవరకూ కేంద్ర సమాచారశాఖవారు ప్రచురించిన పుస్తకంలో భాగాలు ఉదహరించాను. ఇప్పుడు మన తెలుగుదేశం గురించి అనామక గ్రంథకర్తల పుస్తకంలో విషయాన్ని పరిచయం చేస్తాను.

నేడు పెద్దపుస్తకాలని చదివే వోపిగా లేదు, తీరికాలేదు. అందుకే వీరు చిన్ని పుస్తకాలను వ్రాస్తారు. ఏ చిన్నిపొత్తమూ నలభై పుటలు మించదు. బస్సుస్టాండ్‌లో క్యూలో నిలబడ్డప్పుడు, చదివేటందుకు అనువైన చిన్ని కరపత్రంలో వారు చెప్పదల్చిందంతా చెప్పివెయ్యగల సంక్షిప్త శక్తులు వీరిలో వున్నాయి. మరొక విశేషం. వెనక నే నొక పుస్తకము వ్రాసి అచ్చువేయించాను. తీరా చేతికొచ్చాక, దాన్నిండా అచ్చుతప్పులే. ఇట్లాంటప్పుడు, పుస్తకం చివరలో 'తప్పొప్పుల పట్టిక జతపరచడం ఆచారముగా వుండేది. నా పుస్తకాన్ని వొక ప్రముఖవ్యక్తికి ఇవ్వాల్సి వొచ్చింది. సిగ్గుపడ్డాను. ఇన్ని అచ్చుతప్పుల పుస్తకాన్ని ఎల్లా గివ్వను? అందుచేత పుస్తకము చివరలో "ఈ పుస్తకంలో, ఫలానా పుటలలో ఫలానావాక్యాలు వొప్పులు," అని వ్రాసి పంపించాల్సి వొచ్చింది. మన గ్రంథకర్తల గ్రంధాలలో మెచ్చుకోతగ్గ విషయం, వొక్క అచ్చుతప్పుకూడా దొర్లకపోవడం. మరొకటి—వీరిది అద్భుతమైన శైలి. ఉద్రేకం, ఉద్వేగం, భావనాపటిమ, ఈశైలి ప్రధానలక్షణాలు.

"విశ్వసృష్టికీ, మానవజీవితానికి, సర్వానికీ సత్యాహింసలు కూకటివేళ్ళు."

"మన స్వాతంత్రోద్యమం, నిజానికి క్రమంగా ఇతరదేశాలకుకూడా వ్యాపించే వొకానొక సువిశాలసాంస్కృతిక ప్రాభ






వము అని చెప్పాలి. బహుశః ఇక వ్రాయ మన్న విశ్వచరిత్రకు మన నేటి దేశ చరిత్ర పీఠికేమో నని తోస్తుంది."

మన గ్రంధకర్త, కవిత్వంలో పడి పోతాడు. అతన్ని ఎవ్వరూ ఆపలేరు.

"అబద్ధమాడని భారతావని ప్రజానీకాన్ని చూసి విదేశీయ యాత్రికులు విస్తుపోయారు—సత్యమే మానవరూపాన్ని ధరించి, భారతదేశంలో అవతరించిందా అన్నట్లు! దేశమంటే ఎలా మట్టి మాత్రమే కాదో, అలాగే ప్రజలంటే కేవలం రక్తమాంసాలు మాత్రమేకాదు. ప్రపంచాన్నే వొకానొక పరమ ఆశ్చర్యమయ విచిత్ర చిత్రంగా ఏ పరిపూర్ణశక్తి చిత్రిస్తోందో. ఆ సంపూర్ణ జ్ఞానమయ శక్తియే కోటానుకోట్ల ప్రజలగుండెల్లోనూ గుడి కట్టుకుని ప్రతిష్ఠాపితమై వుంది. అదే ప్రజల్లో జీవశక్తి."

ఇది సాహిత్యం కాదని ఎల్లా అనుకోను?

మన ప్రజకి పురాణగాధలంటే ఇష్టం. ఈ పుస్తకాలలో ఆ ప్రసక్తి లేదనుకోకండి. ఇది చూడండి:

"న్యాయాన్యాయ నిర్ణయంలో మన ప్రజల వివేకం కనిపిస్తూనే వుంటుంది. అలాగే మంచిచెడుల విషయంలో. శ్రీరాముని, దశరధుడు వనవాసానికి పంపటము ప్రజలు హర్షించలేదు. పంపవద్దని వాదించారు. శ్రీరాముని రథచక్రాలకు అడ్డుపడ్డారు. అది కేవలం ఒకవ్యక్తిపై

వుండే ఏదో స్వంత మోజుకాదు. ఆదార్శల పట్ల సామాన్యప్రజలకు సైతం వున్న అచంచల భక్తిశ్రద్ధలకు అది సజీవ తార్కాణం. చిత్ర మేమిటంటే, ప్రజలు అ..డుకూడా తమ అభిప్రాయాలని ప్రకటించుకోడానికి వెనుకాడలేదు, ఒక ఉదాహరణ — నలుడు, ధర్మరాజులా నష్టదాయకమైన జూదం ఆడుతున్నప్పుడు దమయంతి ఎంతచెప్పినా వినడు. చివరికి, ప్రజలు రాజభవనంలో ప్రవేశించి, నలుడిని వాదిస్తారు. రాజ్యాన్ని పణంగా పెట్టి, జూదమాడకూడదని హెచ్చరిస్తారు. నలుడు వినలేదనుకోండి. అది వేరేసంగతి."

చప్పట్లు కొట్టబుద్దేస్తుంది. అయ్యారే! భేష్! — అనబుద్ధేస్తుంది. మధ్యమధ్య మనగ్రంధకర్త చక్కటి సూక్తులు విసురుతాడు. మచ్చుకి —

"ప్రజలపై ప్రభుత్వం కేవలం కర్రపెత్తనం, నిరంకుశాధికారం ఎలా చెలాయించకూడదో, అలాగే ప్రజలూ ప్రభుత్వానికి పరాధీనులై వుండకూడదు."

బాగుందినాయనా, చక్కగాచెప్పావు. అక్కడక్కడ జాతీయాలు, సామెతలు, కనబడతాయి. "విద్యలేనివాడు వింత పశువు." "అప్పుతో పుట్టి, అప్పుతోనే జీవించి, అప్పుతోనే మరణించేవాడు— వెనకటి భారతీయ కర్షకుడు" — "ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్."

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌర సంబంధశాఖ ప్రచురించే ఈ గ్రంధాలలో చక్కటి చిత్రా లుంటాయి, "అవిద్యపై యుద్ధం" అన్న పుస్తకంపై వున్న చిత్రం ప్రశంసనీయమైంది. అవిద్యని సూచిస్తూ, మూడు వేలుముద్రలు, దాని నిర్మూలనికి అవసరమైన పరికరాలు — కత్తులు, కలం —" ఈ వేలుముద్రల చుట్టూ చిత్రించబడ్డాయి. గొప్పభావం, గొప్ప చిత్రం.

అంతమాత్రంచేత, ఏ లోపమూలేని ఉత్తమ కళాఖండాలనడం లేదు, వీటిని. మనకి నచ్చని, వొకటి రెండింటిని మాత్రం చెప్తాను. ఒకటి, మన గ్రంధకర్త, ప్రగల్భాలు పలుకుతాడు. గొప్పలు చెప్తాడు. బడాయి చూపుతాడు. తనపేరుకూడా చెప్పుకొని స్వార్ధరహితుడైన ఈ రచయిత, నమ్రత విడనాడడం శోచనీయం.

"1960-61 సంవత్సరంలో మొత్తం 20 అంశాల్లోనూ 15 ఆంశాల విషయంలో పెట్టుకున్న లక్ష్యాలను మించి కృషిచేసినై పంచాయతీ సమితులు." అని మొదలెట్టి — "సమితులు 1103 ఆయిల్ ఇంజన్లను రైతులకు సప్లై చేసినై. 4117 పంటబావులు కొత్తగా నిర్మించబడినై. 243 పంపుసెట్లు సరఫరా చేయబడినై. 23769 ఎకరాల భూమి అదనంగా సాగులోకి తేబడింది...14 లక్షల పశువులు చికిత్సపొందినై ...ప్రజా




రోగ్య కేంద్రాల్లో 30 లక్షల మంది, గ్రామీణ డిస్పెన్సరీల్లో 34.3 లక్షల మంది చికిత్స పొందారు...అన్ని మండలాల్లోనూ 20192 మామూలు పాఠశాలలు, 3616 బేసిక్ విధానపు పాఠశాలలూ పనిచేస్తున్నయ్. 2811 వయోజన విద్యా కేంద్రాలు ప్రారంభించబడినై. 2615 పఠన మందిరాలు ప్రారంభించబడినై."

ఇవన్నీ నిజమై వుండొచ్చు. కాని ఇదంతా బడాయిగా కనబడక మానదు. 2615 పఠన కేంద్రాలలో, వొక్కచోటైనా, ఈ రచయిత వెలువరించిన గ్రంథాన్ని చదవడం జరుగుతోందా — అనే, నా గోల. 26 వంతెనలు కట్టారంటాడు. ఇందులో ఎన్ని కూలాయి, ఎన్ని వున్నాయో చెప్పడు. నాలుగు లైబ్రరీ భవనాలకి శంఖుస్థాపన జరిగిందంటాడు. అవి పూర్తి అయిన సంగతి చెప్పడు. ఏ ప్రోజెక్టు నిర్మాణానికో రెండు కోట్లు కేటాయించారంటాడు. ఈ డబ్బు సద్వినియోగమై, ఆ ప్రాజెక్టు ఫలించిందని చెప్పడు. ఇదే నమ్రత లేకపోవడం అంటే. మరొక పొరబాటు చేస్తాడు మన గ్రంథకర్త. అంకెలతో హడలగొడతాడు. అంకెలను పొందుపర్చడం అంటే మహాసరదా. అదొక కేళీవిహారం. అంకెల జగత్తులో చైతన్యం గోల్పోయి స్థూల జగత్తుకి అతీతుడై, ఆనందానుభూతి పొందుతాడు. "1960 లో ఆంధ్ర రాష్ట్రంలోని పారిశ్రామిక వివాదాలు 67 మాత్రమే. అదే కాలంలో కేరళ రాష్ట్రంలో 241, మద్రాసు రాష్ట్రంలో 210, మైసూరులో 80 వివాదాలు వున్నాయి."

దేశంలో ఇతర ప్రాంతాలూ, పాశ్చాత్య దేశాలూ, వీటిలో పారిశ్రామిక వివాదాల భోగట్టా ఇవ్వకుండా, ఈ నాలుగు రాష్ట్రాలతోనూ నిలిపివేసి, నిగ్రహం చూపి, స్థితప్రజ్ఞు డయ్యాడు

మన గ్రంథకర్త – అభినందించాలి. ఇందులో గుణపాఠం లేకపోలేదు. మిల్లు యజమానిని చావదన్ని, ఆయన కూతుర్ని లేవదీసుకుపోయిన పారిశ్రామికుడూ, ధనికవర్గాలని దుయ్యబట్టే కార్మికుడూ, నవలల్లో, నాటకాల్లో అభిమానపాత్రలుగా అవతరింపచేస్తున్న రచయితలు గమనించదగ్గ విశేషం. ఆంధ్రలో పారిశ్రామిక వివాదాలు చాలా తక్కువ – అన్నది.

మన గ్రంథకర్తలో మనం హర్షించలేని మరోలక్షణం – అస్తమానూ, "ప్రజలు సహకరించాలి" అంటూ వుండడం. "ఈ పథకం అమలు పరచడంలో చేయూత యివ్వాలి." ఇది ఈ రచయిత మకుటం. "ప్రొద్దుటే లేపనన్ను; ఎనిమిదిలోగా కోళ్ళ పెంపకం గూర్చిన పుస్తకం పూర్తి చెయ్యాలి." అవడంబదులు, భార్యతో – "తెల్లారగట్టే లేపడంలో, నాతో నువ్వు సహకరించాలి." అంటే నే నాశ్చర్యపడను. ఏవిధంగా సహకరించాలో చెప్పడు. అసలు, ఎవరిని ఉద్దేశించి ఈమాటలంటున్నదో కూడా స్పష్టంగా తెలియదు.

"మహిళను సభ్యురాండ్రుగా చేర్పించడానికి ప్రత్యేక కృషి జరగాలి." ఇది, ఎవరితో చెప్తున్నట్టు? గ్రామీణ స్త్రీలా? ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలా? సహకార సంఘాలలోవారా? పాఠకులా? ఎవరు? బ్రహ్మదేవుడికి తెలియాలి.

ఇట్లాంటివి ఒకటి రెండు విడిచేస్తే, ఈ అనామక గ్రంథకర్తల కృషివల్లనే, మన శ్రేయస్సుకోసం, ఏం జరిగిందో ముందు ఏం జరగబోతున్నదో తెలుసుకోడం సాధ్య మౌతోంది.

ఈ గ్రంథాలు నలుగురూ చదివేలాగు చెయ్యాలంటే, ఒకటి రెండు కొత్త పద్ధతులు యత్నించా లంటాను. ఫలానా ఊళ్ళో కొత్తగా పశువైద్యశాల పెట్టారంటాడనుకోండి మన గ్రంథకర్త. ఆ పుస్తకం అట్టమీద ఒక సినిమాతార ఫొటో వెయ్యాలి. లోపలిపుటలో "ఈ సినిమాతార పెంచుతున్న కుక్కపిల్లకి, ఈ పశువైద్యశాలలో చికిత్స జరిగింది" అని వ్రాయాలి. ఒక అడివి ప్రాంతాన్ని పునరుద్ధరించి అక్కడ ఒక టూరిస్ట్ హోటల్ పెడుతున్నట్లు మన రచయిత భోగట్టా యిస్తాడు. "ఈమధ్య ప్రఖ్యాత ఈతగాడు, మిహిర్ సేన్, ఈ అడివి ప్రాంతం సందర్శించి అక్కడిసరస్సులో ఈదాడు. అక్కడ హోటలు లేక నానా ఇబ్బందీ పడ్డాడు. ఇంక ఇప్పుడు ఆ ఇబ్బంది వుండదు.'' అన్న భోగట్టా జతపరచాలి. "ఫలానా చోట సైకిల్స్ తయారీ కర్మాగారం పెడుతున్నారు" అంటాడు; గ్రంథకర్త. గుజరాత్‌లో ఎన్ని కర్మాగారాలు పెట్టిందీ చెప్తాడు. "ఫలానా సినీనటుడు ఆమధ్య ఈ ప్రాంతం సందర్శించి, అక్కడ హోటల్లో గడిపాడు. అతని కొడుకు

అక్కడే సైకిల్ తొక్కడం నేర్చుకున్నాడు," అనొచ్చు.

ఏ నదిమీదనో, వరదలు అరికట్టే నిమిత్తం వొక ఆనకట్ట కట్టాలని ఏడవ ప్రణాళికలో ఇన్ని కోట్లు కేటాయించారు, అంటాడు రచయిత. "ఈ ప్రాంతంలో వరదలకి తోడు, వర్షాలు కూడా జాస్తి. గంటలో ఇన్ని అంగుళాల వర్షం కురుస్తుంది. కాబట్టి, వర్షపు నీళ్ళలో మునిగిపోకుండా, అక్కడి గ్రామీణులు, నదిలోకి దూకుతారు. ఆ నదిలో కొట్టుకుపోకుండా ఈ ఆనకట్ట," అనొచ్చు.

మరొకచోట మొహంలో వొంకరలు సాఫీచేసే శస్త్రచికిత్సాలయం పెడుతున్నప్పుడు, స్థూలకాయుడి మొహాన్ని చిత్రించి, "ఈ మొహం చూస్తే, సంతాన నిరోధం ఎంత అవసరమో తెలుస్తుంది," అంటేనేం? మధ్య మధ్య జోక్‌లూ, కార్టూన్లూ, వుంచాలి. క్షుద్రలోకం మరమ్మత్తు భోగట్టాని రసవత్తరంగా, వినోదకరంగా రూపొందించవచ్చు.

ఇవన్నీ చేసినా, ఈ గ్రంథాల ప్రజామోదం పొందడానికి చాలాకాలం పడుతుందనుకుంటాను. దీనికీ కారణం ఊహించగల్ను. రెండువందల సంవత్సరాలు, పర ప్రభుత్వానికి అలవాటుపడి వున్నాము. ప్రభుత్వం ఏపని తలపెట్టినా అది మనకి హానికరమైనదే నన్న అభిప్రాయం, మన స్తత్వం, మనవారిలో స్థిరపడిపోయినాయి. ప్రభుత్వం వేరు ప్రజ వేరు. వీరి మేలు వారు కోరరు. అన్న భావం. స్వతంత్రం వొచ్చాక మన ప్రజాప్రతినిధులే పాలకులయ్యారు. ఎన్నెన్నో మంచి పనులు చేస్తున్నారు. అయినాకూడా, పాలకులపట్ల, వెనక వుండిన అలక్ష్యభావం - అధికారుల పట్ల వుండిన నిరసనభావం - పూర్తిగా తొలిగిపోలేదు-ముఖ్యంగా పల్లెప్రజల్లో వారు చదువు లేనివారైనందున, జరిగిన మార్పు ప్రాబల్యం వెంటనే గ్రహించలేకపోతున్నారు. ప్రతిదీ ప్రభుత్వం చెయ్యాలి- నాకెందుకూ?- అన్న భావం వొకటి మనవారిలో వుండిపోయింది. అందుకనే మన అనామక గ్రంథకర్త "ప్రజలు సహకరించాలి మొర్రో!" అంటాడు.

మరో కారణం, ప్రభుత్వానికి, రక్త మాంసా లున్న స్వరూపం లేకపోవడం అనాదిగా రాజే పాలకుడు. రాజు, వొక వ్యక్తి-రక్తమాంసాలు గల వ్యక్తి. అతన్ని ఆరాధించడానికి అలవాటుపడ్డాం. అల్లాగే స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవారు వ్యక్తులు. వారిని ఆరాధిస్తాం. తర్వాత తర్వాత పాలకులైన వ్యక్తులు ప్రజా ప్రతినిధులు- ఒక ప్రాంతాన్నుండి వొచ్చిన ప్రతినిధి. వారికి సలహా ఇచ్చేవారు, పౌరశాఖ ఉద్యోగులు, సివిల్ సర్వెంట్స్, వీరి శిక్షణ, బ్రిటిష్ సివిల్ సర్వీస్ పద్ధతులపై

జరిగింది. వీరికి ప్రత్యేకమైన వ్యక్తిత్వం వుండకపోవడం, ఉన్నదాన్ని పైకి కనబరచకపోవడం ఒక సంప్రదాయమైంది. వారు ఏ అభిప్రాయాన్నీ వెలిబుచ్చకూడదు. ఒక పనికోసం, జమాఖర్చు వెయ్యగలరు గాని, ఆ నిపని మంచిదా, చెడ్డదా అన్న విలువ కట్టలేరు–కట్టకూడదు. ఉదాహరణకి — కన్యాకుమారి వద్ద సూర్యోదయం, చూడవల్సిన దృశ్యం అంటారు. ఈ దృశ్యం నిదానంగా చూడాలంటే, యాత్రీకులకు వొక ఎత్తైన వేదిక, అనువైన చోటున నిర్మాణం చెయ్యాలన్న నిర్ణయం జరిగిందనుకోండి. ఇందుకు, ఏ స్థలం బాగుంటుందో నిర్ణయించే భూమిపరిశోధకుల సంఘాన్ని నియమిస్తారు. తర్వాత, వేదిక పథకం తయారు చేస్తారు. ఎంత ఖర్చవుతుందో అంచనా వేస్తారు. పని వాండ్రని రప్పిస్తారు. ఉద్యోగి ఇవన్నీ జేస్తాడు – కాని, సూర్యోదయం అందమైన దృశ్యమో, కాదో చెప్పడు.

"ఏమయ్యా, ఈ వేదిక దేనికి?"

"నాకు తెలియదు. సెక్రటరీ కట్టమన్నాడు, కడుతున్నాం. కచ్ ప్రాంతంలో వొకటి కడుతున్నాం. గోవాలో రెండింటిని కట్టడానికి, ఎనిమిదవ ప్రణాళికలో, రెండుకోట్లు కేటాయించబడింది. జిబ్రాల్టర్‌లో..." "సూర్యోదయం ఈ వేదికనుండి బాగా కనబరుతుందా?"

"ఆప్రశ్న లోక్ సభలో అడగండి. వేదిక ఎత్తు నూట పదిహే నడుగులు. వెడల్పు మూడు వొందలు..."

"ఆగండి. సూర్యోదయం, అందంగా వుంటుందా? మీరు చూశారా?"

"మాకు టైము లేదు. పదహారో తేదీని, మంత్రిగారు, ప్రారంభోత్సవం జరుపుతారు. ఆనాటికి పూర్తవాలి. ఇవన్నీ చూసే టైములేదు మాకు. పైగా సూర్యోదయం మెచ్చుకుంటూ, కావ్యం వ్రాయడానికి, ఏ కవుల్ని పిలవాలో నిర్ణయించే వొక కమిటీని వేశాంగా."

అంటే ప్రజాసేవకులైన ప్రభుత్వోద్యోగి, వ్యక్తిగతమైన ఉద్రేకానికి లోనవక నిష్పాక్షికంగా వుండాలన్న సంప్రదాయం — వొకటి ఏర్పడిపోయింది. ఇది కొంతవరకు అవసరం కూడా. కాని బ్రిటీష్ ప్రభువులు నెలకొల్పిన ఈ మన స్తత్వం, పరదేశ పాలనకు అవసరం కావొచ్చు — స్వదేశ పాలనలో అంత తూ చా తప్పకుండా అమలు జరపనక్కర్లేదేమో.

ఈ మన స్తత్వం, చిహ్నమే అనామక గ్రంథకర్తలు తయారుచేసే పుస్తకాలు. గ్రంథకర్తకి పేరులేదు. ప్రజాప్రతినిధి చెప్పినదాన్ని అమలు జరపడమే అతని విధి. ఉద్రేకంలేదు, మంచిచెడ్డల ప్రశంసలేదు, బాగోగుల ప్రస్తావన లేదు, అంకెలగారడీ — అంతా. పాఠకుడికి కావల్సింది, అంకెలు కాదు; నిమిషానికి గుండె ఎన్నిమార్లు కొట్టుకుంటుందో




కంటే, గుండె కొట్టుకున్న చప్పుడు వినబడితేనే సాహిత్యం.

మరి ఈ గ్రంథకర్తలు ఏంచెయ్యాలి?

ఒక అనామక రచయితల సంఘంగా ఏర్పడాలి. ఏటేటా, వారి గ్రంథాలప్రదర్శనలు జరపాలి. సమావేశాలు ఏర్పరిచి, వారి రచనలు చదివి వినిపించి వ్యాఖ్యానించాలి. ఉత్తమ మైనవాటికి ప్రభుత్వం కాక, ప్రజలలో పెద్దలు ఎవార్డులివ్వాలి. పోటీలు, పరీక్షలు పెట్టి ఈ పుస్తకాలలోని పరిజ్ఞానాన్ని బాగా గ్రహించినవారికి బహుమతు లివ్వాలి.

ఈ సూచనలన్నీ నా అజ్ఞానానికి నిదర్శనాలేమో! పాతకాలపు కళాకారుడు అనామకుడుగా వుండిపోవడానికి ఇష్టపడేవాడు. ఏ శిల్పంపైనా, ఏ చిత్రంపైనా, తనపేరు వ్రాసుగున్నట్టు లేదు. మహాకవి — ఈ కావ్యం నేను వ్రాశా ననడు — భగవంతుడే నాచేత వ్రాయించా డంటాడు. రచయిత ఏకాంత జీవి — కాని అతనికి మనుషులు కావాలి. కాసేపు వారినడుమ వుండి, పరిశీలించి, నవ్వుకుని, మళ్ళా ఏకాంతంలోకి జారిపోతాడు. మనుషుల్లో వున్నప్పుడు, అహం, వ్యక్తిత్వం పెరుగుతుంది. దూరంగా వెళ్ళి, ఒంటిగా వుండి, తపస్సులో పడినప్పుడు, తన వ్యక్తిత్వం, జారిపోతుంది. 'అహం' గోడలు పడిపోతాయి. ప్రత్యేకాత్మ జీవాత్మలో కలిసిపోతుంది. అప్పుడు, 'నేను' అన్నది లేదు. గ్రంథకర్తకి పేరుండదు. వ్యక్తిత్వాన్ని జయించుకుంటూ వొచ్చి, చివరికి ఓడించి, నశింపు చెయ్యడమే కళాకారుడి పురోగమన రహస్యం — అనుకోడంకూడా అజ్ఞానమేనేమో!

# సంధ్యారాల్చిన ఎర్రరేఖలు

...మరో విధంగా ఆలోచిస్తే మనిషి అల్పసంతోషికూడాను - కాకపోతే నేను. మనిషి ఆశలు, ఆశయాలు ఎంత అనంతమై వున్నప్పటికీ ఒక్కొక్కసారి సంతృప్తి అన్నది అంత అల్పమైకూడా వుంటుంది. ఈ విషయమై ఎవరూ నాతో ఏకీభవించకపోయినా ఇది నా గట్టి నమ్మకం, నా అనుభవం. కాలి నడక నుండి, రాకెట్ యానం వరకు ఎక్కడికక్కడే సంతృప్తి జెందుతూ వచ్చింది ఈ మానవ జాతి. అయితే ఒక అల్పమైన సంతోషాన్ని కథా వస్తువుగా ఎంచుకొని కథ సాగించిన - ఈ కథలో నాయకుని పట్ల పాఠకులకు ఒక బలహీనమైన అభిప్రాయం ఏర్పడినా ఏర్పడవచ్చును. అయినా ఈ కథను నేను చెప్పుకుపోతాను.

కాలేజీలో ఏదో సందర్భంలో అనూరాధ స్టేజి ఎక్కి పాట పాడింది. నిజం చెప్పాలీ అంటే ఆ రోజునే మొదటి సారిగా ఆమె అందం గూర్చిన అభిప్రాయం నాలో కలిగింది. సన్నగా, పొడుగ్గా - మైక్ ముందు నాజూకుగా నిలుచుని పాట పాడుతున్న అనూరాధ గొంతూ శ్రావ్యతా మాట అటుంచి ఆమె వదనం, ఆ వర్చస్సు దీపకాంతిలో మరింతగా నన్ను ఆకట్టుకున్నాయి. ఎడంపక్కగా పాపిడి తీసి దువ్వబడిన జుత్తు మెడ కుడిభాగంనుండి వదులుగా, గుబురుగా ముందుకు విడువబడింది. చెవులకు సన్నిటి బంగారు పూసల రింగులు - పెద్దవి. కళ్ళల్లో అస్పష్టంగా మెరిసి ఒక మెరుపు పాట పాడుతూన్నప్పుడు హార్మోనియం మెట్లలా పైకీ, క్రిందికీ కదలాడుతున్న పెదవులు - ఆ పెదాలమీద ఎక్కడో తుషారబిందువుల వంటి తడి వుండి వుండి తలుక్కుమంటోంది. అదే నా ఆకర్షణ. అక్కడే నా దృష్టి కేంద్రీకరించు. ఒకటి రెండుసార్లు గాలికి రేగి, ముఖాన అడ్డుపడిన తల వెంట్రుకలను ఎడంచేతితో ఒత్తిగించింది.

నా ప్రక్కగా నిలుచునివున్న మిత్రుడు విశ్వం చెప్పాడు - అనూరాధ అన్నయ్య ఒక యింజనీయరుట. వాళ్ళు ఈ ఏడే ట్రాన్స్‌ఫర్ మీద హైదరాబాద్‌నుండి ఈ వూరు వచ్చారుట.

మర్నాడు సాయంత్రం కాలేజీ సైన్సు బ్లాక్ వరండా తాలూకు స్థంభం అని మరో అమ్మాయితో సంభాషణ కొనసాగిస్తున్న అనూరాధను గమనించాను. మెడలో హారం తాలూకు లాకట్ను-పళ్ళ మధ్య యిమిడ్చింది. పలుచని పెదాలు లాకెట్ చల్లదనాన్ని చప్పరిస్తున్నాయి.

ఆదుర్తి హరినాథ్



పెదవులలో "బ్రతుకు ఆలా కెట్ గా మార్చినా చాలు" — అన్నాను విశ్వంతో. విశ్వం నా భుజం మీద వేసిన చేతితో నన్ను మరింతగా అదిమాడు.

అందం గురించిన శ్లాఘనలో కూడ ఒక ఆనందం, సంతృప్తి వుంది. అనూరాధ సౌందర్యం గురించి, ఆమె అధరాలను చిత్రించడంలోవి సృష్టికర్త 'రసికత్వం' గురించి చాలా సేపు విశ్వానికి చెప్పుకుపోయాను. విశ్వం విచిత్రంగా చూశాడు. ఆ చూపు ఒక ఓదార్పులాంటిది; ఒక ప్రోత్సాహం లాంటిది.

"చాలా కష్టం, మంచి ఫామిలీ_ విశ్వం."

ఇట్టే ప్రక్కవాడిని అపార్థం చేసుకోగల మనస్తత్వాన్ని మాత్రం అనాదిగా

పక్కగా వెళ్తున్న విశ్వం, నేనూ క్షణం ఆగాము. ఆమె పెదాలు జారి లాకెట్ వక్షంమీద పడింది. ఓరగా చూచి కొంచంగా పెదవులను కదిపింది. గాలి తాకిడికి కదిలిన మబ్బుల్లాంటి పెదవులు, సంధ్య జారవేసిన ఎర్రదనం రాలి ఆ

ఈ లోకం కాపాడుకుంటూనే వస్తోంది. ఇంతలోనే వికసించిన పుష్పాలవంటి ఏవేవో ఆలోచనలు. మళ్ళీ విశ్వం ప్రశ్న:

"ఏం, కథ నడిపిస్తావా ఏమిటి?"

తరువాత అక్కడా, అక్కడా అనూరాధ పెదాలను సందర్శించే భాగ్యం నాకు లభిస్తూనే వచ్చింది. అనూరాధ సౌందర్యం అదొక నదీప్రవాహం — ఊటీ చల్లదనం — సంపెంగల సౌరభం — ముఖ్యంగా ఆ పెదవుల ఎర్రదనం, ఆ ఒంపూ. నా ఆంతర్యంలో ఆ అనుభూతి ఒక అమృత ప్రవాహం. ఆ ప్రవాహా నికి నా పట్ల నాకు వున్న 'మంచితనం' ఒక ఆనకట్ట. అవకాశం చిక్కినప్పు డల్లా ఆ ప్రవాహం బలంగా ఈ ఆనక ట్టను ఢీకొడుతూ వుండేది. విశ్వం ఆ బలమైన వూపుకు భాష్యం చెపుతూవుండే వాడు.

బ్రతుకును గురించిన అనేకమైన భయంకర చీకటి తెరలమీద ఈ సౌంద ర్యోపాసనా, సౌందర్యాన్వేషణా ఒక బల హీనపు వెలుగు కాంతి.

అయితే ప్రతి సమస్యకు పరిష్కారం కోసం తపించిపోయే మనస్తత్వం కాదు నాది. పరిష్కారమన్నది అలా, అలా అప్రయత్నంగా చేతికి చిక్కవలసినదే. పైగా, ఎందుకనోగాని అదృష్టమన్నది అదేదో నా చేతి కందని వస్తువని నా భ్రమ.

ఆరోజు అమ్మ నాతో చెప్తూన్న మాటలు వింటూన్నప్పుడు నాలోని ఈ భ్రమ కాస్తా మంచుగడ్డలా కరిగి పోయింది. అమ్మమాటలు నా కోర్కెల మిత్రులమీద వర్షపు చినుకులై రాలాయి.

"ఆ అమ్మాయి మీ కాలేజీలోనే చదువుతోందిట. అన్నా, చెల్లెలు — ఏ గొడవా వుండదు. అందుకే యిహ నీతో కూడ అనందే ఆ కాస్తమాట యిచ్చే శాను."

సాయంత్రం విశ్వానికి ఆ విషయం అంతవరకు చెప్పేసరికి ఆత్రంగా ప్రశ్నించాడు.

"ఇంతకీ నువ్వు చెప్పేది ఏ విష యంరా," అంటూ.

"మా యింట్లో అద్దెకివ్వ దలచుకున్న ఆ ప్రక్కభాగం విషయమై."

అయినా పరవాలేదు. విశ్వం నాకన్నా మిత సంతోషి. పార్టీ కావాలన్నాడు. ఇద్దరం సినీమాకు వెళ్ళాం.

మాయింటి వీధి వరండాని అంటి పెట్టుకునివున్న ఎడంవైపు భాగంలో అనూరాధ, ఆమె అన్నయ్యా అద్దెకు దిగారు. ఇట్లా అనూరాధ మాయింట్లో మసలడం ప్రారంభమయ్యాక నాలోని ఒకేఒక ఆశ—అది మరింతగా ప్రబలంగా రూపొంద సాగింది — ఆ అరుణవర్ణ అధరాలు, ఆ సుధారసాన్ని చిలికే పెదవులు.

అనూరాధ చాలా కలిసికట్టుగా మసలే వ్యక్తి. ఈనాడు సంఘంలో నాగ




రికతకు ముఖ్యకొలతబద్ద. అతిగా, దగ్గరిసా మాట్లాడడం అందుకు అనూరాధ నాగరికతా సంస్కారాల ప్రతిరూపంగా చెప్పుకోవచ్చును. పోతే, యిహ ఆమె శ్రద్ధగా చదువుకునే బుద్ధిమంతురాలు. అమ్మవద్ద ఎంతో వినయంగా, కావలసిన వ్యక్తిలా కాలాన్ని గడిపేది. నాతో ఎన్నో విషయాలలో వాదనకు వుపక్రమించేది. కో-ఎడ్యుకేషన్, ఆడదాని ఆంతర్యం, స్త్రీల హక్కులు, ఎన్నో. వాళ్ళ పెద్దన్నయ్య రాంచీలో వుద్యోగం, చిన్నన్నయ్య చిన్నతనంలో ఎవరో క్రిష్టియన్ అమ్మాయిని ప్రేమించడం, ఆమెతలిదండ్రులు ఆమె చిన్నతనంలోనే మరణించటం అన్నీ చెప్పుకుపోతూ వుండేది. ఆమె ధోరణి అదొక జల ప్రవాహం. ఆ జలప్రవాహంలో పొంగే అలలు ఆమె పెదాలు.

రోజులు గడిచిపోతూవుంటే ఆమె మరీ దగ్గరయింది – తనకు అర్థంకాని పాఠాలు నన్ను అడిగి తెలుసుకుంటూ వుండేది. ఎప్పుడైనా నేను ఆమెకు నచ్చకపోయినట్లయితే "పోవోయ్ లైయర్!" అంటూవుండేది.

విశ్వం మాత్రం "అయితే పాఠాలు నేర్పుతున్నావన్న మాట" అంటూ ఛలోక్తి విసురుతూవుండేవాడు.

ఆరోజు ఏప్రియల్ ఫస్టు. బాగా

ప్రొద్దుటే విశ్వం రూమ్‌కు వెళ్ళవలసి వచ్చి–రాత్రి చీకటిపడేవరకు అక్కడే వుండిపోవలసివచ్చింది. విశ్వం నాకో ప్రోత్సాహమని చెప్పాను గా! నన్ను పూర్తిగా కదిపి వదిలిపెట్టాడు–ఆడది నోరు తెరుచుకొని ఏ విషయం అడగ లేదంటాడు. నీకు కాకపోతే యింకెవరికి ఆ అవకాశం? అంటాడు. రాత్రి ఎనిమిది గంటల వేళ యింటి కేతెంచి, భోజనము చేసి, పుస్తకం తెరిచాను.

గభాలున, అనురాధ వచ్చి, నా ప్రక్కగా, గుమ్మం ముందు ప్రత్యక్షమయింది. ప్రొద్దుట నుండి నాగురించే తాను నిరీక్షిస్తూన్నట్లు వ్యక్తపరిచింది. దేనికని తల పైకెత్తి ఆమె వైపు చూచాను. చేతిలో వున్న పెన్నుతో ఆమె నామీద యింకు జిమ్మి– "ఏప్రిల్ ఫూల్"– అంటూ పరిగెత్తబోయింది. చటుక్కున లేచి ఆమె జడ పుచ్చుకొని మెడ వెనుకకు విరిచాను. క్షమించమన్నట్లు చనువుగా చూపులు, చూపుల భావాలను స్పష్టంగా వ్యక్తం చేస్తూ వణికే, ముద్దుగొలిపే, ఒదిగిన పెదవులు– విడిచిపెట్టాను. తలుపుకు అటువైపుగా జార్లపడి నిలబడింది. ఎదుటి తలుపుకు ఆనుకొని నేను, ఆమె కళ్ళ క్రిందివరకు చీకటితెర. ఆ తెర మీద తళుక్కుమని మెరిసే నక్షత్రాల వంటి రెండు కళ్ళు. క్రిందగా నా గది దీపపుకాంతి తృష్ణగా చేరి నిలిచిన అధర ద్వయం. క్షణం ఆమె వంక చూచి–

'అందం నీ సొత్తు' – అన్నాను.

సూటిగా చూచి, కళ్లు వాలేసింది.

'ముఖ్యంగా ఆ పెదవులు.

ఆమె మూతి తిప్పింది. పెదాలు ముడుచుకున్నాయి.

'ఒక్కసారి వాటిని స్పృశించ...

కోపంతో వణికే పెదాల్ని పంటితో కొరుకుతూ.

'ఛఫ్'

నల్లని మేఘాల వెనుక దాగిన వెలుతురు కిరణం.

—— ఆమె వెళ్ళిపోయింది.

రాత్రి విశ్వాన్ని మనసులో తిట్టుకోకుండా వుండలేకపోయాను. మనిషి తప్పించుకు తిరిగే మనస్తత్వం గలవాడు.

మర్నాడు ప్రొద్దుట వీధివరండాలో పడకకుర్చీలో కూర్చుని, జడను మూతి చూట్టూత చుట్టి పెదాలను భద్రంగా అందులో దాచుకుని, జడచివర చేతిలో పట్టుకుని ఎక్కడో ఆలోచిస్తోంది అనూరాధ. యిటుప్రక్కగా వున్న కుర్చీలో కూర్చుని వుండివుండి ఆమెవంక చూడసాగాను. నన్ను గమనించనట్లుగా చలించే చూపులు –

—— సాహసించాను.

'ఏమండీ!'

మాట్లాడదు.

'కోపమా?'




జడను విడిచింది. పెడాలను విడుదల చేసింది.

"మిమ్మల్ని చూస్తే నాకు రోత."

"ఆడది 'విజం చెప్పి బ్రతకలే దన్నారు."

"మీ తలకాయేమీ కాదూ."

గిరుక్కున లేచి గదిలోకి వెళ్ళిపోయి పెళ్ళున తలుపు పెట్టింది.

మబ్బును తొలగి బయట పడుతున్న చందమామ, చెట్ల ఆకుల జారి నేలను స్పృశిస్తున్న సూర్యకిరణాలు — ఆమె ముఖంలో ఎక్కడో చిరునవ్వు.

కొన్నిరకాల అపరాధాలను మనిషిలో ఏ మూలగానో ఎదిగే సంస్కారం, సభ్యత మన్నించక తప్పదు. అనూరాధ నన్ను మన్నించింది. మొదట్లో కొంచం ముభావంగా వున్నప్పటికీ, మళ్ళీ మామూలే. చదువు, వాద ప్రతివాదాలు, 'పో లైయర్' — అన్నీను.

పరీక్షలు ముగిసాయి. శలవ లిచ్చారు. అనూరాధ ఆరోజు నా ఎదురుగ్గా కూర్చుని శలవలలో త నేంచెయ్యబోయేది చెప్పుకు పోతోంది. ముందుగా పెద్దన్నయ్యా వాళ్ళవూరు వెళ్తుందిట — రేపేనట.

'మళ్ళీ ఎప్పుడొస్తావ్?' అన్నాను.

'శలవ లాఖరునే.'

"తరువాత ఏం చదవదలచుకున్నావ్? అన్నాను.

"ప్చ్" అంటూ పెదవి విరుపు. ఎప్పుడైతే అనూరాధ ముద్దుగా పెదవి విరిచిందో యిహ నే నేమీ మాట్లాడజాలని మూగివాడిని...

మర్నాడు వూరు ప్రయాణమయ్యే ముందు అనూరాధ పరధ్యాసగా ఆలోచిస్తూ, నన్ను వుద్దేశించి.

"నిన్ను చూస్తే నాకు జాలి."— అంది

'ఏం'

పెద్దగా నవ్వసాగింది.

"నిన్ను చూస్తే నాకు రోత," అన్నాను ఏమాత్రం చలించకుండా, చిలిపిగా నవ్వుతూ.

"పోవోయ్ లైయర్"— అంటూ ఆమె నా భుజాన్ని వెనుకకు నెట్టి, చెంగున పరుగెత్తింది.

ఆడపిల్ల చలాకీతనాన్ని గుర్రం పిల్లతో పోల్చి చూచుకున్న కవి ఒక మహానుభావుడు— మన స్తత్వవేత్త.

నన్ను చూస్తే జాలి అనూరాధకు. ఎందుకనోగాని ఏ విధంగానో ఆమె నన్ను అల్పుణ్ణి చేసినట్లుగా కొన్ని క్షణాలు మధనపడ్డాను. కాని చిలిపిగా నా భుజం నెట్టిన అనూరాధ నాదే. ఒక మధురమైన నిట్టూర్పు.

అనూరాధ వూరు వెళ్ళిపోయింది.

రోజులు గడిచిపోసాగాయి. మా పరీక్షఫలితాలు వచ్చాయి. నేను ఫస్టు క్లాసులో పాస్ అయ్యాను. విశ్వం తప్పాడు. అనూరాధ పరీక్ష ఒక పార్టు పోయిందని అనూరాధావాళ్ళ అన్నయ్య చెప్పాడు — మాకు ఆ విషయం ముందుగా తెలియ దనే అమాయకత్వంలో.

శలవులాఖరున అనూరాధ యింకా మా వూరు రాకముసుపే నేను 'మెడిసన్' చదువు నిమిత్తమై వైజాగ్ వెడలిపోయాను — తప్పదు.

కాలంతోనూ, వయస్సుతోనూ, పరిస్థితులనుబట్టి మనిషి కోర్కెలు, ఆశయాలు, అంతర్యం అన్నీ మారుతూ వుంటాయ్. గతంలోని సంఘటనల నెన్నిటినో మరిచిపోతూవుంటాం. కాని అనూరాధ అధరాలలో లీలగా నేను చూచిన వూహాలోకాలనుమాత్రం ఎప్పటికీ మరిచిపోలేను.

ఆరు నెలలు తిరిగేసరికల్లా విశ్వం నుండి ఒక విచిత్రమైన లేఖ వచ్చింది. అనూరాధకు వివాహం జరిగిపోయిందనీ, ఆమె భర్తతోబాటు హైదరాబాద్ తరలిపోయిందనీ, అనూరాధ అన్నయ్యకు మద్రాస్ ట్రాన్స్‌ఫర్ అయిందనీ — ఆ లేఖలోని ముఖ్యాంశములు.

హాస్టల్ రూమ్ కిటికీనుండి చూస్తే దూరంగా ఆకాశంలో అస్తమిస్తున్న అరుణబింబం — ఎవరివో ముడుచుకున్న ఎర్రటి పెదవులు.

అప్పటినుండి అనూరాధ పెదవులను ప్రపంచంలో నా కంటిముందు ప్రత్యక్షమయ్యే అనేకమైన సౌందర్యాలతోనూ, ఆకర్షణలతోనూ పోల్చి చూచుకుంటూ వుండేవాడిని.

కాలప్రవాహం ఆ దొక అనంత శక్తిస్వరూపం. ఇట్టే ఐదేండ్లు గడిచిపోయాయి.




ఆ రోజు మా యూనివర్సిటీ ప్రొఫెసర్ ఒకాయన కలకత్తా వెళ్తూవుంటే వీడ్కోలు యివ్వడానికిగాను స్టేషన్‌కు వెళ్ళి, తిరిగి వస్తూవుండగా హఠాత్తుగా వైటింగ్ రూమ్ గుమ్మంవద్ద అనూరాధ తటస్థ పడింది. ఒక్కర్తే వుంది. నన్ను చూపినదే తడవుగా పరిచయపూర్వకంగా నవ్వుతో పలుకరించింది.

వైటింగ్ రూమ్‌లో ఎదురెదుటి కుర్చీ లలో ఆశీనులమయ్యాం. ఆమె చెప్పింది —వాళ్ళ బంధువు పెళ్ళికని వాళ్ళు ఈ వూరు వచ్చారుట, తనూ, భర్తా—వారం రోజులయిందిట. యివ్వేళే తిరుగు ప్రయాణం. నేను యిక్కడ వుంటూ న్నట్లు ఆమెకు తెలియనందులకు ఎంత గానో నొచ్చుకుంది—భర్త యిప్పుడే పనిమీద బయటకు వెళ్ళారుట.

మేం మాట్లాడుతూ వుండగానే నాలు గైదేళ్ళ పిల్లవాడు, గదిలోకి వచ్చి, చేతిలోని బిస్కట్ల పేకట్‌తో అనురాధ కాళ్ళను పెనవేసుకున్నాడు. ఆ పిల్లవాడి భుజాలు పట్టి, నావైపు తిప్పి, అనూరాధ నన్ను ప్రశ్నించింది.

"ఈ అబ్బాయి ఎవరో చెప్పుకో చూద్దాం,'' అంటూ.

ఆ పిల్లవాడిని నా చేతులలోకి లాక్కొని, ముఖంలోకంట పరీక్షగా చూస్తూ—

"నువ్వే"— అన్నాను.

"నేనా !"

"వోఁ, అదే నుదురు, అదే ముక్కు, అవే కళ్ళు..."

"అవే పెదాలు ... కదండీ"—అంది.

కళ్ళు పైకెత్తి ఆమెవంక చూశాను. అవే పెదాలు—ఎక్కుపెట్టిన బాణం

లాంటి, ఎర్రని పెదాలు— యెదలో నాటి ప్రవాహంఒకవూపు, ఆమెవైపేనాచూపు.

"ఏమిటట్లా చూస్తావు."

ఏదో చెప్పబోయాను.

ఇంతలోనే ఆయన గదిలోకి ప్రవేశించారు. అనూరాధ ఆయనను నాకు పరిచయం చేసింది— తన భర్త అని. అనూరాధ భర్తే కాకపోయినట్లయితే ఆయన నన్ను ఏ విధంగానూ ఆకర్షించ గలిగివుండేవాడు కాదు. ముఖ్యంగా ఆ పెదాలు, మొరటుగా, సిగరెట్ పొగలకు మాడి, బీటలుపడి, గులాబి దళం రాలి, ఏ ముళ్ళమీదనో పడినట్లు నాలో ఒకబాధ.

ముగ్గురం చాలా విషయాలు మాట్లాడుకున్నాం. రైలు అరుదెంచే వేళ అయిందని అంతా ప్లాట్ ఫారం అంచును చేరుకున్నాం.

రైలు వచ్చింది. నేనూ కంపార్టుమెంట్ వరకు వెళ్ళాను — ఫస్టుక్లాస్.

అనూరాధ భర్త కంపార్టుమెంట్ లో సామాను సర్దిస్తున్నాడు. అనూరాధ నా ప్రక్కగా నిలుచుంది.

ఆమె పిల్లవాడి జుత్తు సరిచేస్తూ.

"అవునూ! మాబాబు మీకేమీ ముద్దు రావటంలేదా ఏమిటి? ఒకసారికూడా ముద్దుపెట్టుకోలేదు?"

చటుక్కున ఆమె కళ్ళల్లోకి చూచాను. ఎంత ఆత్మీయత గోచరించిం దని—

బాబును నారెండు చేతులతోను పైకంటా ఎత్తి బుగ్గమీద ముద్దుపెట్టాను. నా ఆశలు పండినట్లుగా బాబు పాలబుగ్గ ఎర్రగా కందింది.

గాభాలును అనూరాధ నా చేతులనుండి బాబూను తన చేతులలోకి తీసుకుని బాబు బుగ్గమీద ముద్దు వుంచింది.

అక్కడే!

మరో కెరటం మళ్ళీ తడిసిన అదే యిసుక భాగం. అనూరాధ మోము పరికించసాగాను. ఆమె ప్రసన్నవదనంలో స్వచ్ఛమైన ఒక చిరునవ్వు— మలయమారుతంలా, మంచుగడ్డలా— చల్లగా, యింకా చల్లగా — చరిత్ర చెప్పిన అనేక సత్యాలు ఆమె కళ్ళల్లో జ్యోతుల్లా వెలిగాయి.

అంతా రైలు ఎక్కారు. రైలు కదలబోతూవుండగా అనూరాధ, బాబు, అనూరాధ భర్త ముగ్గురూ చేతులు వూపుతున్నారు. అనూరాధ సూటిగా, కళ్ళరెప్పలు వాల్చకుండా నావైపే చూస్తోంది. రైలు దూరంగా కదిలిపోతూవుండగా ఎక్కడో ఆలోచిస్తూ నేనూ చెయ్యి వూపసాగాను.

ఈ యావత్ సృష్టి ఒక్కసారిగా ఎర్రగా, యింకా ఎర్రగా — ఎవరివో తాంబూలం వేసుకున్న పెదవులలా మారిపోతూన్నట్లు అనిపించి నాకళ్లు జిగేల్ మన్నాయి. ఎన్నాళ్ళనుండో నాలో నిలిచిపోయిన ఆనకట్ట బ్రద్ద లయింది. వురకలు వేస్తూ పొంగే ప్రవాహం...

అందుకే, మరోవిధంగా ఆలోచిస్తే మనిషి అల్పసంతోషికూడానూ — కాకపోతే నేను.

———



# దొంగబుద్ధి

పన్యాల రంగనాథరావు

సూరిగాడు మళ్ళీ దొంగతనం చేసి మరోసారి జెయిల్లో పడ్డాడని అందరికీ తెలిసింది.

ఈ రోజుల్లో మన మనస్తత్వం ఏ విధంగా ఉంటున్నదంటే, దొంగతనానికి పాల్పడ్డ ప్రతీ వ్యక్తినీ దొంగగా పరిగణించం. కనీసం అటువంటివాళ్ళది దొంగబుద్ధి అంటేకూడా వొప్పుకోం.

ఎందుకంటే, అట్లా వొప్పుకోకపోవడంలో చాలా లాభా లుంటై.

ఇందులో మరొక చిక్కుంది. దొంగబుద్ధిగల ప్రతీవ్యక్తినీ దొంగగానే ముద్ర వేసుకుంటూపోతే, మరి మనదేశం పరిపాలించటానిక్కూడా ఒక్కరూ మిగలరు. మనకొక ప్రభుత్వంకూడా ఉండదు.

ఇటువంటి విషయాలలో మన ఆలోచనలు బాగా పనిచేస్తాయి కనకనే. ఏదో ఈ సూరిగాడిలాంటివాళ్లు చేసే పనులే దొంగపను లంటాం.

ఎటొచ్చీ, సూరిగాడి విషయంలో ఒక ప్రత్యేకత వుంది.

వాడు చేసే ప్రతీదొంగపనికీ మాంచి న్యూస్‌వాల్యూ ఉంది. న్యూస్ వాల్యూ ఉండేటట్టు ముందుగా జాగ్రత్తపడి వాడా పనులు చేయకపోవడమే దానిక్కారణం.

సూరిగాణ్ణి 'గజదొంగ' అనటానికి వీలులేదు. గజదొంగ లక్షణం ఏమిటంటే, వాడు కనీసం ఇన్నిసార్లెప్పుడూ జెయిలుకి వెళ్ళడు. సూరిగాడు చేసే పనులన్నీ మూడోరకం, పోతే రెండోరకం దొంగపనులే. చెప్పొచ్చేదేమంటే ఈసారి వాడు ప్లీడరుగారి మనీపర్సు ఏ సందర్భంలోనో కొట్టేశాడు. వాడిదృష్టికి ఇది కేవలం మూడోరకం దొంగతనం మాత్రమే. వాడి కిందులో పదిరూపాయలన్నా కిట్టుబాటు కాలేదు.

సూరిగాడికి ఒకసంత్సరం మాత్రమే శిక్ష పడింది.

'సంవుచ్చరం యేపాటి? కన్నుమూసి తెరుత్తే గిర్రున తిరుగుద్ది. పోన్లే, సంవుచ్చరం మెతక్కూడా లేదు' అన్నాడు సూరిగాడు.

అందరికీవినపడేట్టే వాడీ ముక్కన్నాడు.

'దొంగవెధవ కన్నీ దొంగబుద్ధులే?' అన్నారు. విన్నవాళ్ళు.

ఎవరైతేనేమట్టుకు — వారు తెలీ కడుగుతాను — 'దొంగవెధవ' కాకముందు, 'మంచివెధవగా' ఉండాలని ఎక్కడుంది?

అయితే, సూరిగాడు మాత్రం పూర్వాశ్రమంలో — అనగా 'దొంగవెధవ' కాకముందు, 'మంచివెధవ' గానే ఉంటూ ఉండేవాడని అంతా చెపుతారు. అప్పట్లో, ఒకషావుకారుగారి రేషను దుకాణంలో బియ్యమూ ఇత్యాది, తూనిక వేసి ఇస్తూ ఉండేవాడు.

రేషన్లుఖచ్చితంగా పుచ్చుకునే వారంతా ఒకానొక తెగకీ, అంతకన్నా తక్కువ తెగకీ చెందినవారు— వెంకమ్మా, అప్పన్నా, సింహాద్రీ, అయ్యంగారూ, రాముడూ, శ్రీకంఠం, జనమేజయం, వైకుంఠం, అప్పడూ, సుబ్బీ, బుల్లోడూ వీరంతాకూడా సూరిగాణ్ణి, 'వెధవ! చాలా మంచివాడు' అనేవారు ఐక్యకంఠాలతోనూ, ఆప్యాయంగానూ.

అసలీ రేషన్లతో పనిలేని పెద్దలు కూడా చాలామంది ఉన్నారు. ప్రజాస్వామ్యంలో అందరికీ స్థానం ఉంటుంది కద? వారికి పాపం సూరిగాడంటే కూడా ఎవరో తెలీదు.

ఇది వారిగురించి కథకాదు గనక, మనకథ కొద్దాం.

అయితే, సూరిగాడు ఈ మంచితనాన్ని షావుకారు కన్నుకప్పి సంపాదించుకున్న విషయం వారికి బొత్తిగా తెలీకపోదు. మంచితనం సంపాదించటానికి మంచిపనులే చేయనక్కర్లేదు. అట్లా చేయడు. సామాన్యంగా వికటిస్తుంది. ఈ కిటుకు, సూరిగాడివంటి వారికి అర్థమైనంత బాగా మనబోటిగాళ్ళకి అర్థంకాదు. నమ్మండి!

ఒకరికి చెడుగా కనిపిస్తూ, చాలా మందికి మంచిగా కనపడేపని వొకటి చేసేవాడు సూరిగాడు. ప్రతీ రేషను కారు మీదా ఒకటో రెండో పిడికళ్ళ బియ్యం, కొసరుగా పోసేస్తూ ఉండేవాడు.

ఈ కరువు రోజుల్లో అంతకన్నా కావలసిం దేమిటి?

అయితే, ఏమాట కామాటే చెప్పాలి. వాడిదృష్టిలోమాత్రం వాడు కేవలం మంచితనం సంపాదిద్దామని ఈ పనిచేయలేదు.

షావుకారుకి మాత్రం, చాటుగా రెండు మూడురెట్లు ఎక్కువధర ఇచ్చేవారికోసం కట్టించుకుందా మనుకున్న సరుకు ఎట్లా ఉండటంలేదో అర్థంకాదు. తనే తూనిక వేసి ఇవ్వాలంటే, వచ్చేడబ్బా దక్కం ఎవరు చూసుకుంటారు?

డబ్బు విషయంలో మాత్రం పెళ్లాన్ని కూడా నమ్మరాదని షావుకారు అభిప్రాయం— కన్విక్షన్. 'తూనిక కాస్త తగ్గించి ఇవ్వడంలోనే ఉంది వ్యాపారంలో లౌక్యం' అంటూ షావుకారు, సూరిగాడికి అప్పు డప్పుడు చేస్తూవచ్చిన హితబోధ ఆటే ఫలించలేదు.

*




ఒక్కొక్కప్పుడు చెడ్డబుద్ధిని కప్పి పుచ్చడం సాధ్యం కాకపోవచ్చు.

ఈ నీతి ప్రకారం, సూరిగాడి మంచి బుద్ధి ఎన్నాళ్ళని దాగుతుంది ?

వాడి మంచిదనాన్ని షావుకారే, ఎలా పట్టేశాడని అడక్కండి—పట్టేశాడు.

'దొంగవెధవా! ఎన్నాళ్ళయి ఇట్లాంటి పని చేస్తున్నావు?' అన్నాడు షావుకారు, సూరిగాడిమీద ఎగిరిపడుతూ. 'నేను చేసిం దేటి? తవు రెంత సెప్తే అంతకు తగ్గించి ఇత్తున్నాగానా!' అన్నాడు సూరిగాడు.

"అబద్ధాలు కూడానట్రా, దొంగ బుద్దికితోడు! నీ అంత మంచివాడు లేడని ఖాతాదార్లంతా అంటూవుంటే, నిజమే కాబోలని నేను పొంగిపోయినాను!" అన్నాడు షావుకారు.

"తూనిక తక్కువవేసి యిమ్మంటూ, నాది దొంగబుద్ది అంటావేటయ్యోయ్." అన్నాడు సూరిగాడు.

"నోరుముయ్. నీపని పట్టిస్తానుండు, ఇలాక్కాదు!" అంటూ, జారిపోతున్న పంచె కుచ్చెళ్ళు కోపంతో సవరించు కున్నాడు షావుకారు.

అంతేకాదు, వాడిపని పట్టించడంలో, తనపని కూడా కొద్దిగా పట్టించు కున్నాడు.

రేషను నిబంధనల ప్రకారం సూరిగాడికి శిక్ష పడటమే కాకుండా, వాడి 'మంచితనం' మూలంగా షావుకారుకి కించిత్తు జరిమానాకూడా పడింది.

సూరిగాడికి శిక్ష పడ్డప్పుడు మాత్రం 'వా దేమో మంచివాడే! కాని వాడి బుద్ధి దొంగబుద్ధి!' అంటూ ఖాతాదార్లలో కొందరు తీర్మానించారు.

'షావుకారు బియ్యం సాటుగా దాసు

కొని, పెద్దోళ్ళకి సాటుగా అమ్ముకోగల దేం? ముందు ఆడిని కొట్లో తొయ్యాలి' అనుకున్నారు వెంకమ్మా, అప్పుడూ, బుల్లోడూ

'మంచితనానికి రోజులు కావోయ్! పాపం కష్టానికి ఆదుకుంటాడు కదా షావుకారు! మళ్ళీ ఎక్కడన్నా, పెళ్ళన్నా, పండగన్నా, పబ్బమన్నా, అంతా బియ్యంకోసం ఆయన కాళ్ళు పట్టుకునేవాళ్లే. సొమ్మత్తగారిదీ, ధార పోసేది అల్లుడూనా. సూరిగాడు బియ్యం దానం చేయడ మేమిటి. ఏ పాపమూ ఎరగని షావుకారికి జరిమానా యేమిటి? ఇదేమన్నా న్యాయమేనా? మీరే చెప్పండి. రేషను రూల్సు మార్చాలి. ఏమంటారు?" అన్నాడు జనమేజయం.

"అవును మరి. రేషను రూల్సు మార్చాల్సిందేనూ?" అన్నారు అయ్యంగారూ, శ్రీకంఠం, వైకుంఠం.

ఏమైతే నేం? నాటినుంచీ మన సూరిగాడు దొంగవెధవై కూర్చున్నాడు.

కూర్చున్నవాడు కూర్చోక, రెండు మూ దేళ్ళలో వాడు, చిల్లర మల్లర దొంగతనాలు చాలా చేశాడని చెపుతారు. కొన్నింటికి శిక్షలు పడ్డాయంటారు; కొన్నింటికి పోలీసులు వాడి దగ్గర రూపాయీ, అర్ధా పుచ్చుకొని వాదిలేసి, వాడి మంచితనాన్ని మెచ్చుకోవడం కూడా కద్దంటారు. అసలు, పోలీసుల లోనే కొందరు, వాడికి అప్పుడప్పుడు సహాయంకూడా చేస్తా రంటారు.

ఇవి ఆనోటా ఆనోటా అనేమాటలు సమ్మండీ! ఎవరు చూసొచ్చారు?

ఆ తర్వాత, ప్లీడరుగారి మనీపర్సు కొట్టేసినప్పుడు మాత్రం, ప్లీడరుగారే స్వయంగా, వాడిని కనికరించి, తన పలుకుబడిలో ఒక వీసమెత్తు త్యాగం కూడా చేసి శిక్ష ఒక్క సంవత్సరానికి తగ్గించారు.

సూరిగాడి జీవితచరిత్రలో ఎక్కడో కొన్ని పుటలు నేను నింపుతున్నా ననో, ఏంపాడో, మరి, నాకు జెయిలుకి వెళ్ళి నట్టు తెలిసినా మర్నాడే నాకు కలలో కొచ్చాడు.

వాడి ఆకారం ఏమంత భయంకరంగా లేదు. ఎటొచ్చీ, వాడి కుడిచేతి బొటన వేలుకి కాబోలు కట్టుంది. కట్టుపైన అక్కడక్కడ రక్తపుమరక లున్నాయి.

"ఏమయిందిరా?" అని నేను అడిగి నట్లు జ్ఞాపకం.

"ఏందోలే రాజా! ఇట్టా యేళ్లుతెగడం, మళ్ళీ మొలవడం మాకు పరిపాటే" అని వా డన్నా డనుకుంటాను.

"ఏ మొచ్చావు?" అన్నానల్లే వుంది.

"రాకూడదా యేంటి? ఏందో రాత్తున్నావు కదా, ఈ ముక్కకూడా రాయి అని సెప్పడాని కొచ్చాను. రెక్కాడితే గాని డొక్కాడదు. ఈ సేటుకాలంలో రెక్కాడినా డొక్కడొక్కే! ఏంటంటావు? అందుకే కాటేస్తేనేగాని నా డొక్కాడదు. యెదవది — యీ సిన్న




సిన్న సిట్టాల్లో నాబ నేంటి? కాటుకొడ్తే కాసులు రాలాలి జల జలా! గల గలా! సంవుచ్ఛరం సిచ్ఛ నాకేటి సాలుద్ది? - కన్నుమూసి తెరుత్తే గిర్రన తిరుగుద్ది!"

సూరిగా డనుకున్నట్టే సంవత్సర కాలం గిర్రున తిరిగింది. తిరక్క ఆగుతుందా యేమిటి? పొట్టను చేత పట్టుకొని సూరిగాడు మళ్ళీ బయటపడ్డాడు.

"వెధవా! మళ్ళీ దొంగతనానికి పోక-చూశావ్-ఎక్కడేనా, ఇంత పనికి కుదురుకో!" అంటూ, వాడు విడుదలయ్యాక, వాడి శ్రేయోభిలాషులలో వొకడు సలహా యిచ్చారు.

"మీ రిత్తే కుదురుకోనా? నా కేం సేదా?" అంటూ ఎదురు సమాధాన మిచ్చాడు సూరిగాడు.

"నా కెందుకీ రొష్టు! ఏదో పాపం. మంచివాడవని చెప్పానుగాని! ఏట్లోపడి చావు," అంటూ శ్రేయోభిలాషి దీవించాడు వెళ్ళిపోతూ.

"ఏట్లో పడితే నే నీదేత్తాను. మీవాంటోళ్ళు గోయింద పలికేత్తారు!" అన్నాడు సూరిగాడు.

"దొంగవెధవకి పనెవరిస్తారు?" అన్నాడు శ్రీకంఠం.

"ఇల్లు గుల్ల చేసెయ్యడూ?" అన్నాడు జనమేజయం.

"నే నిద్దనుగానీ... తీరా..." అన్నాడు వైకుంఠం.

సూరిగాడికి, తన శ్రేయోభిలాషులలో ఒకరిచ్చిన సలహా తాత్కాలికంగా బాగానే ఉందనిపించింది. తన దొంగ

బుద్ధిని అవతల పెట్టి, రెండు మూడు రోజులు దిమ్మతిరిగాడు. ఇదివరకు తను రేషన్లలో రెండేసి మూడేసి పిడికెళ్ళ బియ్యం ఎక్కువ పుచ్చుకున్న అయ్యంగార్నీ, శ్రీకంఠాన్నీ, జనమేజయాన్నీ, వైకుంఠాన్నీ యాచించాడు–తనకేదన్నా పని ఇప్పించమన్నాడు.

"అయ్యా ఇప్పించగల అయ్యల నడుగురా. మా దగ్గరేముందీ?" అన్నాడు అయ్యంగారు.

"మీ రయ్యంగారని అడిగినాను!" అన్నాడు సూరిగాడు.

"నే నిద్దునుగా నీ... తీరా..." అన్నాడు వైకుంఠం.

"నువు మంచిగా ఉంటూ ఉంటూ, దొంగబుద్ధిని తెచ్చిపెట్టుకున్నావు. నిన్ను నమ్మేదెట్లా?" అన్నారు మరికొంత మంది.

"మా కెవ్వరిచ్చినా రేటి?" అన్నారు అప్పడూ, వెంకమ్మా, రాముడూ.

"గోలీలాడ్దాం, రా, సాలా కాల మయింది," అన్నాడు బుల్లోడు, సుబ్బి.

రాత్రి సుమారు తొమ్మిది గంటలకు దుఖాణం తలుపులు మూసి, షావుకారు లెక్క చూసుకుంటున్న సమయంలో, సూరిగాడు తలుపుతట్టడంతో కె మాక్కు పడింది.

షావుకారు గుండె దడదడలాడింది. యాభై యేళ్ళు పైబడ్డా ఆరోగ్యం సరిగా కాపాడుకొస్తూండడం వల్ల, అది అయింతా టపీమని ఆగిపోలేదు. బెదురు తూనే తలుపు తీశాడు. సూరిగాణ్ణి చూడ గానే మటుకు జడుసుకొని వెనక్కు తగ్గాడు.

"నా కీ రాత్రికి కసిన్ని బియ్యం గింజలు పోసి, రేపు నాకు పనిప్పించండి." అన్నాడు సూరిగాడు.

సూటిగా ఒకే ఒక మాట.

షావుకారు, పోయిన ధైర్యమంతా మూటగట్టుకొని, దొంగ రాస్కెలుడా! మళ్ళీ వచ్చావూ? సిగ్గు లేదట్రా బియ్యం అడగటానికి? దాచిపెట్టినట్టడుగుతావూ? ఇక నడూ – అవతలికి..." అంటూ తలుపు వేయబోయాడు.

"ఇదిగో! మరి మాటిసిరిపారెయ్యకు. నేను మంచోణ్ణిగాను. ఎరుగుదువుగా! దొంగెదవని. నీవు బ్లాకు యాపారం కోసం దాసిన గింజల్లో పిడికెడు పడెయ్యి. నేకుంటే మరి మాట దక్కదు!" అన్నాడు సూరిగాడు.

వాడికళ్ళు యెర్రగా, తాగినకళ్ళలాగా ఉండటం చూసి, షావుకారుకి అమిత భయం వేసింది. కేకలేద్దామన్నా వీలులేని స్థితి కలిగింది.

"నా దగ్గర బ్లాకేమిటి? రేషనాఫీసర్లా అడుగుతున్నావు?" అన్నాడు షావుకారు; ఎండిననాలుక తడిచేసుకుంటూ.

రేలంగి స్టయిలులో షావుకారు 'బోలీసులూ! బోలీసులూ!' అనే లోపుగా, మరి ఆపే మాట్లాడటానికి

వీలు కలగనివ్వకుండా, సూరిగాడు, షావుకారి పొట్టలో హటాత్తుగా ఒక్క పోటు పొడిచాడు, చేత్తోనే. షావుకారు విరిగిన మానల్లే వడ్డాడు.

సూరిగాడు, గల్లాపెట్టి చంకనెట్టుకొని, వాడికి ఆ రాత్రికి అవసరమైన పిడికెడు బియ్యంతో సహా, మాయమైనాడు.

అయితే, సూరిగాడు ఎన్నాళ్ళిట్లా మాయమైఉంటాడు? రెండు మూడు రోజులలోనే ప్రత్యక్షమయి, అరెస్టయినాడు. ఈసారి అయిదేళ్ళు శిక్షపడింది.

వెనకటికి, సూరిగాడిచేత మసీపర్పు కొట్టివేయబడ్డ ప్లీడరుగా రొచ్చి "శిక్ష తగ్గేటట్టు చూస్తాను. ఏమిస్తావు?" అన్నారు.

"ఎక్కువ సేయించడం శాతవునా? తగ్గిత్తే నా కేటి వొరుగుద్ది? శాతనైతే ఎక్కించు!" అన్నాడు సూరిగాడు.

ఇటువంటి సమాధానానికి సిద్ధంగా లేని ప్లీడరు కాస్త తబ్బిబ్బు పడ్డాడు.

"పోన్లే. అయిదేళ్ళదాకా నేను మంచోణ్నే. ఆ పైన సూద్దాం!" అన్నాడు సూరిగాడు.






## జరిగిన కథ

[చాలా ప్రొద్దుగ్రుంకేవరకూ షికారులో కాలక్షేపంచేసే దేవరాణీ కిరణ్‌లు, నౌకరు హెచ్చరికతో లేచి యింటి ముఖం పట్టారు. దారిలో అకస్మాత్తుగా త్రాచు పాము అడ్డమై, దానినుండి తప్పించుకుని ఇంటికి చేరారు. దేవరాణీని ఇంటివద్ద దిగ విడిచి స్వగృహోన్ముఖుడైన కిరణ్, ఎవరో వెంటాడుతున్న సవ్వడై పిస్టల్ ప్రేల్చితే ఆ వ్యక్తి తప్పించుకుని పారిపోయాడు. కిరణ్‌కు ఆశ్చర్యం కలిగింది.

కిరణ్ శలవు ఐపోయి మర్నాడు ప్రయాణమని, దేవరాణీ నొప్పించి గోదావరి వరకు షికారుకు తీసుకుపోయాడు. అక్కడ గంగన్న వారిని అనుసరిస్తున్నట్లు అవగాహ నయింది - పిలిచినా, వినికూడా, పలకకుండా పోయినందువల్ల]

-- ఇక చదవండి.

"మీ హృదయ మెంత మంచిది! మీది చాలా కోపావేశ స్వభావమనే అనుకున్నాను కాని ఇంత వెనుకముందులు యోచిస్తా రనుకోలేదు."

నవ్వాడు కిరణ్ "నిజమే! కోపం ఒకపాలు ఎక్కువే కాని, తొందరపాటు మాత్రం లేదు...అన్నట్లు ఇంద్రాణినుంచి ఏమైనా ఉత్తరాలు వచ్చాయా వెళ్ళాక? నా కేమీ వ్రాయలేదు!"

"నాకు వ్రాసింది _ రెండు."

"ఏవైనా విశేషా లున్నాయా?"

"మీకు నమస్కారాలు చెప్పమన్నది."

"ఆ అక్కవంటి చెల్లెలుకాదు. చాలా ఉత్తమురాలు ఇంద్రాణి."

"అవును. మీది తొందర స్వభావం కాదని స్థిరం తెలిసింది గనుక ఒకవిషయం నేనూ చెప్పదలచుకున్నాను. విని మరచిపోతాననీ, ఏ పరిస్థితులలోనూ పైకి తీసుకురాననీ మా టివ్వాలి మీరు."

"తప్పకుండా. తృణీకరిస్తానా రాణీ?"

"మన ధాన్యంకుప్పలను తగులబెట్టినవాడు గంగన్న!"

"ఆఁ!" వింటూనే నివ్వెరపాటుతో మరి నడువలేక ఆ ఇసుకలోనే కూలబడ్డాడు కిరణ్.

"మనిషిని చూచీ, చేజిక్కిన తర్వాతకూడా నాన్నగారు అతడిని వదిలిపెట్టిన విషయము మరుగుపరచడం ఏమిటో బోధపడక రహస్యంగా నాన్నగారి డైరీ తీసి చదివాను. ఆయనకు డైరీ వ్రాసే అలవాటుంది ... 'ఆప్తమిత్రులూ, కాబోయే వియ్యంకులూ అయిన జగపతివర్మగారి పాలేరే ఈ పని చేయడంవల్ల, వెనుక ముందులాలోచించి రట్టుచేయకుండా అతడిని వదలివేశానన‌ట్లు వ్రాసుకున్నారు డైరీలో."

అనేక ఆలోచనలు ముప్పిరిగొనగా మాట్లాడలేక అలా మౌనంగా చూస్తున్న కిరణ్‌తో అన్నది రాణి: "మీ పాలేరు యిలా ప్రవర్తించాడని చెప్తే మీ రిలా అభిమానపడవచ్చు ననే అనుమానంతోచే, సంకోచించి చెప్పలే దిన్నాళ్ళూ. ఇప్పుడు సందర్భం ఏర్పడింది గనుక చెప్పాను. ఏమీ అనుకోకండి; క్షమించండి."

"లేదు రాణీ! నా మౌనాన్ని ఆ విధంగా అర్థం చేసుకోకు. మీ నాన్నగారి ఉదార హృదయాన్నీ, నీ సహృదయతనూ గూర్చి ఆలోచిస్తున్నాను, అంతే."

"ఇదిగో చూడండీ — ఇంద్రాణి ఉత్తరం." హ్యాండ్‌బాగులోనుండి ఉత్తరం తీసి ఇచ్చింది రాణి.

ఆశ్చర్యంగా అందుకున్నాడు కిరణ్.

"దేవరాణి అక్కయ్యకు,

నమస్కారం. ఉభయ కుశలోపరి. నేనూ, జానకిఅక్కయ్యా ఆరోజున రాత్రి ఏడుగంటలకు సురక్షితంగా మా స్వగ్రామం చేరుకున్నాం. మన స్నేహ పరిచయాలు నాలుగు రోజులు ఆయుష్షు గలవిమాత్రమే అయినా అనుక్షణం పుష్ప పరిమళమంత హాయిగా, పూమకరందమంత తీయగా నిత్యనూతనంగా అంతరంగాన మెదలి ఆనందడోలికలలో ఊగించివేస్తోంది.

ఎన్నో విషయాలు వ్రాయాలనుకున్నాను కాని వ్రాయలేకపోతున్నాను. ఒక ముఖ్యమైన హెచ్చరికమాత్రం చేయదలచుకున్నాను. అక్కా! నీ క్షేమం కోరీ,

కిరణ్ బావగారి క్షేమంకోరీ ఈ విషయం వ్రాస్తున్నాను. అందువల్ల నువ్వుకూడా చదివినతర్వాత — నా క్షేమంకోరి, వెంటనే ఈ జాబును చించేసేయాలి. లేకుంటే నన్ను చాలా కష్టపెట్టినదాన వౌతావు.

నిన్న గంగన్న యిక్కడకు వచ్చాడు. అక్కను చూచిరమ్మని అత్తవారు పంపారని చెప్తే నిజమే ననుకున్నాను, కాని చాటుగా అతడూ అక్కయ్యా మాట్లాడుకోవడం నేను విన్నాను. మిమ్మల్ని సకలబాధలూ పెట్టి ఎట్లాగైనా, జగపతిగారి కుటుంబంతో విరోధం తెచ్చి, ఊరినుండి తరిమివేయాలనీ, ఈ వివాహం విఫలం చేయాలనీ అక్క ప్రయత్నిస్తోంది. అందుకే గంగన్న మీ పొలంలో వరి కుప్పలకు ఒకరాత్రి నిప్పు పెట్టాడట. మీరు తెలిసే వదిలేశారట. ఎంత ఉదారత్వం! నిజంగా నాకనులు చమర్చాయి. ఆపని చేసినందుకు అక్క గంగన్నకు దండిగానే లంచం ముట్టజెప్పింది — వందరూపాయలు ఇచ్చింది. ఆమెకు యింత పాడుబుద్ధి ఎందుకో నాకు తెలియకుండా వుంది. నాకు చిన్నబావగారిపై ఆపేక్ష లేదని తెలిసీ, ఆమె కీ కుతంత్రా లెందుకో గ్రాహ్య మవ్వడంలేదు. బహుశః, ఆ ఇంటి కోడళ్ళందరిలో తనదే పైచేయి కావాలనీ, తనను మించినామె ఉండరాదనీ ఆమె అభిమతం కాబోలు! ఇంతకుమించి నీపై ద్వేషం ఉండగల కారణాలు లేవనుకుంటాను.

ఇందులో శ్రీరాం బావగారికికూడా పాలు ఉన్నదేమోనని మొదట అనుమానించాను; కాని, పాపం — ఆయన కేమీ తెలియదని వారి సంభాషణనుండే గ్రహించాను.

మీ నాన్నగారు. చేజిక్కినప్పటికీ గంగన్నను విడచిపుచ్చడంలో చాలా ముందుచూపుతో వ్యవహరించారు. లేకుంటే — జగపతిగారి పాలేరే ఇటువంటిపని చేశాడన్న విషయం బహిర్గతమైతే అసలువిషయం మరుగునపడిపోయి ఇరు కుటుంబాలమధ్యా వైషమ్యాలు ఏర్పడి, ఇప్పుడున్న స్నేహసంబంధాలు సమసిపోయివుండేవి. ఫలితంగా మీ వివాహంకూడా చెడిపోయివుండును. అక్క వేసిన ప్లానుకూడా అదే; కాని అది నెరవేరకుండా దైవం అనుకూలించాడు.

కాని ఇంకా ముం దేం జరుగనున్నదో? చచ్చినవాళ్ళు ఎలానూ చచ్చారు. వాళ్ళకోసం బ్రతికున్నవాళ్ళం చేజేతులా జీవితాలు నిరాశాపూరితం చేసుకోవడం తెలివైనపని కాదు. ఈ కుట్రలు ఇంకా బలవత్తరమై, ఫలించకముందే సాధ్యమైనంతత్వరలో మీ వివాహం జరిగిపోతే ఇంకెవరూ మీకు ఎటువంటి హానీ చేయలేరని నా నమ్మిక. నా సలహాను త్రోసివేయవుకదూ?




స్వంత సోదరి రహస్యాలను బయటపెట్టి ఆమెను తేలిక పరచడం — ఏ మాత్రం క్షంతవ్యం కాజాలదు. అయినా. ధర్మ న్యాయాలకోసం ఈపని చేశాను. నన్ను తేలికగా జమకట్టవద్దు. జానకి నా స్వంత సహోదరి. ఆమెకు అవమానం, అపకారం జరిగితే నేను సహించలేను.

"అందువల్ల ఈ విషయాలు గుర్తులో పెట్టుకుని మీ జాగ్రత్తలలో మీ రుండాలే కాని నా పేరుకానీ, అక్కయ్య పేరుగానీ పైకి రాకూడదు. ఉత్తరం చదవగానే చించివేస్తావుకదూ ?

బావగారికి నా నమస్కారములు.

— ఇంద్రాణి."

చదవడం పూర్తిజేస్తూనే ఆ ఉత్తరాన్ని పరపరా చించివేశాడు కిరణ్. విస్ఫులింగాలు వర్షిస్తున్న ఆ నేత్రాలనూ, పొగలూ సెగలూ గ్రక్కుతూన్న ఆ వదనాన్నీ తేరిపారచూడడానికికుడా వెరచింది రాణి.

చాలా సేపటివరకూ మాటలే కరవైనాయి.

అతడిని శాంతపరచడానికి రాణికి ఒకటే ఉపాయం తోచింది!

మెల్లగా, తీయగా, మందంగా, నిండుగా నిర్మల గంభీర స్రవంతిలా సాగిపో

తూన్న చక్రవాకరాగం చెవిని సోకగానే క్రోధావేశాలతో ముకుళితమైన కిరణ్ వదనం క్రమంగా వికసించసాగింది. ఆగ్రహారుణరేఖాంకితవదనంలోని అరుణిమ క్రమంగా సన్నగిల్లి శాంత ప్రసన్నతలు అలముకొనసాగాయి. ఇసుకలో ఒత్తిగిల్లి పడుకొని పాడుతూన్న రాణి నేత్రాలలోనికి తదేకంగా చూస్తూ ప్రపంచాన్నే మరచి పోయాడు.

పాట ముగిసింది. వాతావరణం ప్రశాంతంగా వున్నది. ఆదిత్య తాపం బాగా తగ్గి మలయమారుతం ప్రవేశించింది. భారహృదయాలు తేలికయ్యాయి. ఆవేశాలు కొంత అణిగాయి.

"ఇక వెళ్దామా?" అనడిగింది రాణి మెల్లని స్వరంతో.

"పద;" ఆమె చేతిని ఊతంగా పట్టుకొని లేచాడు.

''అయితే రేపు ఉదయమే నన్నమాట, ప్రయాణం?" అన్నది రాణి నడుస్తూ.

"అవును. అనునిత్యం నీ యీ పాట, నీ రూపం మనస్సులో మెదుల్తూనే వుంటాయి. మళ్ళీ సాధ్యమైనంత త్వరలోనే వస్తానుగా?"

తిరిగి కొంతసేపు మౌనం.

"అయితే ఇంద్రాణి విషయం రహస్యంగా ఉంచుతారు కదూ?''

"అత్యవసరంగా. అందుకేగా ఆ జాబు చించేశాను?... ఇంద్రాణి మన స్నేంత మంచిది!"

కొంతసేపటికి అడిగింది రాణి. "ఆయితే ఇంకా ఈ కుట్ర కొనసాగుతుందంటారా?"

"ఏమో చెప్పలేం. కాని జాగ్రత్త అవసరం."

"నా కేమిటో భయంగా ఉంది."

"ఇంద్రాణి అన్నట్లుగా మన వివాహం తొందరగా అయిపోతే మరెవరూ ఏమీ చెయ్యలేరనుకుంటాను. కాని పెద్దల అభిప్రాయాలుకూడా పాటించవలసిందే మరి."

"నా కేమిటో ఎంత ధైర్యం చెప్పుకుందామన్నా మనస్సుకు ధైర్యం రావడం లేదు. ఆనాటి కల, ఈ జరుగుతున్న ఒక్కొక్క సంఘటనా మనస్సును కలచి వేస్తున్నాయి. మనస్సు నిత్యం కీడునే శంకించి రోదిస్తూంది,'' అన్నది దేవరాణి అశ్రునయనాలతో.

"అంత అధైర్యం వద్దు రాణీ." అశ్రువుల నొత్తుతూ అప్యాయంగా దరిజేర్చుకున్నాడు కిరణ్. "ప్రతిపనిలోనూ పరీక్ష లెదురౌతూనే ఉంటయి; తట్టుకోవాలి.

ఏదీ_ఒక్క చిరునవ్వు నవ్వు. మళ్ళీ నిన్ను చూచేవరకూ ఆ నవ్వూ, ఆ పాటే మనస్సులో హత్తుకుపోయివుంటాయి.

''ఏదీ_నవ్వాలి మరి!''

కళ్ళు తుడుచుకుని మందంగా మనోహరంగా నవ్వింది రాణి.

"ఏది వచ్చినా మన మేలుకొరకే రాణీ. స్వార్థంతోనో, తెలివి తక్కువతోనో అంటున్న మాటలు కావివి. ఒక పెద్ద విచారంతో మనస్స్వాస్థ్యంకోసం మీ కుటుంబం ఇక్కడకు వచ్చారు. ఎప్పుడూ సెలవులకైనా ఇంటికి రాని నేను ఎందుకో సెలవుపెట్టి హఠాత్తుగా ఇక్కడకు వచ్చాను. మందుకెంత మాడ్చేస్తూంటే మహా విసుక్కున్నాను. కాని అవే మన పరిచయానికీ, ప్రణయానికీ, పరిణయానికీ దారి తీశాయి."

విస్ఫారిత నేత్రాలతో, విస్మయంగా వినసాగింది రాణి.

''అవును రాణీ, అంతే. నే ననుకొనేది అంతే. ఏ సంఘటనైనా_ఆనందకారణమైనా, ఆవేదనహేతువైనా సరే_ఆవెనుక అతి విలువైన అర్థమూ, ప్రయోజనమూ అదృశ్యంగా ఉంటాయి. అది తాత్కాలికంగా ఆందోళనకారణమైనా, కొంత హాని జరిగినా, దానివల్ల ముమ్మందు అందలి అంతరార్థం బయట పడుతుంది. ఒక వేళ మనం బాధపడినా అందువల్ల అనేకులు బాగుపడగల అవకాశం వుంటుంది!"

"కిరణ్?'' అదిరిపడింది రాణి.

"ఆవేశపడకు. ఊరికే మాటవరసకు నీ కర్థమవడానికి చెప్పాను."

# 20

రాత్రంతా పలురకాల ఆలోచనలతో అనుమానాలతో నిద్రపట్టక సతమతమైన కిరణ్ కడకు అర్ధరాత్రివేళ ఒక నిశ్చయాని కొచ్చినట్లు లేచాడు.

అంతటా గాడాంధకారం. చీకటి రాత్రిళ్ళు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అందరూ నిద్రలో ఉన్నట్టున్నారు. సడి కాకుండా మేడ దిగి, వరండాలో నిద్రిస్తూన్న నౌఖర్ల దగ్గర కాస్సేపు నిల్చుని పరీక్షగా చూచాడు. వా రెవరిలోనూ గంగన్న లేడు. ఒకవంక వానలేదు కానీ విపరీతమైన గాలి వేస్తూంది.

'ఎటూ కానివేళ. పోనీ ఈ ప్రయత్నం విరమించుకోనా?' అని కొద్దిసేపు తటపటాయించాడు. 'లేదు, విరమించకు. తెల్లవారితే నీవు ప్రయాణమై ఊరువిడచి వెళ్ళిపోతావు. ఇక్క డెటువంటి ఘాతుకమైనా జరుగవచ్చు. రహస్యంగా గంగన్నను బెదరించి మరీ వెళ్ళు. అప్పుడు కాస్త భయంకలిగి జాగ్రత్తగా ప్రవర్తిస్తాడు,' అని అంతరాత్మ పదే పదే చెప్పసాగింది.

'సరే. తీరా బయల్దేరాక వెనుదిరగడ మేమిటి? అయినా ఇటువంటి విషయా లలో ఉపేక్ష కూడదు. తలచినపని నేరవేర్చుకోవాలి' అనుకుంటూ గొడ్లపాకవైపు నడిచాడు.

ఊహ నిజమైంది. దూళ్ళచావడిలో పడుకొని నిద్రపోతున్నాడు గంగన్న.

"ఒరేయ్ గంగూ!"

గుఱ్ఱుపెట్టి నిద్రపోతున్న అతడికి కిరణ్ స్వరం విన్పించలేదు.

"ఒరేయ్, లేవరా గంగూ," అంటూ కాలితో తన్ని లేపాడు.

గాఢనిద్రలోఉన్న గంగన్న త్రుళ్ళిపడి లేచి అయోమయంగా చూడసాగాడు.

"లేవరా, నీతో మాట్లాడాలి."

ఆ హుంకరింపుతో గంగన్నకు మత్తంతా వదలిపోయి, అతడి మనస్సు ప్రకృతాన్ని గ్రహించగలిగింది.

"ఏం దొరా? అర్ధరాత్తిరేళ శ్రమపడి వచ్చినారు?" అన్నాడు.

ఆ నక్కవినయం చూచిన కిరణ్ మేను ఉడికిపోయింది.

"ఇందాక నాలుగు ఫర్లాంగులదూరం శ్రమపడి నన్ను ఎందుకు వెంటాడేవో అడగడాని కొచ్చాన్రా."

ఆ స్వరంలోని తీవ్రత గమనించిన గంగన్నను గుండెదడ ఆవేశించింది.

"మాట్లాడవేంరా? ఎవరు పుర్మాయించారు నీకివన్నీ? మొన్నరాత్రికూడా నువ్వేకదూ నన్ను వెంటాడావు? ఎవ రిలా పహరా కాయమన్నారు నిన్ను?"

"నాకు... నా కేం తెల్దు దొరా!" అంతకంతకు కఠినత హెచ్చుతున్న కిరణ్ కంఠస్వరం వింటూంటే గంగన్నకు మాట తడబడసాగింది.

ఇటువంటి మొండిఘటాలు బెదరింపులకే బాగా లొంగుతాయని బాగా తెలిసిన కిరణ్ ప్రయత్నపూర్వకంగా విపరీతకోపాన్ని ప్రదర్శింపజూచాడు.

"ఒరేయ్, నిజం చెప్పి, తప్పు ఒప్పుకొని, ఇకమీదట కుదురుగా ఉండకపోతే చర్మం ఒలిచేస్తాను. నీ బ్రతుకు అందరకూ బహిరంగం చేసేస్తాను. ఆ రోజున రాయుడిగారి ధాన్యంమేట్లకు నిప్పు పెట్టినది నువ్వే కదూ?"

ఒక్క క్షణంలో కర్తవ్యం నిర్ణయం చేసుకున్నాడు గంగన్న. చిన్నబాబు అగ్రహావేశాలు వాడికి తెలియనివికావు. 'పెద్దయ్యగారికి ఫిర్యాదివ్వడం, న్యాయ విచారణ కోరడం తర్వాత సంగతి. ముందు ఇక్కడ చిన్నదొర తనను ముక్కలు ముక్కలుగా నరికినా దిక్కులేదు కదా! అదీకాక అదేమో - చిన్నబాబుపై ప్రత్యేక మమకారం అయ్యకూ అమ్మకూ. అతడిపై అసలు ఏ ఫిర్యాదు వచ్చినా పట్టించు




కోరు. అంచేత ప్రస్తుతం నాకు పలాయనమే శరణ్యం. ఆనక బ్రతికుంటే బలుసాకు తినొచ్చు.'

ఇలా తలపోస్తూ నిలుచున్నపళంగా అదే పరుగుచ్చుకున్నాడు గంగన్న. వాడట్లా పారిపోగలడని ఊహించని కిరణ్ దిగ్భ్రమనుండి తేరుకోకముందే వాడు అంతర్థానమైపోయాడు. చేసేదిలేక మేడమీది తన గదికి తిరిగివచ్చి పడుకున్నాడు కిరణ్.

అనేక ఆలోచనలతో ఆలస్యంగా నిద్రించిన అతడు ఉదయమే ఏదో గగ్గోలు వినరాగా త్వరత్వరగా లేచి ఆత్రతతో ఆసక్తితో క్రిందికి వెళ్ళాడు. కళ్ళెదురుగా కన్పిస్తూన్న దృశ్యాన్ని చూస్తూనే స్తంభించిపోయాడు.

గంగన్న శవాన్ని సింహద్వారంముందు పడవేసుకొని నెత్తీ నోరూ కొట్టుకు ఏడుస్తున్నారు భార్యాపుత్రులు. నోటినుండి నురుగులు కారుస్తూ, నల్లబారిపోయి ఉన్న ఆ శవాన్ని చూడగానే కిరణ్ చలించిపోయాడు.

"రాత్రి పొలంలో త్రాచు కాటేసింది. అర్ధరాత్రివేళ కావటాన ఎవ్వరూ చూడనూ లేదు, వైద్యసహాయమూ లభించలేదు." కిరణ్ విచారించగా ఎవరో చెప్పారు.

కోపమంతా విస్మరించి రోదించింది కిరణ్ మనస్సు. రాత్రి తానే కనుక అలా నిలదీయకపోతే, గంగన్న బెదరి పొలాలలోనికి పారిపోకుండా ఉంటే బ్రతికివుండేవాడేమో! వాడి మృతికీ, వాడి భార్యాపిల్లల బాధారోదనలకూ నేనే కారణమా? 'గతరాత్రివరకూ అనేక రకాలుగా ప్రవర్తించి, ఎన్నోపనులు చేయించిన వాడిలోని చైతన్యం ఈ అల్పకాలవ్యవధిలో ఏమైపోయింది?'

కలతపడిన మనస్సుతో, జీవితపు క్షణభంగురత్వాన్ని గురించి యోచిస్తూ ఎవరితోనూ మాట్లాకుండానే తనగదిలోకి పోయాడు కిరణ్.

"ఏడువకు. నీ కుటుంబానికి మేమే ఏదో ఆశ్రయం కల్పిస్తాం," అంటూ కమలాకరం గంగన్న భార్యను ఓదార్చుతున్నాడు.

"డబ్బు నే నిస్తాను. త్వరగా తరువాయిపనులు కానివ్వండి. ఏడ్చి ఏం ప్రయోజనం?" అంటున్నాడు జగపతి.

ఏమిటో ఆ మాటలన్నీ మనస్సుకు బాధాకర మవ్వగా, తిరిగి కళ్ళుమూసుకు పడుకున్నాడు కిరణ్. అతడికి తెలియకుండానే మూసిన కనుకొలకులనుండి అశ్రుధారలు జారిపోసాగాయి. నిరాధారయై శోకిస్తున్న గంగన్నభార్య - అబల, లోకం తెలియని పసిపిల్లలు - ఎందుకో తననే నిలదిస్తూన్నట్లు అన్పించింది.

క్రమంగా వెలుపలినుండి వినవస్తూన్న రోదనలూ, అలజడీ తగ్గాయి.

"చిన్నబాబూ. ఇంకా లేవలేదేం?" అంటూ తల్లి గదిలో ప్రవేశించడంతో భారంగా లేచాడు కిరణ్.

"అలాగున్నావేం బాబూ?" అడిగింది కమల కుమారుని వదనం పరిశీలనగా చూస్తూ.

"ఏం లేదమ్మా." కంఠం ఎంత అదిమిపెట్టినా భారంగానే పలికింది. "గంగన్న శవాన్ని తీసుకుపోయారా?"

"తీసుకుపోయారు." నిట్టూర్చింది కమల. "వాడి జన్మ అలా కాలింది. ఇంటి నౌఖరు. 'అమ్మగారు, అమ్మగారు' అంటూ తిరిగేవాడు. ఏమిటో మనస్సంతా పాడైపోయింది."

"..................''

"శుక్రవారం పాచివాకిట్లో శవమూ, ఏడుపూ, పెడబొబ్బలూనూ. ఏమిటో నా కేం బాగుండలేదు. చచ్చినవాడిని వాడింటికి తీసుకుపోక మధ్యన ఇక్కడదేనికీ? నే నేమైనా అంటే మీ నాన్నగారు చాదస్తంగా తీసిపారేస్తారు అటువంటివి జరుగ కూడదు, కీడును సూచిస్తాయి."

ఎందుకో తల్లిమాట నిజమేనేమో ననిపించింది కిరణ్‌కు.

"అమ్మా!" మెల్లగా పిల్చాడు.

వెళ్ళిపోతున్న కమల ఆగి వెనుదిరిగి చూచింది.

"ఒక విధంగా గంగన్నచావుకు నేనే కారణ మనుకుంటానమ్మా."

ఎంత ప్రయత్నించినా, గుప్తంగా దాచుకోలేక జరిగిన విషయాన్నంతనూ తల్లితో చెప్పివేశాడు.

"ఆఁ!" నిర్ఘాంతపోయింది కమల. "మన జానకే ఇంతంత పనులు చేస్తూందా? గంగన్న అంత ఘాతుకాల కొడిగట్టాడా ?"

"అవునమ్మా. కుటుంబంలో అనవసర కలహాలు రేగగలవని భయపడి రహస్యంగా దాచిపెట్టాను. నేను చాటుమాటున సర్దివేయాలని ప్రశ్నించి ఇంతటి విపరీతానికి కారకుడ నయ్యాను."

"అటువంటివి మనస్సులో పెట్టుకోకు. ఇందులో నువ్వు చేసిన దేముంది ? వాడి ఖర్మ ఏదో వా డనుభవించాడు."

"బొత్తిగా మనస్సులో దాచుకోలేక చెప్పానమ్మా. రహస్యంగానే ఉంచు. వెల్లడి చేసుకుంటే మనకే సిగ్గుచేటు."

"నాకు తెలుసు. సరే, నువ్వు లేచి ముఖం కడుక్కో."

"పెద్దవదినో, నువ్వో కాస్త నా పెట్టె, బెడ్డింగూ సర్దండమ్మా."

"ఇవాళే వెళ్తావా? "

"ఊఁ."

"వద్దు. రేపు వెళ్ళదుగానిలే. ఈరోజు వద్దు. నా కేమిటో ఈరోజున మనస్సు బాగుండలేదు, శకునాలూ బాగుండలేదు."

"అలా కాదమ్మా. ఇక్కడినుంచి పోవాలి, కాస్త నా మనస్సు స్థిమితపడాలి. కాదనకు, మళ్ళీ వస్తా."

"సరే. మరి నీ ఇష్టం."

# 21

"డియర్ రాణీ!

క్షేమం. అందరి క్షేమసమాచారం వ్రాయి. వచ్చేముందు నేను కన్పించకుండా, నీతో మాట్లాడకుండా వచ్చినందుకు ఏమనుకున్నావు ? క్షమార్హుడను. మనస్సు బాగుండక — అన్యమనస్కంగా వున్న అటువంటి పరిస్థితిలో నిన్ను చూడడం ఇష్టంలేక కలుసుకోలేదు. మరోకారణ మేమీలేదు. బాధపడకు.

రాణీ ? ఏం వ్రాయను ! నా మనస్సును ఎలా తెలియపరచను ? ఇదివరలో రేడియో పరమప్రాణమిత్రంగా ఉండేది. కాని ఇప్పుడు నీపాట మినహా మరేమీ వినబుద్ధికాదే ! ఏం చేయను ? ఇందుకు గర్వపడనా ? నిందించనా ? నీకు తెలుసులే, నిన్ను నిందించలేనని. నిత్యం నీ సంగీతశ్రవణంలో పరవశించేరోజులు ఎప్పు

దొస్తాయోకదా? వెంటనే ఉత్తరం వ్రాయి. ప్రతి అక్షరంలోనూ దోబూచులాడే నీ నగుమోమునూ, నీ సుందర హృదయాన్నీ చూచి సంతోషిస్తాను.

—— నీ కిరణ్."

"డియర్ కిరణ్:

క్షేమం. మీ ఉత్తరం జేరింది. మీరు ప్రయాణంముందు కలియకుండా వెళ్ళిపోయినందుకు కలవరపడినమాట నిజమే. మీరు వెళ్ళి మూడు రోజులేగా అయ్యింది! కాని మూడు సంవత్సరాలైనట్లుంది నాకు.

నా వల్ల మీకు రేడియో శత్రువైపోయింది. మీ వల్ల నాకు వెన్నెల విరోధి అయ్యింది. తిరిగి మీతోనే రమ్మని చెప్తే ఈ నెలరేడుకు సిగ్గులేదే? విన్పించుకోడు. తొంగి తొంగి చూచి కవ్విస్తాడు. మీరు వచ్చాక మన మిద్దరం కలసి అతడినే వెక్కిరిద్దాం. త్వరలో రమ్మని రాయకుండా ఉండలేకపోతున్నాను.

——మీ రాణి.''

''డియర్ రాణీ:

నీ ఉత్తరం చూచి నిజంగా నిన్ను చూచినంత సంతోషించాను. నీ ఉత్తరం అందుకోగానే మరి ఆఫీసులో నిలువబుద్ధికాక వెంటనే ఇంటికొచ్చేసి నిన్ను గురించే తీయని కలలుకంటూ గడిపాను. నీవు ఎదుట కూర్చుని తీయని కబుర్లు చెప్తున్నట్లే, మృదుమధురంగా నా కిష్టమైన ఆ కీర్తనను గానం చేస్తున్నట్లే – కనులకు కన్పించింది. చెవులకు విన్పించింది. అదంతా నా భ్రమేనా? లేక ఆ సమయంలో నిజంగా నువ్వు ఆ కీర్తన పాడుతున్నావా?

ఒక తమాషా జరిగింది: నీ గురించిన ఊహలతో – కలలలో నేను తేలిపోతూంటే హఠాత్తుగా మా మిత్రబృందం వచ్చిపడ్డారు. నేను ఎంత మైమరచిపోయి ఉన్నానంటే 'హలో' మంటూ నవ్వుతూ కేరింతాలు కొడ్తూ పదిమంది నా గదిలో ప్రవేశించిన విషయమే గమనించలేదన్నమాట! 'ఏమోయ్, వ్యవహారం ఏదో రస పట్టులో పడినట్లుంది, తీరు చూడగా? అంత పరధ్యాన మేమిటి?' అనడిగాడు ఒకతడు.

'నిత్యం నీతోనే కాపురం చేసే ఈ రేడియోకి ఇటువంటి దురవస్థ పట్టిందే'మని అడిగాడు మరొకతడు రేడియోపై పేరుకున్న దుమ్ము దులుపుతూ.

మరొకతడు ఎదురుగా టేబుల్‌పై నిత్యం నేను ఆరాధిస్తూన్న నీ ఫోటోను చూడనే చూశాడు. ఇం కేముంది? హాస్యాలూ, ఆరాలూ బయలుదేరాయి. అసలు విషయం చెప్పక తప్పలేదు నాకు.




నీ విషయం వినగానే ఎగిరిగంతేసి, ఎంతగానో అభినందించారు నన్ను. నిన్ను ఎప్పుడు చూస్తామా అనే తహ తహలో ఉన్నారు.

అన్నట్టు అక్కడ పరిస్థితులన్నీ బాగానే ఉన్నాయి కదూ? మనకు హానిచేసే వ్యక్తి గతించాడుగా? మరి ఫర్వాలేదని భావిస్తాను. ఏమైనా ఉంటే సంకోచించకుండా వ్రాయి.

అమ్మగారికీ నాన్నగారికీ నా నమస్కారాలు.

— నీ కిరణ్."

"నా కిరణ్!

పరిస్థితులు బాగానే ఉన్నాయి. గొడవ లేవియు లేవు. కాని మీ వదినగారి కోపం అలాగే ఉన్నట్లు తెలిసింది. సరే, దానికేం గాని, మీపై నా కెంతకోపం వచ్చిందో తెలుసా? నాగురించి అందరికీ చెప్పేస్తున్నా రన్నమాట? అలాగైతే మీకూ నాకూ మాటల్లేవు. మీకు ఉత్తరాలే వ్రాయను. అయితే అక్కడ నా ఫోటో ఎగ్జిబిషన్‌కు పెట్టారన్నమాట? ఇంతటివారని తెలిస్తే ఇవ్వకపోయేదాన్ని. చాలుగానీ నా ఫోటో నాకు పంపించివేయండి. లేదా, ఇకమీదట బుద్ధిగా ఉంటానని వాగ్దానం చేయండి.

అబ్బ, ఈ పౌర్ణమిచంద్రు డెంతకొంటెవాడు! ఎందుకో కొమ్మల మాటున నుండి తొంగిచూస్తూ పకపకా నవ్వుతున్నాడు. తనకంటె అందగాడైన మీ రున్నారని తెలియదు కాబోలు! ఇవాళ పౌర్ణమి! అంటే ఇప్పటికి మీరు వెళ్ళి పదిరోజులైం దన్నమాట. అంతేనా? పదియుగాలే పరుగులిడిన ట్లుంది. ఎప్పుడు వస్తారు? మీ రాకకై చూస్తున్న—

— రాణి."

"ప్రియాతి ప్రియమైన రాణీ!

నీ కోపం విని హడలిపోతా ననుకున్నావా? పకపకా నవ్వుకున్నాను. తెలుసా? నీ ఫోటోను ఎగ్జిబిషన్‌కు పెట్టాలన్న సంగతి ఇదివరలో నా ఊహకు తట్టనేలేదు సుమా! బలే 'అయిడియా'! ఈ క్షణంనుండే అది అమలులో పెట్టదలచుకున్నాను. 'నా ఫోటో నాకి'మ్మన చాలా తేలికగా అడిగేశావుకానీ – అంతసులభమా? నా కన్ను లలో కదులాడే నీ రూపాన్నీ, నా హృదయంలో హత్తుకుపోయిన నీ గానాన్నీ, నేను దొంగిలించిన నీ మనస్సునూ తిరిగి తీసుకోవడం అంత తేలికైన పనికాదు, డియర్!

అయితే చందమామ కంటె అందమైనవాడినా నేను? అహ, మనలో మన మాట. నీకు పదిరోజులు పది యుగాలుగా ఉంటే, నాకు పదిపదుల యుగాలుగా వున్నాయి. కాని ఇప్పట్లో సెలవు – దొరకదని కాదనుకో – అడిగితే బాగుండదు. నెలాఖరున వస్తానులే; అంతవరకూ ఇలాగే కలలుకంటూ ఉత్తరాలతో మాట్లాడు కుందాం.

వచ్చేటప్పుడు ఏం తెమ్మంటావు నీకు? తెలుసుగా ఏం తెస్తానో! టా టా!!

— కిరణ్."

"డియర్ కిరణ్!

కాలచక్రం ఎంత మెల్లగా పరిభ్రమిస్తూంది? మీరు వచ్చేరోజు దగ్గరైనకొద్దీ కాలం మందకొడిగా సాగుతూన్నట్లుంది, అదేమిటో మరి!

నెల రోజులలో ఇరవైయేడు ఉత్తరాలు నడిచాయి మనమధ్య! నిజంగా 'రికార్డ్ బ్రేక్'. ఎప్పుడూ ఎవరూ వ్రాసుకుని ఉండరు; వ్రాసుకొనబోరు. అది మనకే చెల్లింది. నెలాఖరున తప్పకుండా వస్తానన్నారు. వచ్చి తీరవలసిందే–వాయిదా వేస్తే సహించలేను. ఎప్పుడు వచ్చేదీ వ్రాయండి, ఎదురు చూస్తూంటాను; మరోమాట వద్దు. రానంటే ఇక నేను ఉత్తరాలు వ్రాయను.

— రాణి."

# 22

"ఏమి ఇంత హఠాత్తుగా వచ్చారు ? ఇంతకుముందే మీ ఉత్తరం అందింది. అందులో వస్తూన్నట్టు వ్రాయలేదే ?" అంది రాణి హఠాత్తుగా సాయంత్రసమయంలో వచ్చిన కిరణ్‌ను చూచి.

"అవును. వ్రాయలేదు." అన్నాడు నవ్వుతూ.

"రండి. కూర్చోండి." అంటూనే లోపలికి పోయి పదినిమిషాలలో తిరిగివచ్చింది చేతిలో పళ్ళరసంగ్లాసుతో.

"హఠాత్తుగా వచ్చి నన్ను ఆశ్చర్యపరచుదా మనుకున్నారు కదూ !"

"కాదులే. హఠాత్తుగా రమ్మని ఇంటినుండి టెలిగ్రాం వస్తే నేనే ఆశ్చర్యపోతూ వచ్చాను."

"ఏం ? ఏం జరిగింది ? అందరూ కులాసా గద !" ఆందోళన వ్యక్తపరచింది దేవరాణి.

"ఆ, అంతా కులాసానే."

అంతలో రాయుడూ యశోదాదేవీ వచ్చారు.

"కులాసానా బాబూ ? ఎప్పుడొచ్చావు ? ఉత్తరం వ్రాయలేదు." అన్నాడు రాయుడు.

మర్యాదగా లేచినిల్చుని నమస్కరించాడు కిరణ్. "నిన్నరాత్రి వచ్చానండీ." అంటూ.

"నిన్న సాయంత్రం కమలమ్మ వదినగారు ఆలయంలో కన్పించారు. ఇలా నీవు వస్తున్నట్టు చెప్పలేదు." అన్నది యశోద.

"చెప్పలేదాండీ ?" లోపల ఆశ్చర్యంగా వున్నా, పైకి వ్యక్తం చేయలేదు కిరణ్.

"బహుశః వస్తానో రానో నిర్ధారించుకుని వుండరు మరి. అందువేత చెప్పలేదనుకుంటానండీ. మొన్నరాత్రి టెలిగ్రాం వచ్చింది. నిన్న ఉదయమే బయలుదేరి వచ్చేశాను."

"టెలిగ్రామా ? ఏమిటి విశేషం ? మా కేమీ తెలియదే ?" అన్నాడు ధర్మారాయుడు అతి ఆశ్చర్యంగా. జగన్మతీ నేనూ నిన్న ఉదయం కల్సుకున్నాం. అటువంటి వేమీ అనుకోలేదే ?"

కిరణ్ ఏమీ మాట్లాడలేదు. సంకోచిస్తూన్నట్లు కన్పించాడు.

"చెప్పడానికి సంశయిస్తున్నావు. అంత రహస్యమా ? మరేమీ ప్రమాదం జరగలేదు కద ?"

ఇక కిరణ్‌కు చెప్పక తప్పలేదు. "మా చిన్నవదినగారు పుట్టింటికి వెళ్ళిన సంగతి మీకు తెల్సుగా," అన్నాడు ఉపోద్ఘాతంగా.

"అవును. అయితే?" శ్రోతలు ముగ్గురూ ఒకేసారి ప్రశ్నించారు.

ధర్మారాయునివైపు తలెత్తి చూస్తూ, చిన్నగా నవ్వి అన్నాడు కిరణ్. "కుటుంబ విషయమే అయినా మీరూ నాకు ఆప్తులేగనుక చెప్తున్నాను. గంగన్న నేరాన్ని మీరైతే కప్పిపుచ్చారుగాని అంతచతురత అందరికీ ఉండదు."

రాయుడు కొంచం చలించినట్లు కన్పించాడు. "అయితే నీకు తెలుసన్నమాట ఆ విషయం?"

యశోద అయోమయంగా చూచింది. "గంగన్న నేర మేమిటి?" అనడిగింది.

అన్ని విషయాలూ తెలిసిఉన్న దేవరాణి వదనంలో ఏభావమూ వ్యక్తంకాలేదు మౌన గంభీరముద్రతో ధరణి కభిముఖమై ఉన్నది ఆమె ముఖం.

"ఏమిటిది? నా కేమీ తెలియలేదు," యశోద రెట్టించింది.

"ఏం లేదులే," అంటూ సంగతి మాపేయడానికి చూచాడు రాయుడు.

కాని అర్థయుక్తంగా నవ్వుతూ అన్నాడు కిరణ్. "ఇంకా దాపరికం దేనికి లెండి. ఎంత ఆత్మీయుల ఎదుటనైనా బంధువుల రహస్యాలు వెల్లడించడం భావ్యం కాదని అప్పుడు ఆ విషయం వదిలేశాను. ఇక యింతవరకూ వచ్చాక అందరికీ కాకపోయినా అయినవారికైనా విషయం తెలిసిఉండడం మంచిదనుకుంటున్నాను.

"వద్దు కిరణ్, ఆడవాళ్ళకు తెలియకూడదు. ఎప్పుడో మరీ ఆవేశం నిగ్రహించుకోలేనప్పుడు తొందరపడిపోయి అందరికీ వెల్లడి చేసేస్తారు."

గంభీరంగా నవ్వాడు కిరణ్. "మరి మీకు తెలిసినవాటికంటె ఎక్కువ విషయాలు తెలుసే మీ అమ్మాయికి; ఏదీ, ఏమైనా వెల్లడి చేసిందా?"

ఆశ్చర్యంతో చూడడమే కాని మరి మాట్లాడలేకపోయాడు ధర్మారాయుడు.

"అవునా రాణీ?" అన్నది యశోద.

రాణి విన్పించుకోనట్టు లేచి మెల్లమెల్లగా అక్కడినుండి కదిలిపోయి అక్కడే కొద్దిదూరంలో నిల్చుంది, పూలమొక్కల దగ్గర. అటుచూచి ఒక నవ్వు విసరి చెప్పడం మొదలుపెట్టాడు కిరణ్.

"కారకుడైన గంగన్న చనిపోవనే చనిపోయాడు. ఇక సాక్ష్యాలం – మనం మినహా వేరెవరూ లేరు. చెప్పుకోడానికి సంకోచించ నవసరం లేదులెండి," అంటూ యశోదవైపు తిరిగి "మన పొలాలలో వరికుప్పలు తగలబడడానికి వెనుక పెద్ద

కథ వున్నదండీ. చనిపోయినవాడినిగురించి అంతగా అనుకోరాదు; కానీ — మా గంగన్నే ధనాశతో ఆ పని చేశాడు."

వినగానే అతి ఆశ్చర్యం ప్రకటించగల దనుకొన్న యశోద, ఏమీ క్రొత్త విషయము విననట్లే నిర్లిప్తంగా ఉండిపోయి, కొలదిసేపటికి అన్నది: "నిర్ధారణగా తెలియదు కానీ, నేనూ అలాగే-అనుమానించాను; రెండుమూడుసార్లు, మిట్టమధ్యాహ్నం మంచి ఎండవేళ, ఒకసారి ఇంచుమించుగా అర్ధరాత్రి సమయంలోనూ ఈ ఆవరణలో తారట్లాడుతూ కన్పించాడు. ఏమైనా పనిమీద కమలగారో, జగపతిగారో పంపగా వచ్చాడేమో నని నేను కారణ మడుగబోతే మాట్లాడకుండా ఖంగారుపడ్తూ వెళ్ళిపోయాడు. ఏమిటో అప్పుడే అనుమానించాను; కాని, నిరాధారంగా ఎందుకు కలవరపడా లనుకున్నాను. అదీగాక అతడు కాబోయే వియ్యాలవారి నౌఖరు: మాపై ఎవరికీ అంతకక్ష ఉన్నట్టుకూడా అనిపించలేదు — అందుచేత ఏమిటో అప్పట్లో అంతగా అనుమానించలేదు."

కిరణ్ ఆపుకోజాలని ఆనందంతో అన్నాడు: "ఎంతటి ఉన్నత హృదయాలు, మీ కుటుంబంలో అందరిలోకూడా! ఇంత జరిగినా మీ అనుమానాలను ఇతరులతో కాదు సరికదా — మీలో మీరుకూడ తెలియజెప్పుకోలేదన్నమాట?"

"ఆఁ. అందులో ఏముంది లేవయ్యా? ఇంతకూ సెలవు ఎన్నాళ్ళు పెట్టి వచ్చావు?" విషయం తేల్చివెయ్యబోయాడు రాయుడు.

"చెప్పనీండి మరి; అవన్నీ చెప్తేకాని ఈ విషయం చెప్పడానికిలేము," అన్నాడు కిరణ్.

"అవును చెప్పనివ్వండి," అన్నది యశోద భర్తతో. "గంగన్నచేత ఆపని ఎవరు చేయించా రంటారు? ఎందుకు?" అనడిగింది కిరణ్‌ను.

"తలవాల్చి మెల్లగా చెప్పాడు కిరణ్. మా చిన్నవదినగారి కీ వివాహం జరగదము ఇష్టంలేదు. ఆమె చెల్లెలు ఇంద్రాణిని చేయాలని ఆవిడ తాపత్రయం. ఆ కోరిక నెరవేరకపోవడంతో కోపం ఆవిధంగా తీర్చుకుంటున్నారు."

యశోదా. రాయుడూ కూడ ఏమీ మాట్లాడలేదు, కాని హృదయాంతరాళం నుండి బరువైన నిట్టూర్పులు వెలువడ్డాయి.

సాలోచనగా మెల్లని స్వరంతో అన్నాడు కిరణ్: "గంగన్న చనిపోయిననాడు విచారమే కలిగిందికాని, తర్వాత అన్పించింది: అదికూడ మన మేలుకేనని వాడే బ్రతికుంటే ప్రాణహానికి కూడ తలపెట్టునేమో?"

యశోద ఉలిక్కిపడి చూచింది. చాలసేపు మౌనమే తాండవమాడింది.

"అయితే నీరాకకు కారణం మాత్రం తెలియలేదబ్బాయ్," అన్నాడు రాయుడు చాలా సేపటికి.

కిరణ్ జవాబు చెప్పాడు: "చిన్నవదినగారు మరి కలసిఉండదనీ, భాగాలు పంపకం చేసి వేరే కాపురం పెట్టనిదే రాననీ, పుట్టింటినుంచి కబురు పంపారట."

విస్తుపోయి చూచారు అందరూ. దూరాన నిల్చున్న రాణికూడ చకితురాలైనట్లు ఇటు తిరిగిచూచింది.

"మరి మీ చిన్నన్నగా రేమంటారు ?" అన్నాడు రాయుడు.

"ఏమంటాడు ? ఆయన ఆమోదంలేనిదే వదిన ప్రవర్తన అలా ఉంటుందా ?" విచారంగా నవ్వాడు. "అందుకే ఇక తప్పక నన్నుకూడా రప్పించారు నాన్నగారు. విడిపోవడం ఎటూ తప్పదు. కాని భాగాల పంపకం విషయంలోనే గొడవలు రేగే ట్లున్నాయి."

"అదేం ?"

"ఏముందండీ ? తండ్రీ కుమారులూ సరసంగా పంచుకోవడమైతే ఏబాధా వుండదు. కాని ఎక్కడ అన్యాయం జరిగిపోతుందో నన్నట్లు చినన్నయ్య తరఫున అతడి మామగారు వచ్చి కూర్చున్నారు. నేను ఇదివరలో పెద్దన్నయ్యనూ, వది ననూ ఇటువంటి విషయాలకు అతీతంగా అంచనా వేసుకొనేవాడిని, కాని నేటితో ఆ అంచనాకూడా తప్పిపోయింది."

కొద్దిసేపు ఆగి తిరిగి మొదలుపెట్టాడు. "కొందరు అందరిలాగా అడుగడుగునా బయటపడరు, కాని ఏదో ఒక్క సందర్భంలో అసలు స్వరూపం ప్రదర్శించి మిగిలినవారి కేమీ తీసిపోమని ఋజువు చేసుకుంటారు ... పెద్దన్నయ్య తరఫున అతడి బావమఱది వచ్చి కూర్చున్నాడు. ఇలా వా రిద్దరూ వస్తున్నట్లు నాన్నగారికీ అమ్మగారికీ తెలియనే తెలియదట. అంత గుంభనగా జరిగాయన్న మాట రాయబా రాలు! తీరా వారు వచ్చినతర్వాత నాన్నగారికి అసలువిషయం. తెలిసి అప్పుడు నాకు వైర్ ఇచ్చారట; నిల్చున్నపాటున బయలుదేరి వచ్చేశాను."

ఆశ్చర్యంగా వింటున్నారు రాయుడూ, యశోదలు. దూరాన ఉన్న రాణికూడ శ్రద్ధగా వినసాగింది.

"ఏదో పెద్ద విరోధ మేర్పడినట్లుగా అన్నయ్య లిరువురూ ఇంట్లో ఎవరితోనూ మాట్లాడకుండా వాళ్ళ గదులలో వాళ్లు కూర్చుంటున్నారు. వాళ్ళ తరఫున వాళ్ళ బావమఱదులూ, మామగారే నాన్నగారితో వాదించడం."

"పోనీ అంత తాపత్రయం దేనికీ జగపతికి ? అంతవరకూ వచ్చాక ముక్త

సరిగా ఎవరిది వాళ్ళకు పంచిపారేయకూడదూ?" అన్నాడు రాయుడు.

"అభ్యంతర మేముందండీ? నాన్నగారు అలానే పంచుతానంటున్నారు; కాని, ఒకటి — సమంగా నాలుగు వాటాలు వేసి నాన్నగారు ఒక భాగం తీసుకుని, అమ్మా నాన్నగార్ల అనంతరం తిరిగి అది అందరికీ సమంగా సంక్రమించేట్టు వ్రాస్తామంటున్నారు."

"ఓ దివ్యంగావుంది ఆలోచన! ఇంకేం?"

"హుఁ, సక్రమంగా ఆలోచించే ఎవరికైనా దివ్యంగానే కన్పిస్తుందండీ; కాని, గొడవలూ, అక్రమాలూ కావలసినవాళ్ళకు అంత సవ్యమైన మార్గం నచ్చదు. మూడువాటాలూ ఖచ్చితంగా చేసి, అమ్మా నాన్నగార్లను వంతులవారీగా ముగ్గురి దగ్గరా ఉండమంటున్నారు."

"ఏమిటీ?" ఆశ్చర్యంగా అరిచాడు రాయుడు. "జగపతినా అంత మాట అనడం!"

"అదేనండి నాకూ నాన్నగారికీ కోపం. అప్పుడే అధికారం వదలుకొని అందరిపైనా ఆధారపడవలసినంత అల్పులా? అప్రయోజకులా? వృద్ధులా? అదెంత అవమానమో ఆలోచించండి. అసలా ఊహే ఆయనపట్ల కలగడం అవమానకరం. అది పరాయివాళ్ళకు తెలియకపోయినా, అన్నయ్యలకెలా తెలియలేదో నా కర్థం కావడంలేదు."

"హుఁ! లోకంలోని చిత్రాతిచిత్రాలు!" స్వగతంలాగా అనుకుంటూ తనలో తానే నవ్వుకున్నట్టు నవ్వుకున్నాడు ధర్మారాయుడు.

"పిల్లలు లేకపోతే ఒక బాధ, పుట్టిచస్తే ఒకబాధ. పుట్టి పెరిగితే మరొకబాధ. మాయదారిలోకమూ, బాధలూ." అన్నది యశోద అతి విరక్తితో.

కొద్ది ఆశ్చర్యం ప్రకటించాయి కిరణ్‌నేత్రాలు. "సరిగా నిన్న అమ్మగారు కూడా అదేమాట అన్నారండీ," అన్నాడు.

"అలా అనుకొనే పరిస్థితులు వస్తే అనుకోకేంజేస్తారు మరి? పాపం. సిగ్గుపడిపోయాడు కాబోలు; అందుకే జగపతి నాతో ఏమీ చెప్పలేకపోయాడు. లేకుంటే అతడు నాదగ్గ రేమీ రహస్యాలు ఉంచడు. ఒకసారి వచ్చి చూస్తాను సాయంత్రం."

కిరణ్ ఏమో అనేలోగా రాణి అన్నది: "వద్దు నాన్నా! మరేమీ అనుకోకండి. అది పూర్తిగా వారి కుటుంబ వ్యవహారం. ఎంత స్నేహితులైనా వెళ్ళడం బాగుండదు; వెళ్ళి చేయగలిగినదీ లేదు."

"అమ్మాయిమాట నిజమే." యశోద అందుకుంది. "ఈయన మూడోఅతడి కాబోయే మామగారుగా వచ్చాడేమోననికూడా అనుకోవచ్చు! వికలమైన మనస్సు

ఎన్నిరకాల నిర్ణయాలైనా చేస్తుంది. అది వ్యక్తుల తప్పిదంకాదు.''

"నిజమే,'' అన్నాడు రాయుడు.

కిరణ్ మనస్సు తనలో తానే నవ్వుకొన్నకారణం కిరణ్‌కే తెలియదేమో!

* * * * *

దేవరాణితో కలసి ఏకాంతంగా షైరువెళ్ళి పొలాలవెంబడి తిరుగుతూంటే కిరణ్ మనస్సుకు కొంత విశ్రాంతి లభించింది.

ఇద్దరి హృదయాలనూ ఏదో అవ్యక్తభారం ఆవేశించడంతో చాలసేపు సంభాషణే కరవైంది.

కడకు కిరణ్ మెల్లగా అన్నాడు: "రాణీ, నా కేంకావాలో తెలియదా? అంత మౌనంగా కూర్చున్నావ్?"

"హుఁ, తెలియకేం? చక్రవాకం కావాలి మీకు," అంది అదోకమాదిరిగానవ్వుతూ.

"మరి? ఇంకా ఆలస్యం దేనికీ?''

విషాదపు వాన కురిసినట్టే నవ్వింది దేవరాణి. "ఇంకా ఆ పాటపై అంత మోజు దేనికీ మీకు? నిర్మలంగా నిండుగా సాగిపోతూన్న మీ కుటుంబంలో ఇన్ని కలతలు రేగడానికి మూలం — ఆ కీర్తనా, నేనేగా?"

"రాణీ!" ఎంత కోపమైనా వచ్చింది కిరణ్‌కు. "అక్కడ లేని మనశ్శాంతిని

నీ సమక్షంలో పొందుదామనే వచ్చాను కాని నీకింతబాధ గలిగిస్తానని అనుకోలేక పోయాను — నా పొరపాటు వుంటే క్షమించు, వెళ్తాను," అంటూ చేతులలో ఉన్న రాణిని వదిలేసి లేచాడు కిరణ్.

"కిరణ్!" దిగ్భ్రాంతితో, నీరసంగా అన్నది రాణీ.

"అవును రాణీ! గొడవలు రావడానికి నువ్వు కారమణని నేను కలనైనా తలచ లేదు. కాని, ఈ గొడవలూ, కలతలూ ఉన్న మోటుకుటుంబంలోనికి రావడం నీకు అభ్యంతర మౌతుందేమో నన్న ఆలోచన లేకపోయింది."

"కిరణ్!" లేచి, అతడి చేతులను ప్రాధేయపూర్వకంగా పట్టుకున్న రాణి నేత్రాలు వర్షఋతువులోని జలధరాలే అయ్యాయి. "నా అభిప్రాయాన్ని వెలిబుచ్చానే గాని అందులో అన్ని ఆలోచనలు లేవు కిరణ్. ఒకవేళ నాకు తెలియకుం డానే వుంటే క్షమించండి; మనఃపూర్వకంగా క్షమించండి. లేకుంటే మీ కోపం తగ్గేవరకూ మరో నాలుగు తిట్టండి; అంతేకాని తృణీకారం వద్దు; తిరస్కారం సహించలేను," అంటూనే బావురుమన్నది.

కరగిపోయాడు కిరణ్. నిన్ను తిరస్కరించగలనా? నిన్ను తృణీకరించి దూషింపడం ఈ జన్మలోనా రాణీ? ఇందాక మీ అమ్మగారు అందుకే అలా అన్నారు — అప్పుడా మాటలు అర్థంకాలేదు. నిజంగా వికలమైన మనస్సు విచ్చలవిడిగా ఎన్ని యోచనలైనా చేస్తుంది. మరచిపో అవంతా," అంటూ దగ్గరకు తీసుకుని ఆ కన్నీరు తుడిచాడు.

"ఏదీ. కూర్చుందాం. ఊఁ, పాడుమరిఆపాట. మొదలుపెట్టు-నాకు తెలియదనిసగమే పాడేవు సుమా! ఒప్పుకోను-ఆమాత్రం గ్రహించగలను-సంగీతం రాకపోయినా."

కన్నీళ్ళను త్రోసిరాజని మధురహాసాలు వెల్లివిరిశాయి.

పాటకు పరవశించిన మనస్సుతో, ప్రియసమాగమపు టానందంతో గృహోన్ముఖుడయ్యాడు కిరణ్. మనోహరుని మమతకూ మంచి మనస్సుకూ పొంగి పరవశమైంది రాణి.

## 23

"కిరణ్‌వంటివ్యక్తి నీకు భర్తగా లభించడం నీ అదృష్టం రాణీ," అన్నాడు ధర్మారాయుడు భోజనం చేస్తూ రాత్రి. రాణి నవ్వి ఊరుకుంది.

"అది నేనూ ఒప్పుకుంటాను." యశోదాదేవి అన్నది. "కాని అత డింకా భర్త కాలేదు. భరగా నిర్ణయింపబడ్డాడు. అంతే."

"అయితే ఏ మంటావు?" అర్థం కానట్లు ప్రశ్నించాడు రాయుడు.

"ఏముంది? ఆ వివాహం కాస్తా - దేవుడు పుణ్యాన అయ్యేవరకూ కాస్త ఎవరి హద్దుల్లో వా రుండాలి. అంత విచ్చలవిడిగా విహరించడం నా కేమీ బాగుండలేదు. మనం ఎంత పట్టణాలలో ఉండివచ్చినవాళ్ళమైనా ప్రస్తుతం ఉన్నది పల్లెటూరు. అదీ కాక ఎక్కడున్నా, మన ఆచారసాంప్రదాయాల కనుగుణంగా ఉండడమే ఉత్తమం."

తేలికగా నవ్వాడు రాయుడు. "నిజమే. కాని చూడు, కిరణ్‌వంటి ఉత్తముని విషయంలోమాత్రం అటువంటి నిబంధనలు అనవసరం. ఆచారాలూ, సాంప్రదాయాలూ అంటే ఏమిటి? మోసాలూ, అన్యాయాక్రమాలూ జరగకుండా ఏర్పరచిన నిబంధనలు, అంతే. అవి అవసరమైనప్పుడు పాటించాలే కాని అన్నివేళలా కాదు. అటు కిరణ్, ఇటు రాణీ ఇద్దరూ రెండు మణిపూసలవంటివారు. వేరొక వంక కళ్యాణం కుదిరేవుంది; ఇక భయం ఏ విషయంలో?"

"అవన్నీ నే నాలోచించలేదంటారా?" విసుగ్గా అంది యశోద. "అవన్నీ నాకూ తెలుసు. అయినా జాగ్రత్తలో, పరుల నోళ్ళలో పడకుండా వున్నంత శ్రేయ

వ్యర్థమైంది అదే కాని మరొకటి లేదు. ఇప్పటికే యిన్ని దారుణాలు జరిగాయా? వివాహానికి వ్యవధి ఇంకా నాలుగు నెలలుంది — ఆ కుత్సితులు ఈలోగా ఏం చెయ్యనున్నారో, ఏం జరుగనున్నదో?"

"వెఱ్ఱిదానా! ఎవ రేం చేయాలనుకొంటే అవుతుందే? దైవఘటన ఉండద్దూ? మన మెప్పుడైనా కలనైనా ఎవరికైనా అపకారం చేశామా? మనరాణీ ఎంత ఉత్తమురాలు! అసలు 'తప్పు', 'పాపం' అనే రెండూ దానికి తెలుసా? అటువంటి మనల్ని దేవుడు ఎందుకు పాడుచేస్తాడు చెప్పు?"

"హుఁ!" అతి విచారింగా నవ్వింది యశోద; "ఏం పాపం చేశామని దైవం మరి చేతికందివచ్చిన కొడుకును తీసుకుపోయాడు?"

అంతే. ఆ ప్రసక్తివస్తే ధర్మారాయుడు నోరు మరిమెదలదు. కంఠం పూడిపలుకదు.

"మన మేం చేశామనే భరోసామీద బ్రతకలేరు మనుషులు. మంచితనాన్ని గుర్తించే ప్రపంచాన్ని సృష్టించలేదు ఆ దేవుడు. సహృదయులకూ, సన్మార్గులకే ఈ పృధివిలో కష్టాలూ, పరీక్షలూ ఎక్కువంటారు;" అంటూనే గతించిన కుమారుని స్మృతితో చెమర్చిన నేత్రాలను ఒత్తుకుంటూ వెళ్ళిపోయింది తన గదిలోకి.

భారహృదయాలతో ఎవరిమట్టుకు వారు సంభాషణ ఆపేసి, తమ తమ గదులలోకి పోయారు.

ఎలాగైతేం పంపకాలు రెండురోజులలో అయ్యాయి. జగపతి మాటప్రకారమే జరిగింది. పై వ్యక్తులను, హద్దులుమీరి మాట్లాడి అధికారాలు చెలాయించనిచ్చే అవివేకీ, అసమర్థుడూ కాదతడు. దానికితోడు సూటిగా మాట్లాడి, నిర్మొహ మాటంగా ప్రవర్తించే మూడవపుత్రుడు కిరణ్‌కూడా అండగా నిలబడడంతో ఆయనమాట కిక తిరుగు లేకపోయింది.

అలాగని ఎవరికీ జరిగిన అన్యాయమూలేదు. స్థిర చరాస్తు లన్నీ ఖచ్చితంగా విడిపోయాయి.

ఆ పెద్ద భవంతికూడ నాలుగు వాటాలుగా విభజింపబడుతూంటే మాత్రం కమల కంట తడిపెట్టకుండా వుండలేకపోయింది. అంతవరకూ అతిబలవంతాన తెచ్చి పెట్టుకున్న నిగ్రహం చెదరిపోయింది. ఒక్కసారిగా కన్నీటి ప్రవాహం వెల్లువలై పారింది.

"పోనీ, మేడకూడా నాలుగు వాటాలు దేనికీ? మూడే సరిపోతాయిగా నాన్నా! నాకు మీరు బరువా?" ఎలాగో సాహసించి అన్నాడు కిరణ్.

"నీకు తెలియదు చినబాబూ! అలాగే జరగనీ," అన్నాడు పట్టుదలగా జగపతి.

కిరణ్ మరి తర్కించలేదు. నిశ్శబ్దంగా కుమిలి కుమిలి ఏడుస్తూన్న తల్లి దగ్గరకు పోయి కూర్చుని నెమ్మదిగా ఓదార్చసాగాడు.

"అమ్మా, ఇటువంటి విభజనలూ, వేర్పాట్లూ ఇంచుమించు ప్రతి కుటుంబంలోనూ ఎప్పుడో ఒకప్పుడు వచ్చేవేగా? తప్పే దేముంది? సర్వసామాన్యమైన విషయానికి నువ్వలా బాధపడితే ఎలా?" అన్నాడు చేరుమాలుతో తల్లి కన్నీ రొత్తుతూ.

"అలా అని సరిపెట్టుకోగలమా నాయనా? ఇప్పు డేం తక్కువైందని, ఏమంత పెద్దకారణా లున్నాయని ఈ పంపకాల అవసరం వచ్చింది? ఎప్పుడో పెద్దవాళ్ళం గతించాకనో ఎప్పుడో జరగవలసినవి ఇప్పుడే మా కండ్ల ఎదుటనే సహించగలమా?"

"పోనీమ్మా! ఏదో జరిగి పోతున్నదిగా! ఇక ఏమని ఏం ప్రయోజనం? నువ్వలా దుఃఖిస్తే నేను చూడలేను," అన్నాడు; మనస్సులో-ఒకప్పుడు రేడియోలో విన్న 'కలకంఠి కంటి కన్నీరు' అనే ప్రసంగం మెదులుతూండగా.

అటుప్రక్కనుండి పోతూన్న వనజ అన్నది కోపంగా: "ఏళ్ళు రాగానే సరా!

# HERE COMES
# THE BLUSHING BRIDE





**Yes, indeed—this is the finest and sweetest hour of her life: wedding bells and prospects of many years of happily married life. And a wealth of gratitude to father for his thoughtful planning and SAVING to make her future so secure**

**Your SAVINGS ACCOUNT assures you financial security. You are welcome to open your account at any of our branch nearest to you.**

**INTEREST 4% p.a.**
**Unlimited number of withdrawals**



# THE ANDHRA BANK LIMITED

**(The Bank For Friendly Service)**

**Regd. Office: Machilipatnam – Central Office: Hyderabad (A. P.)**




**K. S. DUTT**
**Chairman**

**T. R. BHAGAVAT**
**General Manager**

నిండుయింట్లో ఎవరో చచ్చినట్టు ఎందుకా ఏడుపు? ఎన్నాళ్ళీ ముసలివాళ్ళ అధికారాలూ, స్వతంత్రాలూ చూస్తూ ఊరుకోడం?''

"వదినా!" కోపంగా శక్తికొలదీ అరిచాడు కిరణ్. "ఎంతటిదానవు?" ఆశ్చర్యాగ్రహాలు పెనవేసుకుపోగా అనలేక అన్నాడు. వదినలను ఎప్పుడూ 'మీరు' 'అండి' అని గౌరవించే అతడు ఇవాళ ఆ వివశస్థితిలో పూర్వపు గౌరవ సంబోధనను మరచేపోయాడు.

"చిన్నవదినదే దురుసుస్వభావం అనుకునేవాడిని. కాని, నువ్వు అంతకంటె గొప్పదానివని ఇప్పుడిప్పుడు గ్రహించాను. సరే, అధికంగా మాటలు అనవసరం; కాని, నీ హద్దుల్లో నీవుండు. అమ్మను ఇప్పుడు, ఇకముందు – మరెప్పటికీ కూడా – ఒక దేవతలా కొలవవలసిందే. గుర్తుంచుకో;" అగ్నిసంకాశమయ్యాయి నేత్రాలు.

చిన్నమరది కోపాలు బాగా తెలిసినది కావడంవల్ల వనజ మరి మాట్లాడకుండా విసవిసా వెళ్ళిపోయింది.

చిన్నకుమారుని మాటలు వినిన మనస్సు వాత్సల్యానందాలతో పరవసించి పరవళ్ళు త్రొక్కగా, చిన్నబిడ్డను తీసుకున్నట్టే "నా తండ్రీ!" అంటూ ఒడిలోకి తీసుకుంది. "చిన్నప్పటినుండీ నీకు నాపై అభిమాన మెక్కువే. నీ పెళ్ళైన తర్వాత ను వ్వెలా గుంటావో!" అన్నది కనులు ఒత్తుకుంటూ.

"అప్పుడు నిన్ను ఆరాధించేవాళ్ళం ఒకళ్ళ కిద్దర మౌతామన్నమాట! రాణి ఎటువంటిదో నీకు తెలియదూ?" అన్నాడు నవ్వుతూ. క్షణకాలం విచారమంతా మరచిపోయి మనస్ఫూర్తిగా ఆనందంగా నవ్వింది కమల. అంతలోనే మళ్ళీ వదనము విచారమేఘాచ్ఛాదితమై పోయింది. ఇంటిని నాలుగు భాగాలుగా విభజించి ఎక్కడ కక్కడ గోడలు లేపడానికి అవసరమైన సామగ్రితో నలుగురు తాపీ మేస్త్రీలూ, అరడజనుమంది కూలీలూ వచ్చారు. హడావుడిగా వాళ్ళకు పనులు పుర్మాయిస్తూ కమలాకరం, శ్రీరాంలకంటె వారివారి బావమఱదులూ, మామగార్లూ చేస్తూన్న హంగామా చూస్తూంటే కమలకూ, కిరణ్ కూకూడా మనస్సులు వికలమైపోయాయి.

'హుం, పొరలుగమ్మిన నేత్రాలకు ఒక్కొక్కప్పుడు రక్తసంబంధీకులకంటె, కనిపెంచిన మమతా మార్దవాలకంటె నడిమివారూ, డబ్బునూ హోదానూ మాత్రామే చూచి గౌరవించే కుత్సితులూ ఆత్మీయులుగా కన్పిస్తారు కాబోలు!' అనుకున్నాడు లోలోన కిరణ్.

"తలిదండ్రులనూ ఆదరించవచ్చు, భార్యనూ ప్రేమించవచ్చు. ఒకరికోసం ఒకరిని వదలుకోవడం అవివేకం," అంది కమల నిర్లిప్తంగా, ఎటో చూస్తూ. అది

స్వగతమో లేక తన భవిష్యత్ ప్రవర్తనకు సలహాయో అర్థం కాలేదు కిరణ్‌కు.

"అయితే అసలీ జాడ్యం ఎందుకొచ్చిందమ్మా? పెద్దవదినకూడా ఇలా గెప్పుడు మారిపోయిందీ?" అసహనంగా అడిగాడు కిరణ్.

"మొదట్లో నేనూ అదే ఆశ్చర్యపోయాను. తర్వాత గ్రహించాను. ఒకళ్ళు త్రాచుపామైతే ఒకళ్లు పొడపాము. వాళ్ళంటూన్న మాటలూ, చేస్తూన్న పనులూ ఇంతా అంతా కావు. జానకి అనునిత్యం ధుమధుమలాడుతుంటుంది; వసు అప్పు డప్పుడు అసలుస్వరూపము ప్రదర్శిస్తుంటూంది. ఇంతే తేడా."

ఆశ్చర్యంగా వినసాగాడు కిరణ్.

"నీ వివాహం నిశ్చయించుకొన్న రోజున రాణికి పసుపు కుంకుమలతో పదే రు నవరసుల గొలుసూ, నా వడ్డాణం పెట్టాను. వాళ్ళనాడు వాళ్ళకుమాత్రం పెట్ట వా? కాకపోతే అప్పుడు చేయించిపెట్టాము. ఇప్పుడు, పోనీ చిన్నకోడలు కదా, క యింట్లో ఆడపిల్లలు మాత్రం ఎవరున్నారు పెట్టుకోవటానికని ముద్దుగా నావే వ్చాను మళ్ళీ పెళ్ళికని ఏవో కొన్ని నగలు చేయిస్తున్నాను; అదీ వాళ్ళకు దుగ్ధ. న్న కొడుకూ, ముద్దుల కోడలూ అని చేయిస్తున్నారని, పెద్దామెకు బాధ. ందుకు తోడు తన చెల్లెల్ని చేసుకోలేదని చిన్నావిడ బాధ. ఇంకా పైన చిన్న న్న కారణాలు అనేకం. ఊళ్ళో ఉన్నారు గనుక స్నేహితులకూ, బంధువులకూ వరికైనా పంపిస్తాం, మనకు కలిగినవి – పాలూ, పెరుగూ, పళ్లూ – ఒకటేమిటి? ఇలాగే రాయుడుగారికీ పంపిస్తున్నాం. అదేమో వాళ్ళకు ప్రత్యేకాభిమానంతో ంపేస్తున్నామని వాళ్ళ బాధ."

"వెతికితే అన్నీ కారణాలే. అసలు ఇష్టంలేకపోతే అనేక బాధలూ... స్తున్ గాను. పోనిద్దూ. ఎలాగో ఏడవనీ. నా పెళ్ళికి మధ్యన వీళ్ళందరికీ బాధ దేనికీ, తెలివితక్కువ కాకపోతే?"

*　　*　　*　　*

ఇలా పంపకాలు జరిగిన మరుక్షణంలో, అటు జానకి బండి దిగింది. భర్త స్వయంగా తోడ్తెచ్చాడు స్టేషనునుంచి. ఆమె వచ్చే క్షణంవరకూ ఆమెరాక ఇంట్లో మరెవరికీ తెలియదు!

జానకి బండి దిగి ఎవ్వరితోనూ మాట్లాడలేదు. కనీసం కన్నెత్తి చూడనైనా చూడలేదు. తన వాటాలో తాను ప్రవేశించి, కుటుంబాలు విడిపోయినప్పుడు కొండంత మమతలను క్రొత్తగా సృష్టించుకువచ్చే శ్రేయోభిలాషులైన ఇరుగుపొరుగులూ, దూరపు బంధువులతో, క్రొత్తగా ఏర్పడిన 'తన' ఇంటిని సర్దుకోసాగింది.

Printed and Published by Sri A. Sudakar Rao for Yuva Concerns
at Yuva Press, Hyderabad-1. Telephones, 36336, Press, 34400
Controlling Editor : Sri "CHAKRAPANI"

